# విషయసూచిక

ఆంధ్రమహాభారతము.

## కర్ణపర్వము — ప్రథమాశ్వాసము.



## కర్ణపర్వము — ద్వితీయాశ్వాసము

## కర్ణపర్వము — తృతీయాశ్వాసము



## శల్యపర్వము — ప్రథమాశ్వాసము.

## శల్యపర్వము - ద్వితీయాశ్వాసము.



## సౌప్తికపర్వము - ప్రథమాశ్వాసము.

## సౌప్తికపర్వము — ద్వితీయాశ్వాసము.



## స్త్రీపర్వము — ప్రథమాశ్వాసము.



## స్త్రీపర్వము — ద్వితీయాశ్వాసము.







హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## కర్ణపర్వము, ప్రథమాశ్వాసము.



పరిణామస్థితివి
ద్యాపారీణత్వకారితానిరతాహం
గా పరమనైష్ఠికత్వ
వ్యాపారప[1]రానుషక్త హరిహరనాథా. 1

సంజయుఁడు ధృతరాష్ట్రునకుఁ గర్ణుని తెగుటం జెప్పుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు మహాప్రాజ్ఞుం డగుసంజ
యుండు దండుననుండి హాస్తిపురంబున కరుగుదెంచి ధృతరాష్ట్రుమందిరంబు
ప్రవేశించి యంతఃపురంబున నున్నయన్నరనాథుం గనుంగొని కృతప్రణాముం
డగుటయు నతం డాదరించిన నాసీనుం డై. 2

క. బలవిక్రమములు వినుతం,బులుగా మనమొనలుఁ బాండుపుత్త్రానీకం
బులు రెండునాళ్లు పోరుటఁ, దెలియంగాఁ జూచి వచ్చితిం గురునాథా. 3

వ. అని పలికి కర్ణునిం బ్రశంసించి. 4

చ. నరకుగొనండు పాండుసుతసైన్యనికాయము నించుకేనియుం
గరులు రథంబులుం హరులుఁ గాల్బలముల్ దనవీఁక విచ్చియున్
మరలియుఁ దూలియుం బిలుకుమాఱియు నల్గడఁ బాఱియుం వియ
చ్చరులకు వేడ్క సేయ భుజసారము శౌర్యముఁ జూపె నేపునన్. 5

వ. చూపి యక్కౌంతేయులం గలంచి యాడి పదంపడి. 6

తే. తనకు [2]బిమ్మిటి యైనయర్జునుని బాహు,లీల నెమ్మియిఁ ద్రోవంగలేక తెగియె
నధిప యాఁబోతు బెబ్బులికగ్గ మైన,వగిది[3]యై పాండవులకును బగయడంగె.

వ. అనుచు శోకోపహతుం డై సూతసూనుండు నిట్టూర్పు నిగిడించి డగ్గుత్తిక వెట్టి
యి ట్లనియె. 8

చ. అది యొకఁ డేల కౌరవచయంబు జయాశ యడంగిపోవ బె
ట్టిదుఁ డగుభీమసేనుఁడు గడిందిమగంటిమి దుస్ససేనుదు

1. క. రానురక్త. 2. గ. బిమ్మట యైన. జ. మిక్కుట మైన. 3. జ. యయ్యెఁ బాండవులకుఁ బగ.

ర్మద మడఁగించి పేరురము వ్రచ్చి మహోగ్రతఁ ద్రావె నెత్తు[1]ర
య్యాది దుది నింత పుట్టు నని యాప్తజనంబులు మున్న చెప్పరే. 9

తే. కొడుకు లంత రాజ్యంబునకుఁ గొనఁగ శక్తు, లనుచు గాళను వారలయు వినయములు
నీ వుపేక్షింతు మానసే మావిరుద్ధ, కర్మమున ఫల మొందెదు కౌరవేంద్ర. 10

వ. అనిన విని యాంబికేయుండు దుర్యోధనుండును దెగియనకాఁ దలంచి నిహ్వాలించి
మూర్ఛిల్లినం దల్లడిల్లి యార్తనాదంబులతో వివశంబు లయి వనితాజనంబులు
గన్నీరు గ్రమ్మ వసుంధర నొఱగిన నంతకు మున్న వచ్చి యున్నవిదురుండును నా
సూతనందనుండును జేరి చేసేత శీతలజలసేచనమృదువ్యజనవీజనంబుల నన్నర
నాథుని నారీసముదయంబును సేదదేర్చిన నాసీనుండై యతండు దీర్ఘనిశ్వాసంబు
లడరం జింతిల్లియంతర్గతంబున దైవంబు గర్హించి పాండవుల నగ్గించి తనబుద్ధియు
శకునివెరవును నిందించి తన్నుం దాన యుపశమించుకొని ధైర్యంబు నిక్కంబట్టి.

క. తెలియ విన నీవు సెప్పిన, పలుకులు దుర్యోధనుండు పడఁడు గదా వై
రులవిక్రమమున సంజయ, కలరూ పెఱుఁగంగఁ జెప్పు క్రమ్మఱ నాకున్. 12

చ. అనుటయు నాతఁ డి ట్లనియె నమ్మనుజేంద్రున కాజిఁ గర్ణుఁడుం
దనయులుఁ దమ్ములుం బడిరి దారుణవిక్రమకేలి సల్పి నె
ట్టన బలు పారఁ బట్టి వికటంబుగ వక్షము వ్రచ్చి దుస్ససే
నునిరుధిరంబు మారుతతనూజుఁడు ద్రావె మదం బెలర్పఁగన్. 13

క. అనిన విని [2]యంత కేమియు, నన కూరక యుండు సంజయా నీమాటల్
విన నేరదు విభ్రాంతిని, మునిఁగినయది చిత్త మని విషమూఢాత్మకుఁ డై. 14

వ. ధృతరాష్ట్రుండు మ్రానుపడి యుండి కొండొకసేపునకు సేద దేఱి యాసూతనంద
నుని కి ట్లనియె. 15

క. నాదుర్నయమునఁ జేసియు, నాదుర్యోధనునిబుద్ధిహానివలనను
గాదె యిటు లగుట మర్మవి, భేదన మగుశోక మింత పెల్లయి యున్నే. 16

వ. దుఃఖంబు నిస్తరింప నోపుదునో యని తలంచుచున్ననాదుసంశయంబు వాయ
నింతకుమున్న కయ్యంబునం గడచనినమనవారిని వారివారిని నేర్పడం జెప్పుమనిన
నతనికి సంజయుం డిట్లను మనయందు భీష్మద్రోణకర్ణవికర్ణవృషసేనదుశ్శాసన
లక్ష్మణాదులును వారలలోన విరాటశంఖోత్తరద్రుపదఘటోత్కచాభిమన్యుపాం
డ్యప్రముఖులును [3]బేరువేర నిట్టిట్టివారిచేత నిట్టిట్టివారు దెగి రని యేర్పడ నెఱిం
గించిన నమ్మహీపతి కురుసేన నింక నెవ్వరు గల రని యడుగుటయు నతం డశ్వ
త్థామ కృతవర్మ శల్యశకుని కృపాచార్యులం బేర్కొని బ్రదికినకురుకుమారులను

1. గ. రయ్యాది. 2. జ. యంతకేనియు. 3. గ. వేఱువేఱ నిట్టిట్టి.

గర్ణకొడుకులలో నున్నవారలను మఱియుం గలయోధులను జెప్ప వీరలం గొని
యనికి నుత్సహించి పొనుఁగువడ్డయుగ్రవేఁడిమివోని వాఁడిమితో దుర్యోధనుండు
ధైర్యం బవలంబించి జయార్థి యై యున్నవాఁ డనిన విని కొడుకుకడిమికి వెఱవెఱ
యూఱడిల్లినయుల్లంబునం దనవారు పెక్కండ్రు వోలిసినయలమట మునింగి
యొక్కింతప్రొద్దూర కుండి రాధేయుఁ డెగుట దలపోసి యమ్మనుజనాథుండు. 17

తే. అలలోనియాఁ బోతునుబోలె నొప్పఁ, గురుబలంబులో నున్నదర్పోర్వరమూర్తి
సింహాసంహననుండు నిస్సీమవిక్రమాభిరాముండు వోయెనే యక్కటకట.

వ. అని తొడంగి హాహాకారంబు లెసంగ రోదనంబు సేయుచు. 19

క. సంజయ మురభంజనుని ధ,నంజయునిం జీరికిం గొనఁడు కర్ణుం డిం
ద్రుం జెనకి యైన గెలుతు న,నుం జచ్చెనె యట్టివాఁ డనుం గయ్యమునన్. 20

ధృతరాష్ట్రుఁడు కర్ణమరణంబు విని పలవించుట.

సీ. పాండుసూనులతోడి పగ కోర్చె నెవ్వని, యుత్సాహ మూఁది సుయోధనుండు
వై దేహపౌండ్రాదివసుధేశు లెవ్వని, కడిమిసొంపున నరిగాఁపు లైరి
మనము నీ కెవ్వని పెనుఁబ్రాపు గాంచి గర్వితము లై సంగరక్రీడ నలుపు
నద్భుతం బొనరించు నమరుల కెవ్వని, యనమానవివిధదిగ్యాత్రమహిమ

ఆ. అట్టికర్ణుఁ డీల్గె [1]నట్టె యిం కెక్కడి, బ్రదుకు మనకు నేటిభండనంబు
దీని వినియు నాదుమానసం బేమియుఁ, గాదు వజ్రమయము గాఁగ నోపు.

వ. అని [2]విలాపించి మఱియును. 22

క. పౌరి బంధుపుత్త్రమిత్త్రుల, పరిభవములు వించు నిట్టుప్రాణముతో నె
వ్వారు నుండుదురే యే నొ,క్కరుఁడును దక్కంగ నింతకష్టం బగునే. 23

వ. అని పలికి మరణోద్యుక్తుం డై జలాగ్నివిషప్రాయోపవేశాదు లుగ్గడించిన విని
సంజయుం డతని కిట్లనియె. 24

చ. కులమును శ్రీయుఁ దేజము నకుంఠితకీర్తియు జూడఁ దొంటిరా
జుల కెన వత్తు నీ విటులు శోకసమాకులచిత్తవృత్తి వైఁ
గలుఁగుట యొప్పునే శ్రుతము గౌరవముం బొగ డొందునట్లుగా
నిలుపుము ధీరతాతిశయనిష్ఠఁ జలింపక యుండ భూవరా. 25

వ. అనుటయు నాంబికేయుండు సంజయున కిట్లనియె. 26

తే. శోకవారిధిసారంబు నాకుఁ బొంద, నేల వచ్చుఁ జిత్తంబునఁ గీలుకొని య
సహ్యమై కర్ణమరణోపజనిత మైన, పరిభవం బనుశల్య మాతురతఁ జేయు. 27

క. పౌరుష మేటికి దైవం, బేరూపునఁ జూడ ఫలద మే మందము దో
స్సారనితాంతోజ్జ్వలుఁ డగు, నా రాధేయుండు నచ్చె [3]నర్జునుచేతన్. 28

---

1. గ. నంటి విం కెక్కడిఁభండనంబు దీనిఁ • బరఁగ వినియు. 2. క. పలవించి. 3. జ. నట్టె యరునుచేజ్.

క. అలఘుతరాయువు నాకుం, గల దది యె ట్లనినఁ జోరఁ § గర్ణునిపా టేఁ
దెలియ వినఁగ నాడెందము, పలువఱియలు గాక యున్న § భంగి నెఱిఁగితిన్. 29

క. మును లోకముచే సత్కృతి, గని నెగడెడువాఁడ నాకుఁ § గలవా రెల్లం
జన శోచ్యుఁడ నై దుర్దశ, నునికి మనికి యగునె దీని § కోర్వఁగ వశమే. 30

సీ. దుఃఖపరంపర § [1]ద్రొక్కఁ బెట్టె నా, చిత్తంబు ననిమిష § సింధుతనయుఁ
బడుటయు ద్రోణుండు § పరలోకమున కేఁగు, టయు సూతజుని తెగు § టయును విని యు
నందుఁ గర్ణుఁడు లేమి § యత్యంతదుఃఖంబు, సేసె దుర్యోధను § నాన మాను
నతఁ డేడుగడయును § నై యుండు నతనికి, నెవ్వారు గలరు ది § క్కింకఁ జెపుమ

ఆ. మనబలంబుచేవ § యును వైరిసైన్యంబు, భయముఁ జెడఁగ రాధ § పట్టి గొంతి
పట్టిచేత నమసి § పడి యున్నవాఁ డె వా, సవునికడిమిఁ బసిన § జంభునట్లు. 31

క. విను [2]పిచ్చుకకుం టతిరయ, మునఁ జోకకుఁ బనుట పేద § ముదుకఁడు వేశ్యా
జనముం గోరుట దుర్యో, ధనుఁ డింక జయంబు గొనఁగఁ § దలఁచుట యరయన్.

క. మనలోఁ గయ్యం బేటికి, నని ధర్మసుతుండు సెప్పె § నది మీరావతి గై
కొనఁ డయ్యె రోగి పథ్యా, శనమునకుం జొరనిభంగి § సంజయ యెట్లున్. 33

సీ. శరతల్పమున నుండి § శాంతనవుండు బీ, భత్సుదివ్యాస్త్ర § వైభవము దెలుపఁ
దివిరి జలం బట్లు § దెప్పించుకొని యప్డు, పాండుసూనులతోడఁ § బాంధవంబు
నడపుము సిరి పంచి § కుడుచుట మే లింత, తోఁ గయ్య ముడిగి శాం § తుఁడవు గమ్ము
బ్రదుకుము నీ వన్న § పనుపు సేయఁడు సుయోధనుఁ డిప్డు శోకాబ్ధి § మునుఁగకున్నె

ఆ. పడుచు లీఁక లూడ్చి § పట్టి యాడెడునట్టి పులుగుచంద మయ్యెఁ § దలఁప నాయ
వస్థ యెందుఁ జొచ్చు § వాఁడ నీయలమట, దీర్ప నెవ్వ రింక § దిక్కు గలరు.

వ. అని పెక్కుభంగుల నివ్వటిలు నెవ్వగలు బయలుపడం బలుమాట లాడి రాధేయు
తెగిన తెఱంగు తెలియ వినం దలంచి యి ట్లనియె. 35

మ. విజయుం డాఁకి పెనంగుచో నతనిదోర్వీర్యంబు సైరించెనో
భుజదర్పోద్ధతిఁ జూప నోపెనో చలంబుం జేవయుం సైన్యయు
గ్మజనంబుల్ వినుతింపఁ బేర్చెనో తొలంగం బాఱెనో పోరు న
క్కజపుం బెంపును వేఱఁడింపఁడు గదా § కర్ణుండు దీనాకృతిన్. 36

క. తక్కటిసైనికు [3]లని న, య్యొక్కని దిగ విడిచి పాఱిరో లావుం జే
రుక్కను మెఱయఁగఁ దోడ్పడి, పెక్కండ్రు వడిరొ బెరసుఁ బీనుంగులు గాన్.

వ. అని మఱియును. 38

క. ముందర శిఖండి నిడి సం, క్రందననందనుఁడు నేరి § గంగాతనయుం
మ్రందించెఁ గపటమున నా, చంద మొకటి కర్ణునందుఁ § జర్చించిరొకో. 39

క. సామజము వడిన నశ్వ, త్థామ వడి యె ననఁ డె ధర్మ § తనయుఁడు గురునిం

1. క. ద్రొక్కనఁ బెట్టు. గ. ద్రొక్కుడు వెట్టు. 2. గ. పిచ్చుగుంటి యతిరయ. 3. గ. లాతని, వొక్కని.

దా మడియించుటకై యు, ష్ట్రమేని నొనర్చిరొక్కొ యితఁడు వడుటకున్. 40
క. మాయోపాయంబుల గాం, గేయుండును గురుఁడు ననిఁ దెగిర కాక రణ
న్యాయంబు దప్ప కుండఁగ, నాయిరువుర నోర్వ నెవరి కైనను వశమే. 41
సీ. పరశురామునిచేతఁ బడసినవాఁడు బ్ర, హ్మాస్త్రంబు సర్వముఖాస్త్ర మలఁతిఁ
బోవునె దివ్యాస్త్రములు పెక్కు మఱియును, గలవు రాధేయున కలవు మెఱసి
యభిమన్యువిల్ దునుమాడఁడె నాగాయు, తప్రాణు ననిలనందనుని బాహు
దలఁ బట్టి సహదేవుఁ జులుకన మర్దించి, మందల విడువఁడే మాయలాని
తే. మేటిమగని ఘటోత్కచు గీటడఁపఁడె, యట్టిజెట్టికిఁ బోరఁ జా వెట్టిభంగి
నయ్యెఁ దేరికిసూతునకంచితాస్త్రములకుదైవోపహతిఁజేటుమూఁడెనొక్కొ.
క. రథ మవితథ మైనను సా, రథివని నెఱసిన మహాస్త్రరాజి విధికృతిఁ
వృథ గా కున్నను గర్ణునిఁ, బ్రథనంబున గెల్వ దేవపతికిఁ వశమే. 43
ఉ. సారథి యెవ్వఁ డాతనికి శల్యుఁడు ద్రోణతనూభవుండు గాం
ధారవిభుండునుం గృపుఁడుఁ దత్సమయంబున నేమిభంగిఁ దో
డైరి సుయోధనుండు హృదయంబునఁ దాఁ గృతవర్మ దర్పము
స్థైరము నచ్చి యుండుఁ దగ నెయ్యము సూపెనె యాతఁ డత్తఱిన్. 44
క. వారలు గెలఁకుల నడపఁగ, రారాజు పిఱుందఁ గదిసి రా నెబ్భంగిం
గారణము లేదు చావఁగ, నారాధేయునకుఁ జోద్య మయ్యెడుఁ దలఁపన్. 45
ఉ. పాండవకోటి సూతసుతుపై నడతెంచినచంద మెట్టు లా
ఖండలసూతి సర్వముఖకాండము తాఁకున రూపుమాసి పో
కుండుట యెట్లు గల్గె సమరోద్ధతి దక్కటినల్వురందు నె
ట్లుండె బలద్వయంబు నెటు లోపి పెనంగె దినద్వయంబునన్. 46
వ. అనిన విని సంజయుండు ధృతరాష్ట్రున కిట్లనియెఁ గయ్యంబు తెఱంగు మొదలు
కొని చెప్పెదనాకర్ణింపుము ద్రోణుండు దెగినవశ్వత్థామ దనయోపినంతసమరంబు
సేసి చాలించి సేనలఁ దివియించి మరలి వచ్చిన దుర్యోధనుం డప్పుడు గొలువిచ్చి
యుండి యశ్వత్థామ లో నగుదొరలం గలయం గనుంగొని మనకు నిటమీఁదఁ
జేయుం గలపని యెయ్యది యని యడుగుటయు నగ్గురుసుతుండు. 47
క. విను మాదర ముత్సాహం, బనూనధార్ష్ట్యంబునీతి యనుసద్గుణముల్
పని సఫలం బగునట్లుగ, జననాథ యొనర్చు దైవసాహాయ్యమునన్. 48
చ. తలఁపఁగ సద్గుణంబులకుఁ దావల మై పెను పొందునుజ్జ్వలా
త్ములు నని రైన [1]చేభరము దోఁపఁగ నీ దగుతొంటిశౌర్యముం
దలకొని నిర్వహింపు ముచితంబుగ దైవముతోడుపాటునుం

1. క. సేభరముఁ దోపఁగ నీకు తొడంగి కార్యముం.

గలిగెడుఁ గాక యొకన్నరథికప్రవరుల్ దలపోయ నబ్బునే. 49

క. మనము బలశౌర్యఘనుఁ గర్ణుని సేనాముఖుని సేసి రిపులోకముని యరిమ
ర్దన మొనరించెద మితనియం, దనూనతం బొల్పు సద్గుణావళియు నృపా. 50

క. వైవస్వతుచందంబున, నీవీరుఁడు రిపుబలంబు నెల్లను నడఁపం
గా వలఁతి దివ్యశరశి,క్షావైభవపరమనిష్ఠకలిమి నరేంద్రా. 51

వ. అని సూతపుత్త్రుం జూపిన ధనదత్తుపుత్త్రుండు ప్రీతుండయి యాతండు పాండవుల జయించు ననునాసయుగ్గలం బైనయంతరంగంబుతో నయ్యంగపతి కిట్లనియె.

శా. నీవిక్రాంతియు నాపయిం గలచుత్రికస్నేహంబుఁ బ్రఖ్యాతముల్
గావే భీష్ముఁడు ద్రోణుఁడుం దెగుట నీకౌరవ్యసైన్యంబులం
గావంగాఁ దగు నీకు వారలయుపేక్షం గాక యున్నాళ్లు లే
లావైరం బడఁగింప నీ వయిన లీలం గెల్తు కౌంతేయులన్. 53

వ. నీవు ప్రాజ్ఞుండవు ప్రబలుండవు విశేషించి నాకేడుగడయు నీవ కావున నీకును మదీయహితం బవశ్యకర్తవ్యం బట్లుం గాక మన మాభీష్మద్రోణుల నవమానింతుము వారలు భండనంబునం బడిన నోడెఁగి యుండ నేర్తుమే కడంగుము పగఱకు నీకడంకచీఁకటికి సూర్యోదయం బెట్టి దట్టిదయ్యెడుం గాక బృందారకసేన సేనాని నడపినకైవడిం గౌరవసైన్యంబు నడపి నన్ను గెలిపింపుము నిన్ను నీవ సర్వసేనాధిపత్యంబునకుఁ బట్టంబు గట్టికొమ్మనినం బ్రీతుండయి రాధేయుండు గాంధారేయునకుం బ్రహర్షంబుగా భూవల్లభు లెల్ల నాకర్ణింప నిట్లనియె. 54

మ. విను నీకిచ్చినబాస యే మఱతునే నావీరంబు బాహాబలం
బును ధైర్యంబును నస్త్రవీర్యమును నీభూలోకసంచారు లె
ల్లను గీర్తింపఁగఁ బాండుపుత్త్రుల మనోల్లాసంబు మర్దింతు నీ
వనుమానింపక నిల్చి చూడుము మదీయం బైనసంగ్రామమున్. 55

దుర్యోధనుఁడు గర్ణునకు సర్వసేనాధిపత్యంబు గట్టుట.

వ. నన్ను సర్వసేనాధిపత్యంబునకుఁ బట్టంబు గట్టు మనవుడుఁ బొంగి రారాజు దగురాజులుం దానును శాతకుంభకుంభంబులం బవిత్రజలంబులు దెప్పించి మహనీయమణికుసుమాదిగంధాక్షతమంత్రకలనం బాచరించి సమున్నతౌదుంబరపీఠంబునం బరమాస్తరణం బొనర్చి యంగపతి నందు నిలిపి పుణ్యాహఘోషంబులుఁ దూర్యనినదంబులు వందిజనస్తుతులును జెలంగ నభిషేకించి యలంకరించి పట్టంబు గట్టిన నతండు [1]భూసురోత్తములకు నర్థిజనంబులకును వివిధార్థంబులు దానత్యాగరూపంబున నొసంగుచు వెలింగె నప్పు డుబ్బినశూరయోధులజయజయశబ్దంబులును భూపతులయభినందనవాక్యంబులును గృష్ణసమేతు లగుపాండవుల గెలువు మని దీవన లిచ్చుమాగధులయెలుంగులును నింగి ముట్టి [2]నవోదితుం

1. గ. భూసురార్థులకు వందిమాగధజనంబులకు. 2. గ. నభోదీధితుఁ.

డై నభానుండునుంబోలె శోభిల్లు నాకర్ణుండు సముదీర్ణుండై యక్కురుపతి యాననం బాలోకించి. 56

తే. బంధుమిత్త్రయుతంబుగఁ ♦ బాదరూప్య, మూసి యే నిత్తు నీకు సామ్రాజ్యలక్ష్మి
ధాత్రిఁ బాలింపు సుస్థితిఁ ♦ బుత్త్రపౌత్త్ర, గాఢభోగాఢ్య మగునట్లు♦గాఁగ నధిప.

క. విను [1]సత్యధర్మరతుఁ డగు, మనుజునకుం గార్యసిద్ధి ♦ మనలక యగుచా
డ్పున శౌర్యబాహువిక్రమ, ఘనుఁ డగునా కాజి జయము ♦ గలుగుం జలుకన్.

వ. అని పలికి నిత్తెఱంగున రాధేయుని సర్వసైన్యముఖ్యుం జేసి యతనిమందిరంబునకు మహావిభవసమేతంబుగాఁ బుచ్చి సమస్తపరిజనంబులను నిజనివాసంబులకుం బోవం బనిచి సంతోషం బంతరంగంబు నిండి వదనంబున వెల్లిగొన నీకొడుకు కక్ష్యాంతరావాసంబున కరిగె నారాత్రి యేనిట వచ్చి ద్రోణువృత్తాంతం బంతయు నీకుం జెప్పి నీ పనుప మగిడి చని సూర్యోదయసమయంబున మనశిబిరంబు ప్రవేశించితి నయ్యవసరంబున. 59

సీ. తళతళ మని మెఱుఁగు ♦ [2]దంతప్రభలతోడ, ఘనకేతువున హస్తికక్ష్య మెఱయ
హంసవర్ణములైన♦హయములపటుగతి, నర్కప్రభంబగు♦వరద మొప్ప
దీప్తకాంచనరస♦లిప్తమై చెలు వొందు, సజ్యకార్ముకము హ♦స్తమున వెలుఁగ
వీటికి సమరస♦మాటోప మొదవ నా, భీలశంఖము దన♦మ్రోల మ్రోయ

తే. రణసముత్సాహలక్ష్మి వ♦క్త్రమున వింత, చెన్ను వెలయింప నాప్తులు♦సేరి రెండు
పక్కియలయందు బవరంపుఁ♦బలుకు లెసఁగ, నడవ సొంపారె కర్ణుండు♦వెస లెనధిప.

వ. అతండు పడవాళ్ళం బనిచి వెడల నియమించిన నెల్లదొరలును దురంబునకుఁ వెడలి రిట్లు సకలబలంబులు నడవం దొడంగిన. 61

సీ. తురగరింఖాముఖో♦[3]ద్ధూతధూళీపట, లములు సల్దిక్కు♦లలంకరించె
మాతంగకటగళ♦న్మదజలబహుళప్ర, వాహవిలాసంబు ♦ వాని నడఁచె
బహువిధవాదిత్ర♦భైరవారావంబు, వెల్లంబరము పిక్క♦టిల్లఁ జేసె
శింజినీటంకార♦సింహనాదంబుల, పెక్కువ యామోర్చితఁ ♦ [4]బిలుచుకొనియె

ఆ. రథికభూషణముల♦రశ్ములఁ గేతన, చ్ఛత్త్రచామరోప♦సక్తమణుల
రుచుల సుభటహేతి♦రోచులఁ బవలింటి, దివియుచంద మయ్యె ♦ దినకరుండు. 62

వ. అట్టియెడ. 63

క. జనములు భీష్మద్రోణులు, సనినవగలు డిగ్గఁద్రావి ♦ సంతోషము నె
క్కొనియెడు [5]మనములతోఁ గ, ర్ణునిఁ గనుఁగొని రతివికాస♦రుచిరనయను లై.

—•• కర్ణుని మొదటినాఁటియుద్ధము. ••—

వ. ఇవ్విధంబున బలంబులకుం బ్రమోదం బెసంగ నడచి రాధేయుండు దుస్సహం

---

1. గ. మాతిథ్యరతుం డగు. 2. జ. ధవళప్రభల. 3. క. ధుతధూళిపటలంబు, కలయఁగ దిక్కులఁ ♦ గప్పెమత్తమాతంగ. 4. క. బీల్చికొనియె. 5. ఖ. మనములఁ గర్ణునిఁ, గనుఁగొని రతిరుచిరమదవి ♦ కాసనయను లై.

బుగా మకరవ్యూహంబు నమకట్టునెడ నందుఁ దుండంబునఁ దాను నిలిచి నయ
నంబుల శకునియు నులూకుండును శిరంబున నశ్వత్థామయుఁ గంఠంబున దుర్యో
ధనానుజులును నుదరంబున దుర్యోధనుండును ముందట వామపాదంబున నారా
యణగోపాలయుతుండై కృతవర్మయు దక్షిణపాదంబునఁ ద్రిగర్తదాక్షిణాత్య
సంవృతుండై కృపాచార్యుండును వెనుక డాకాల నానాదేశసేనలతో శల్యుం
డును వలకాల ననేకరథకరితురగసమేతుండై సుషేణజననాథుండును బుచ్ఛం
బున మహాసైన్యసమగ్రుండయి చిత్రుండును నతనితమ్ముండగు చిత్రసేనుండును
నిలుచున ట్లొనర్చి తక్కినవారల [1]నెడ నెడం బన్నించె నటమున్న యుధిష్ఠిరుం
డుద్దామసామజాది చతురంగోల్లాసభాసితుండయి నడతెంచె నట్లు నడతెంచి
యమ్మనుజవిభుండు మనమొనం జూచి సవ్యసాచి కి ట్లనియె. 65

చ. కనుఁగొనఁ జుక్కలైనయది కౌరవసైన్యము గంటె నూతనం
దనుఁ డొకరుండు గా నిలిపి తాను ముఖంబున నిల్చి కయ్య మె
ల్లను దనమీఁదఁ బెట్టికొని లావును బీరముఁ జూపఁ బూని యే
పున నజిమున్ భవద్విశిఖపుంజములం దెగటార్పు మీఁతనిన్. 66

క. వనమునఁ బండ్రెండేఁడులు, మన [2]ముక్కటదుఃఖవార్ధిమగ్నుల మై యి
ట్లునికికిఁ దగ నితని భవత్సునిశితబాణాబ్ధి ముంపు దుర్దమలీలన్. 67

ఉ. [3]వీఁ డొకరుండె యింక బలవిక్రమసంపద గల్గి పోరిలో
వాఁడిమిసొంపు సూపఁ గలవాఁడు సుయోధనుపాలఁ బేర్చు నీ
వేఁడిమి సూపి రూపడఁపు వీనిఁ బురందరపుత్త్రి యంతతోఁ
బోఁడిమి మాలు నాతఁడు ప్రభూతజయోన్నతి నిల్చు నీకడన్. 68

వ. నీకుం బోలినమొగ్గరంబు గావింపు మనవుడు నర్జునుం డర్ధచంద్రవ్యూ[4]హవిధా
నంబున మోహరించి తాను మధ్యప్రదేశస్థుండై వామదక్షిణశృంగంబుల భీమ
ధృష్టద్యుమ్నుల నిలిపి యుధిష్ఠిరనకులసహదేవులం బింగలిగా నొనర్చె నతని
చక్రరక్షకు లగుయుధామన్యుండును నుత్తమౌజుండునుం గయ్యంపువేడుక
మొగంబులం జిగురొత్తఁ బొలిచిరి తక్కినయోధులుం దగినచోట్ల నిలిచి రి
ట్లిరువాఁగును బన్ని యున్నసమయంబున. 69

చ. హరియును బాండునందనులు నాజి నవశ్యము నేఁడు సూడఁ బో
దురు జము నంచు నాత్మఁ బరితోషముఁ బొందె భవత్తనూజుఁ డు
దురమునఁ గర్ణయుక్తముగఁ ద్రుంగు సుయోధనుఁ డన్ దలంపుతోఁ
బరమసముద్యమస్ఫురణఁ బాండవముఖ్యుఁ డెలర్చె భూవరా. 70

ఆ. ఒకటికొకటికంటె నుబ్బుచు వర్తించు,చాడ్పు దోఁప రెండుసైన్యములును

1. క. నెడనెడలం బన్నించె_జ, గలయం_బన్నించె నంత నక్కడ యుధి. 2. క. ముక్కటం మాదట 3. క. వీఁ డొకరుండు దక్క...సుయోధనుపాల లేమి. 4. క. హాభిధానంబున.

¹బొలిచె నవుడు సెలఁగె | భూరిభేరీముఖ,తూర్యములు నభంబు | దూఁటుకట్ట.

వ. చిందంబులమ్రోఁతకు నిందు నందనుం దమకించి భటులు గెలంకులం దాఁకఁ దోడ్తో నెఱసినయుగ్గలిక నొండొంటిఁ బెరయు ముగ్గరంబు లురవడించిన. 72

సీ. నిబిడఘంటావళీనిక్వాణంబులతోడ, భీషణబృంహితఘోషములును
ఘననేమినిష్ఠురధ్వానముల²పొందునఁ గేతు,నిర్భరకింకిణీనినదములును
జటులఖురవ్రాతపటురవంబులతోడ, నాభీలహేషామహాస్వనములు
భూరిభుజాస్ఫాలనారావములతోడ, మేదురతరసింహనాదములును

ఆ. బరఁగి దిక్తటములఁ | బగిలింప ననిమిష,ఖచరసిద్ధయక్షగరుడగణము
లంతరంగములు నితాంతకౌతుకభరి,తములు గాఁగఁ జూడ్కి³గములువఱపె.

వ. ఇట్లు దలపడి యిరువాఁగును ⁴బేరువాఁడిఁ బోరునెడ గరుడప్రహారంబుల నొచ్చినపంచాస్యపన్నగంబులంబోని బాహువులను గాంతత్వరుచిసౌరభంబుల బెంపున సంపూర్ణచంద్రార్కకమలంబులం గ్రేణి సేయునాననంబులను సంగ్రామరంగం బలంకృతం బయ్యె వాహనంబులమీఁద నుండి భూషణకిరణంబులు మెఱయ సైనికులు నేలం గూలునప్పుడు పుణ్యావసానకాలంబున నాకలోకపరిభ్రష్టం బగుమహాత్మలోకంబు చందంబు దోఁచెఁ జతురంగంబులునుం దమతమజాతిచేతం బడుటయు నేనుంగు లడరిన నరదంబులు నదియుటయు నాశ్వికులు వాదివినం గరులు ధరం దొరంగుటయు భటు లురవడించినం దురంగంబులు గడికండంబు లగుటయు రథంబులు గవిసినం గాల్వురు దుము రగుటయుఁ గ్రందున నెల్ల తెఱంగులు నన్నిదెఱంగులం గలయ బడలువఱచుటయు రౌద్రరసంబుఁ⁵బెనిచె నాసమయంబున సాత్యకి ధృష్టద్యుమ్న చేకితాన ద్రౌపదేయులు ప్రభద్రక చేది పాండ్య చోళ మగధ వంగాదిదేశంబుల బలంబులతోడ బరవసంబు సేసి తఱిమి రట్టియెడ. 74

ఉ. దంతిఘటల్ మహోగ్రసముదగ్రతతో నడతేర దర్పదు
ద్రాంతగజాధిరోహణనితాంతసముజ్జ్వలభంగిఁ బాంధవి
క్రాంతివిలాస మొప్పఁగ నఖండితపౌరుషుఁ డైనభీముఁ డ
త్యంతసముద్ధతిం గవిసె | నస్మదనీకము సంచలింపఁగన్. 75

క. ఉదయాచలమున రుచినం,పదఁ బొలుచుపతంగువగిదిఁ | బ్రసరత్తీవ్ర
ప్రదరములు నెఱయ మెఱయుఁగ,మదావళముమీఁద వెలిఁగెమారుతి యధిపా.

క్షేమధూర్తి యనురాజు భీమునితో యుద్ధము సేసి చచ్చుట.

వ. అమ్మహావీరు నాలోకించి కులూతదేశాధీశుండయిన క్షేమధూర్తి నిజబలంబులం బురికొల్పికొని యేచి త్రోచి యాహ్వానంబు సేసి తనకరటిం గొలిపిన నది గిరి

1. గ. బొదలినట్లు సెలఁగెఁ | జదల భేరీముఖ. 2. గ. తోడుతఁగేతు. 3. క. తగులుపఱిచె.
4. క. బేరు వాడి_జ. బేరువాడ_ట. బేరువాడుచు_పంచాస్య. 5. క. బెరసె; జ. పెర్చె.

గిరిం దాఁకు తెఱంగున నతనిమాతంగమునకు మార్కొనియె నయ్యిరువురు నొం
డొరులపైఁ దోమరస్తోమంబు లడరించి యార్చుచు నుద్దండవరాక్రమంబులగు
వేదండంబుల ప్రచారంబులు చాలభీషణంబులు గా నొక కౌశల్యం బుట్టుకొని
వచ్చుచుం బెనంగి. 77

క. కోదండంబులు గొని బాహాదర్పము లెసఁగఁ బోరి యన్యోన్యవ్యధను
శ్ఛేదంబులఁ బోరిఁ బోరి నాపాదించిరి [1]రయము జనులు ప్రస్తుతి సేయన్. 78

వ. దానం గోపం బగ్గలించి. 79

తే. శక్తులను దోమరంబుల సరభసముగఁ, బోరుచో భీమసేనుని పేరురమున
క్షేమధూర్తి సముజ్జ్వలత్తోమరంబు, [2]లేచు నాటించె దర్పంబు రూఢి కెక్క.

చ. అనిలతనూభవుండు దపనాంశునిభం బగు తోమరంబు వై
చిన నడుమం గరూశపతి చిత్రముగాఁ దునుమాడి వీఁక నా
తనిఁ బటుముష్టికాండపరిశాడితదేహునిఁ జేయ మేటివి ల్
గొని యతఁ డక్కులూతపతికుంజరముం వెసఁ గప్పె నమ్ములన్. 81

వ. ఇట్లు భీమసేనుండు కరూశపతి విక్రమంబు నరకుసేయక యతనివిదిక్కునం జూడక
క్షేమధూర్తిసామజంబును సాయకమయంబుఁ జేసిన నది మొగతిరిగి పఱచినం బో
వనీక యప్పావని వెనుకొనుటయు నక్కులూతపతి ప్రయత్నంబున నమ్మాతంగంబు
మరల్చి యతని యంగంబునను దద్గజంబుశరీరంబునను నిశాతశరపరంపరలు పఱపిన.

చ. ఉఱక సమీరసూనుఁడు దదుగ్రధనుర్గళనం బొనర్చి యే
త్తెఱఁ గరి నొంప నాతఁడు గడిందిమగంటిమి నొండువింట ను
న్నెఱుఁగులు [3]గ్రమ్మకోల నతనిం గడు నొంచి తదీయహస్తి పా
ల్పతి మహి మ్రొగ్గ నేసిన ధరాధిప నీబల మార్చె నుబ్బునన్. 83

మ. గద చేతం గొని దంతి డిగ్గి చని యాకౌంతేయుఁ డవ్వీరు ను
న్మదమాతంగముఁ గూల నేసినఁ గృపాణస్ఫారదోర్దండుఁ డై
కదియన్ వచ్చి యతండు నిష్ఠురగదాఘాతంబునం గూల్చె నే
వు దలిర్పన్ వెస నామరుత్తనయుఁ డాభూమీశు భూమీశ్వరా. 84

వ. ఇవ్విధంబున నేనుంగుపీనుంగు కడన పడిన క్షేమధూర్తి వజ్రప్రహారంబునం గూలిన
కులశైలంబునమీపంబున నిర్ఘాతపాతపతితం బయిన కంఠీరవంబు కరణి నొప్పి
నతనిం గనుంగొని మన మొన వెఱచఱచినం బాండవబలంబులు వెనుకొనుటయు.

మ. పటుబాణప్రకరంబు లంబరముఁ గప్పం గర్ణుఁ డాసేనఁ దాఁ
కుటయున్ సైన్యము దైన్యముం దొఱఁగి మాఱ్కొన్నన్ భుజాసంపదు
త్కటగర్వోద్ధురభంగిఁ బాండుసుతులున్ దర్పంబు సొంపేర్పరిం

1. గ. రణము. 2. గ. లేచు...రెట్టిగాఁగ; జ. లేదు...వేచు కెక్క; ట. లేదు...మాడి కెక్క. 3. క. గ్రమ్మకో నతనిమే న్గడు.

చుటుకుం జొచ్చినఁ బేర్చెఁ బో రనిమిషస్తోమాద్భుతాపాదియై. 86

వ. అందు. 87

క. నూతతనయనారాచ,వ్యాతము లై వారణంబు । లొఱలుచు సొగయున్
భూతలమునఁ బొరలుఁ దెరలు, వే తూలును జిఱ్ఱఁ దిరుగు । విచ్చుం జచ్చున్.

వ. అప్పుడు నకులుం డతని మాఱ్కొనియె భీమసేనుం డశ్వత్థామకు సాత్యకి
గైకేయులగు విందానువిందులను జిత్రసేనుండను రాజు శ్రుతకర్మను బ్రతివింధ్యుండు
చిత్రుండనుమనుజనాథుని ధర్మపుత్త్రుండు దుర్యోధనుని ధనంజయుండు సంశప్త
కులను ధృష్టద్యుమ్నుండు గృపాచార్యుని శిఖండి గృతవర్మను శ్రుతకీర్తి శల్యుని
సహదేవుండు దుశ్శాసనునిం దలంపడి రట్టియెడ. 89

సీ. శైనేయుతోడ విందానువిందులు మహా,హవము సేయుంగ నయ్యాదవోత్త
ముఁడు పేర్చి వారికార్ముకములు రెంటిని, దునిమి యంగంబుల । నినిచెఁ దూపు
లవ్వీరు లన్యశరాస[1]నోద్ధారు లై, యతనిపైఁ బఱపిరి । శితశరంబు
లతఁడును వారు నన్యోన్యచాపచ్ఛిదా,వైచిత్రి నొప్పారి । రేచి దొడ్డ
తే. విల్లుఁ గొని యతిరయమున భల్లనిహతి, నాతఁ డనువిందుతలఁ ద్రుంప నది ప్రదీప్త
రత్నకుండలశోభాభిరామ పతన,భంగిఁ దదనీకశోకసంపాది యయ్యె. 90

మ. కని విందుండు ప్రదీప్తచాపధరుఁడై । కాండప్రసారంబులన్
శినివీరుం గుసుమాఢ్యకింశుకసముం । జేయుంగ నయ్యోధుఁ డా
తనియంగంబులఁ బంచవింశతిశితాస్త్రంబుల్ వడిన్ గ్రుచ్చె నే
పున వా రొండొరుసూతులం దునిమి నిష్పాల్ రాలుకన్దోయితోన్. 91

తే. ఒకళు లొకళులహయముల । నుర్విఁ గూల్చి
యొండొరులకార్ముకమ్ములు । ఖండితములు
సేసి తేరులు డిగ్గి రుద్యదసితాసి
చర్మశోభితహస్తు లై । సరభసముగ. 92

వ. ఇట్లు పాదచారు లై మండలప్రచారంబుల మెఱయుచు. 93

క. చేరి బహువిత్రగతులం, బోరంగా నొడ్డనములఁ । బొలిసెం బలకల్
నేరిమిమై [3]గెళవున శిని,వీరుం డిరువఱియ గాఁగ । విందుని వ్రేసెన్. 94

వ. ఇత్తెఱంగున నయ్యిరువురం జంపి సాత్యకి యుధామన్యుతే రెక్కి యుక్కున వేఱొ
క్కరథంబు సన్నద్ధంబు గావించుకొని కైకేయబలంబులం బఱపెఁ జిత్రసేనుం
డును నీమనుమం డగుశ్రుతకర్మయుం బెనంగునెడ [4]నాశ్రుతకర్ముఁడు. 95

క. ఆ రాజునైదువాలిక,నారసముల నొంప నతఁడు । నవశరముల న
క్కౌరవుని నేసి నొంచెను, సారథి నైదింట నధికసంరంభమునన్. 96

1 గ. నోద్వారు లై; జ. నధారు లై. 2. గ. భంగిఁ, బడియె. దదనీకశోకసంపాది యగుచు.
3. క. గెసవున జ. గెళవున. 4. క. నాశ్రుతవర్మఁడు.

సీ. శ్రుతకర్మ కోపించి ✽ క్రూరనారాచ మ, జ్జననాథుజత్రుదేశమున నాటఁ
బడి మూర్ఛవోయినఁ ✽ బై పయి వెండియు, నేయఁ దెప్పిఱి యతం ✽ డనక మొనఁగ
నుక్కఁ దునుమాడె ✽ నక్కుమారునిశరాసన మతఁ డొండొక ✽ చాప మెత్తి
తఱచుటమ్ముల నేసు ✽ పెఱిగిన చందంబు, నేసె రయంబునఁ ✽ జిత్రసేను
తే. నాతఁ డాతనియురమున ✽ శాతశరము
దూఱ నేయ నబ్బాలుండు ✽ దోఁచె వివిధ
బాణజాల మున్నరపతి ✽ శోణితమున
భల్ల మొక్కటఁ దల నేల ✽ డొల్ల నేసె. 97

—•• ప్రతివింధ్యుఁడు చిత్రుఁ డను రాజుం జంపుట. ••—

ఉ. ఏలినవానిపాటుఁ గని ✽ యేడ్తెఱఁ దద్బల మొక్కపెట్ట యా
భీలతఁ జుట్టు ముట్టుటయుఁ ✽ బేర్చినయుద్ధతిఁ దీవ్రసాయక
జ్వాలల నేర్చి యుద్భటభు ✽ జావిభవం బలరంగ నల్గడం
దోలె నుదాత్తవిక్రమకు ✽ తూహలి నీమనుమండు భూవరా. 98

సీ. అప్పుడు ప్రతివింధ్యుఁ ✽ డైదుబాణములఁ జిత్రుని మేను నొంచి ✽ తత్సూతువక్ష
మునఁ గ్రూరశరములు ✽ మూఁడు నాటించి యొక్కమ్మునఁ గేతు ✽ వ్రక్కల్చి పేర్చి
యతఁడు దన్నుఁ గ్రన్న ✽ నవాస్త్ర[1] పీడితుఁ జేయ, విలుద్రుంచి వెనఁ బంచ ✽ విశిఖనిహతుఁ
గావించి శక్తి యు ✽ గ్రమ్ముగ వైచినఁ, బెలుచ నాలుగుదుని ✽ యలుగఁ జేసె
తే. నలిగి యాతండు గద వైచి ✽ యక్కుమారు
ఘోటకంబుల నూతునిఁ ✽ గూల్చె నదియు
పట్టుకొని వైచె మగుడ న ✽ ప్పాండుపౌత్త్రి
చేయి వడి నుచ్చి పోవ న ✽ చ్చిత్రుఁ డధిప. 99

ఉ. బాహువు నొచ్చినం గినిసి ✽ భాసురతోమర మెత్తి కౌరవ
వ్యూహము సంచలింప నతఁ ✽ డుగ్రత వైచినఁ గంకటంబుఁ ద
ద్దేహము నుచ్చి పోవుటయుఁ ✽ ద్రెళ్లె నరేశ్వర యవ్విభుండు వ
జ్రాహతిఁ గూలుపర్వతము ✽ నాకృతి నుత్కటవైకృతంబుగన్. 100

వ. ఇట్లు చిత్రుండు దెగటాఱినం గనుంగొని మన యోధులు ప్రతివింధ్యుపై నడరి యనేకాస్త్రశస్త్రంబులం బొదివినం బొలివోనికలితనంబున నేల కుఱికి యక్కుమారుండు కోదండటంకారంబున నంబరంబు పూరించుచు బాణాసారంబు పరఁగింపఁ బాండవసైనికులు బెట్టిదంపుటురవడిం గదిసి యతనికిం దోడ్పడుటయు మనవారలు వెన్నిచ్చి పఱచి రప్పు డశ్వత్థామభీమసేనులసంగ్రామంబు భీమంబయి చెల్లె నందు. 101

క. గురుపుత్త్రుఁడు దొంబదిశిత, శరములఁ బావనిరథంబు ✽ సంవృతముగఁ జే

1. క. తాడితుఁ జేయ.

సె రయంబు వారలఁగ సాయక, పరంపరలు వఱపె నతనిపై నతఁ డులుకన్. 102

వ. వాని మగిడించి. 103

క. అనిలజుఫాలము గురునందనుఁడు పటుప్రదరకీలితము సేయుడు నా
తనినిటలంబున నతఁ డేఁపున బాణత్రయము నాటె భూవరముఖ్యా. 104

వ. మఱియును. 105

చ. గురుసుతభీమసేను లతిఘోరవిధంబులఁ బోరి రొండొరుం
దెరలుప లేనిసామ్యమున దీపితులై లయకాలవిస్ఫుర
త్తరణియుగంబుఁబోలె శరధామసమగ్రతఁ బ్రజ్వరిల్లి యొ
ప్పిరి [1]రథచిత్రచారులఘుభీషణసంచరణంబు లొప్పఁగన్. 106

తే. వారి వీక్షించి ఖచరులు పోరు లెందుఁ జూడమె దీని కెన యని యాడఁగలదె
కలుగ వింకను వీరలబలము జలము, నలువు నెరవు నిట్లుండునే యనుచునుండ.

ఉ. ఒండొరు కేతువుల్ దునిమి యొండొరుసూతుల నొంచి యేపుమై
నొండొరు తేరివాహములయుబ్బడఁగించి నిశాతవిస్ఫుర
త్కాండచయంబు లొండొరులకాయములన్ వడిఁ గ్రుచ్చి వ్రాలి ర
ప్పాండుసుతుండుఁ గుంభజునిపట్టియు మూర్ఛలు దమ్ముఁ గ్రమ్మినన్. 108

వ. ఇట్లు రథంబులపై నొఱగి మూర్ఛిల్లిన. 109

క. అనిలజుసారథియును గురుతనయునిరథచోదకుఁడు నతని నాతనినిం
[2]గొని యుల్లంబుల బలితవుఁ దనుకు సొరఁగ పనికిఁ దొలఁగఁ దోలిరి రథముల్

ఉ. క్రీడితసూనుఁ డైన శ్రుతకీర్తియు శల్యుఁడు నేచి దిక్కుల
ల్లాడఁగఁ బోరుచో శరము లాఱుడుల్ శ్రుతకీర్తి శల్యుమై
గాడఁగ నేయ మూఁడుపటుకాండము లాతని మేనఁ గ్రుచ్చి సం
తాడితుఁ జేసె సూతుఁ నిశితప్రదరంబున నాతఁ డుద్ధతిన్. 111

చ. నరతనయుండు దత్తనువు నాటఁగఁ దొమ్మిదియమ్ము లేసి స
త్వరముగ సూతునంగమున వాలికతూపులు మూఁడు నాటి ని
ష్ఠురశరపంచకస్ఫురణ సూపినఁ గోప మెలర్ప నమ్మహీ
శ్వరుఁడు గడంగి విల్ దునిమి సప్తశరంబుల నొంచె నాతనిన్. 112

వ. అట్టియెడ. 113

సీ. వేఱొక్కవిల్లెత్తి వివ్వచ్చుకొడుకటు పదినాలుగమ్ములు వఱపె మద్ర
పతి మేన నతఁడు తొంబదితూపు లడరించి, యేసె నవ్వీరుశరాసనంబు
ఖండంబులుగ వాఁడు గండడంగక గద, వైచినఁ బోకిసేసి యేచి శక్తి
నిగిడింపఁ దునుమాడె నిశితభల్లంబునఁ, ద్రుంచెఁ దదీయసూతునిశిరంబు

ఆ. వాయుజవము లైనవాహంబు లప్పుడు, గలఁగి యరద మనికిఁ దొలఁగనీడ్చెఁ

1. గ. లఘుచిత్రచారుపటుభీషణమార్గణభైరవంబుగన్. 2. క, గనుఁగొని యుల్లంబులు ..., లోనగు.

దెఱపి గాంచి శల్యుఁ డడరి యుఱికి చొచ్చి క్రందు సేసెఁ బాండుసుతబలంబు నధిప.

సీ. కమలాకరము లీలఁ గలఁచి యాడెడు గంధసింధురముపోలిక నుద్దండవృత్తి యును
దర మిడి తృణగణముల్ త్వరితము ఘోరంబుగా వడిమించు దవవహ్ని పగిది నేపు
నీరసారణ్యంబు నిర్భరాటోపతఁ గాల్చు నగ్నిహోత్రమాడ్కి క్రమంబుఁ
బ్రకటవిక్రాంతిఁ బరరథంబులును సమయించు ఘోరాంతకునికరణి యతఁడు

ఆ. పొల్పఁ [1]బట్టు నయ్యెడ భుజగర్వశౌర్యప్రతాపదుర్దమప్రకోపములకు
మద్రవిభుఁడు గొలుసుమనఁగి శాత్రవసైన్యహానకేళి సల్పుచున్న సమయమున. 115

—దుశ్శాసనుఁడు సహదేవునితో యుద్ధంబు సేసి మూర్ఛిల్లుట—

ఉ. ధీరజనోత్తముండు సహదేవుఁడు [2]మైఁగలి దుస్ససేనుఁ డు
ద్వీరులు పిచ్చలింపఁ బ్రజ విన్నదువం బొరి నార్పఁ బోవుచో
వారక సాయకత్రయము వాఁడిమి నయ్యవనీశుఁ నొంచె వి
స్తారమనోజ్ఞహారలసితం బగునాఘన బాహుమధ్యమున్. 116

చ. ధృతి వొగడొంద నేచి సహదేవుఁడు నీసుతు శాతదీప్తన
ప్రతిశరవిద్ధుఁ జేసి వడిఁ దప్రథచోదకు మూర్ధగాత్రయా
హతుఁడుగఁ జేయ నల్గి వెస నాతని చాపము ద్రుంచి యాతఁడు
ద్ధతి యలరంగ డెబ్బదిశితప్రదరంబుల మేను నొంచినన్ 117

సీ. నకులానుజుఁడు కృపాణంబున వైచిన దుస్ససేనునివిల్లు దునిమి యయ్యె
నెడఁ గని యుర్వీశుఁ డేచి బల్మింట మూఁటలు గ్రుమ్మిన మ్రొయ్యలయి నతండు
గడువెస నెత్తిన కరవాలమును ద్రుంచి, యతనిపై లక్షించి యదియు నైవ
నడుమన మాతండు నఱికి సఁబ్రస్ఫీతచాపంబు గొని చతుష్షష్టినిశిత

ఆ. కంకపత్త్రములను గగడక నయ్యవరాజు పరఁగఁ జేయుటయు నుగ్రబాంధుతనయుఁ
డడఁచె నొక్కటొకటన్ నైదెదు తీవ్రశిలీముఖములబాహుళీల మెఱయ. 118

వ. ఇట్లు విక్రమవిజృంభితుం డై సహదేవుండు శతశాతశిలీముఖంబు లడరించిన. 119

చ. రయమున వాని నన్నిఁటి శరత్రితయంబునఁ ద్రుంచి సాయక
ద్వయమున నాతనిం బటునవప్రవరంబుల సారథిన్ భవ
త్ప్రియతనయుండు నొంచి దివి దీటుకొనంగఁ జెలంగి యూర్వన
త్యయసమవర్తిచాడ్పున నతం డుదిత భ్రుకుటీ విలాసుఁడై. 120

మ. పటునారాచము దీప్తిజాలము నభోభాగంబునం బర్వ ను
త్కటవేగంబున నేయఁ గంకటము వక్షఃపీఠముం దూఱి న
త్తుటిపాం దేమియు లేక యిచ్చి చనినం దూఁగాడి యాతండు వ్రా
లుటయుం దేరు వొలంగ సూతుఁడు భయవ్యాలోలాకృతిం బోలినన్. 121

క. అమ్మాద్రీపుత్త్రుఁడు వ్రాలమ్ముల దుశ్శాసనుని మహాసైన్యము రా

1. గ. బడిమె నపుడు. 2. క. మైఁగలి-గ. మొగని-చ. మొగని-జ. మైఁగము-ట. నగ్గలి. అ. కూయఁడు

ద్రమ్ముగఁ గలంచె దివిజగణమ్ము వినుతి సేయఁ దమ మొగములు వలినార్యున్. 122

చ. నకులుఁడు సూతపుత్త్రుఁడు బెఱసంగ వెడఁగ నకులుండు సూతపు
త్త్రికువకు నిట్లనుం దలఁచి దైవము నేఁడు నిజప్రసన్నదృ
ష్టికి నను బాత్రభూతుఁడుగఁ జేయుట గానఁగ వచ్చె నాకు మా
డ్కికి నిను గోచరంబుగ ఘటించిన యీ చతురత్వసంపదన్. 123

క. కౌరవపాండవులకు క్రీవైరము నీవలనఁ గాదె వచ్చెను నిను మ
ద్ఘోరశరనిహతిఁ బడఁగ, న్నార్పఁ గనుంగొనక కోప మాఱునె యొంటన్. 124

చ. అనవుడు రాజసూతివి మహాస్త్రవిదుండవు నైననీకు ని
ట్లనుట దలంప నర్హ మగు నైనను జెన్నఁటివల్కు లేల నె
ట్లన భుజశక్తి మార్తురగదంక యుడంచినఁ బల్కు టొప్పుఁ గా
క నిలిచి చూపు నీచలఁకుకల్మియుఁ జేతులబల్మియుం దగన్. 125

వ. అని పలికి కర్ణుండు. 126

సీ. ఉబ్బి మాద్రీసుతు డెబ్బదిమూఁడుమార్గణములఁ గప్పుటయు నతఁ డలిగి యతని
[1]పైని శతనిశాతబాణంబు లేసిన, నాసూతనందనుఁ డక్కుమారు
ధనువు నుగ్గుగఁ జేసి తనువున ముప్పది, కాండముల్ సొనిపిన నొండువిల్లు
గొని డెబ్బదింట నాతనినొంచి మూఁడుమార్గణములు సూతునంగమునఁ బఱపి

తే. భల్లహతిన విల్లు దునుమాడి యెల్లజనులు, నద్భుతంబందఁ ద్రిశతసాయకపరీతుఁ
జేసి నకులుఁడు నిష్ఠురహాసభాసి, తాననాంభోజుఁడై పొలుపారె నధిప. 127

క. సూతసుతుఁడు బలువిలు గొని, [2]యాతనివక్షమున నాటె నైదమ్ములు ని
ర్ఘాతసమసప్తశరముల, నాతఁ డతని నొంచి విల్లు నఱిమిఁ ద్రుంచెన్. 128

వ. మఱియు నొక్కమహనీయకార్ముకంబు గొని కర్ణుండు గడంగె నప్పుడయ్యిరువురు
నొండొరులతూపులు ద్రుంచుచు నిజమార్గణంబుల నొక్కొకళ్ళ నెత్తుట ముంచు
చుం బేర్చి వివిధవిశిఖజాలంబు లడరించిన నంబరంబు శలభపటలసంవృతంబునుం
బోలె నుండె నాసమయంబున నకులునగ్రభాగంబునకు వచ్చిన సోమకబలంబులు
గర్ణక్రూరనారాచాదిబహుళబాణపాతంబులఁ బలాయితంబు లయ్యెఁ గర్ణునకు బాస
టయై తఱిమిన కౌరవసైనికులు మాద్రేయరౌద్రవిజృంభణంబున దూరవిఘటితు
లై రట్టిరువాఁగును నెడ గలిగి చూచుచుండ నారథికోత్తము లుదారఘోరా
కారంబుల నుల్లసిల్లి భల్లప్రముఖప్రదరంబులఁ బరస్పరాంగంబులం బొదివి
యంబుదపిహితమూర్తు లగుమార్తాండశశాంకులచందంబు నొంది యన్యోన్య
దివ్యాస్త్రతేజోవిలాసంబుల నయ్యైయస్త్రంబుల వారించుచుం బోరి రట్టియెడ. 129

క. అలుక వొడమి కర్ణుండు న,కులుచాపము ద్రుంచి సూతుఁ గూల్చి తురంగం

1. క. పై నతనినిశిత. పై నవతినిశాత. 2. అ. యాతనియక్షముల.

బులఁ జంపి చక్రరక్షుల, తలలు నఱికి సిడము ద్రుంచి దరహాసముతోన్. 180

వ. మెఱసినం గుపితచిత్తుం డై. 181

చ. పలకయు వాలునుం గొనియెఁ బాండుకుమారుఁడు పెక్కుచెక్కలై
యిలఁ దొరఁగంగ నేసె గద యెత్తినఁ ద్రుంచె రథంబు డిగ్గి యు
జ్జ్వలపరిఘాభిరాముఁ డయి వచ్చిన నప్పరిఘంబు రూపుమా
పి లసితలాఘవస్ఫురణఁ బెంపునఁ గర్ణుఁడు నొంచె నాతనిన్. 182

ఆ. మర్మభేదులైన మార్గణంబుల కోర్వ,టించి సిగ్గుఁ జలము డిగ్గఁ ద్రావి
యెల్లజనులుఁ జూడఁ బొల్లఁదనంబున, గోర్చి యక్కుమారుఁ డోడి పాఱె. 183

—•• కర్ణుఁడు నకులుని విరథుం జేసి యవమానించుట. ••—

క. వెనుకొని రాధేయుఁడు నిజధను వాతనికంధరమునఁ దగిలిచి నలిఁ బ
ట్టిన నింద్రచాప[1]పరిగతఘనాకృతిని బోలిచె నతఁడు కౌరవనాథా. 184

వ. ఇట్లు పాండుతనయు బాహుదలఁ బట్టి మందస్మితసుందరాననుం డై. 185

క. పలుకులు వృథగా నన్నుం, బలికితి మున్నింక నెన్ని పలుక వలసినం
బలుకుము నీ కేఁదగ నా,యలవుఁ జలము నీ వెఱింగి తంతియ చాలున్. 186

క. అల వెఱఁగి పెనఁగు పెనఁగం, దలఁచిన నది గాక సిగ్గు దలకొని యునికిం
దొలఁగుట యింకిట దగు వి,చ్చలవిడి నర్జునునికడకుఁ జనుము కుమారా. 187

క. అని విడిచె నకులుఁ గుంతివ,చనములు దృఢవృత్తిఁ జిత్తసంకలితములై
యునికిం గర్ణుం డతఁడును, జని ధర్మజునరద మెక్కె సవ్రీడముగన్. 188

వ. ఎక్కి నిట్టూర్పు నిగుడం గుంభనిక్షిప్తభుజంగంబుచందంబున నుండెనివ్విధంబున మాద్రీపుత్రమానమథనవిజృంభితుం డగునవ్వీరుం డప్పుడు మధ్యందినగతం బైన మార్తాండబింబంబునకుం బ్రతిబింబంబునుంబోలెఁ బ్రదీప్తమూర్తియై వెలిమావులును వెలివడగయు నుల్లసిల్ల శోభిల్లుతనరథంబు రయంబున దర్శనీయంబుగాఁ బాంచాలబలంబు దరిసి పెక్కుతెఱంగుల మెఱుంగుటమ్ములగములఁ గదియించి.

సీ. సూతులఁ దెగటార్చి కేతనంబుల వీట,[2]తాటంబు సేసి రథ్యములఁ గూల్చి
చామరచ్ఛత్రవిభ్రమణములు పొడిసేసి [3]రథికజనములశిరములు ద్రుంచి
కొమ్ములు నఱికి యంకుశములు దునిమి తొం,డములు ఖండించి కుంభములు వ్రచ్చి
జోదులతనువులు భేదించి మోరలు, [4]గళ్యాలతోడఁ జెక్కలుగఁ జేసి

ఆ. కందములు వగిల్చి కాళ్లు ద్రెంచి యాశ్వికులఁ జంపి చర్మవిశిఖకుంత
ముసలముద్గరప్రముఖసాధనములు భగ్నములు సేసి భటుల సమయఁ జూచి.

వ. బాహువిలాసంబు మెఱయ నెఱయం బొలిచె భవత్సుతుం డగుయుయుత్సుం డు

1. గ. పరివృత. 2. జ. తాటనంబులుగ రథ్య. 3. గ. రథికశిరంబులఁ బృథివిఁ గూల్చి.
4. చ. గ. కళ్లెలుగూడఁ జెక్కలుగఁ. జ. గళ్లెలు చెక్కలుగాఁగఁ. గళ్యాలు చెక్కలుగాఁగ.

పర్వతప్రతిముం డగునులూకుపయిం గవిసి కులిశనిభం బగువిశిఖంబున నొంచిన
గోపించి యా బల్లిదుండు విల్లు విఱుగ నేయుటయు నక్కుమారుండు. 141

తే. మేలువిలుఁ గొని యఱువదినాలుగమ్ము
లతనిమెయి గ్రుచ్చి సాయకత్రితయనిహతి
సూతు నొప్పించి మఱియు నిశాతశరచ
యమ్ము పరఁగించె నధికరయమ్ము మెఱయ. 142

వ. దానం గనలి. 143

క. బలువిడి నులూకుఁ డిరువది, శిలీముఖము లొడలఁ జొనిపి సిడము రయమునమై
నిలఁ గూల్చిన నీసుతుఁడు, జ్వలవిశిఖము లయిదు నాటె వానియురమునన్. 144

వ. నొచ్చి యా సౌబలనందనుండు రౌద్రంబు రూపంబు దాల్చినవిధంబున విజృం
భించి. 145

శా. భల్లం బొక్కటఁ ద్రుంచె సూతునిఁ జతుర్బాణాహతిన్ వాజులన్
డొల్లం జేసె నిశాతపంచవిశిఖాటోపంబునం జించె వీ
రోల్లాసంబు వికాసముం బొరయ మే ¹నుక్కేడి నీనందనుం
డెల్లం జూడఁగఁ బాఱి యొండొకరథం బెక్కెం గురుగ్రామణీ. 146

క. గెలుపున మెయి పొదలఁగ సౌ,బలసూనుఁడు రథము పఱపి పాంచాలబలం
బులు గలఁగఁ బలువెఱంగుల, యలుఁగుల విహరించె నుద్భటాటోపమునన్. 147

సీ. శ్రుతకర్మ నకులునిసుతుని శతానీకుఁ, దాఁకి యశ్వంబుల ధరణిఁ గూల్చి
సూతునిఁ బరిమార్చె నాతఁడు గద వైచి, రథవాహనముల సారథిని గేత
నముఁ బొలియించె భూరమణ యిమ్మెయినీదు, తనయుండు నకులనందనుఁడు విరథు
లై యొండుదేరుల కరిగిరి ²సుతసోముఁ, దలఁపడి కడిమి గాంధారనాథుఁ

తే. డతనియడరించువివిధసాయకము లెల్లఁ
దునిమి బాణత్రయంబునఁ ³దనువు నొంచి
తురగముల నరదమ్ముఁ గేతువుఁ దిలప్ర
మాణశకలంబులుగఁ జేసె మద మెలర్ప. 148

మ. విరథుం డై పోలివోనిబీరమునఁ బృథ్వీభాగసంచారి యై
శరజాలంబుల భీమసేనసుతుఁ డాశ్చర్యంబుగా నీఱుం
దిరథం బేడ్తెఱఁ గప్పినం దునిమె నుత్సేకోగ్రుఁ డై యమ్మహీ
వరుఁ డబ్బాలునిచాపదండము భుజావష్టంభ మేపారఁగన్. 149

చ. అతఁడు ప్రదీప్తఖడ్గము రయంబుమెయిం గొని యానృపాలుఁ డు
ద్ధతిఁ బరఁగించుసాయకశతంబులు ద్రుంచుచు నుల్లసిల్లన
ప్పతి పటుభల్లఖండితకృపాణునిఁ జేసిన వీఁక నొక చే

1. క. సుక్కారి. 2. జ. శ్రుతసోము. 3. జ. ధనువు.

పునఁ గృపుఁ డుజ్జ్వల ప్రదరపుంజములం బగఁగంగఁ జేయు మ
వెనుకొని పొల్చి నిల్చి గిరి వెన్కొని నిల్చిన వజ్రి కైవడిన్. 159

తే. కడఁగి కృతవర్మతోడ శిఖండి పెనఁగి, ముంచి శరపంచకంబున సమరమునొంప
నతని నయ్యాదవోత్తముఁ డలఘుమహిత, విశిఖవిద్ధునిఁ జేసి విల్ విఱుగ నేసె.

క. ఒండుశరాసన మెత్తి శిఖండి గురియమునవతిసాయకమ్ములు వెలుచన్
ఖండించె నతఁడు తత్కోదండం బా ద్రుపదసూనుశరతతియుఁడు నఱకెన్. 161

క. ధనువు దునిమి కొమ్ములు మురి,సినవృషభముచంద మగుచు శిఖిస్ఫురణం
దనువున శితశరములు వడిఁ, జొనిపి యశం బతని గళితశోణితుఁ జేసెన్. 162

చ. అలుక మనంబునం గదిరి యాహవపవనోత్తముఁ డొంటుమింట దో
ర్బల మెసఁగంగ దెబ్బదిశరంబులు[1] నాఁటిన మేన రక్తధా
రలు దొరఁగించి పెక్కుప్రదరంబుల నైపము నేయు చుండె న
గ్గలికఁ జెనంగి వెండియు శిఖండి విచిత్రరథప్రచారుఁడై. 163

వ. ఆ ద్రుపదనందనుండు జత్రుదేశంబున నంబకత్రయంబు నాటించిన. 164

శా. క్రూరోల్లాసము వల్లవింప గృతవర్ముం డుగ్రదీప్తిస్ఫుర
న్నారాచంబులు పెక్కు లొక్కమొగి మేనన్ గ్రువ్వ మూర్ఛిల్లె న
వ్వీరాగ్రేసరుఁ డప్డు సారథి భయావిర్భావదీనాత్ముఁడై
తేరచ్చోటు దొలంగఁ దోలుటయు భీతిం బాఱె దత్సేనయున్. 165

వ. వివ్వచ్చు విక్రమవిహారంబున గోర్చి శిబి త్రిగర్త సాల్వ సంశప్తక సైన్యనారాయణ గోపాలోపేతుం డై సత్యసేన చంద్రదేవ మిత్రదేవ మిత్రవర్మ సౌశ్రుతి సువర్మ సుశర్మాదు లగుసోదరసుతులు బాసటగాఁ ద్రిగర్తపతి పెనంగునప్పుడు.

సీ. సత్యసేనుఁడు మూఁడుసాయకంబుల మిత్ర, దేవుండు షష్టిసంఖ్యదీప్తమార్గ
ణంబులఁ గ్రూరబాణంబులు మూఁటను, జంద్రదేవుఁడు శరసప్తకమున
మిత్రవర్ముఁడు గంకపత్రత్రిసప్తతి, [2]సౌశ్రుతి యేఁబదిశాతవిశిఖ
ములను శత్రుంజయుఁ డలఘువింశతికాండ,ములను సుశర్ముఁ డుజ్జ్వలనవాస్త్ర
తే. ములను గప్పిర పార్థు నాబలియుఁ డంబు,దములధారలు వొదువ నుదాత్తరేఖ
గరము పొలుపారు మేదినీధరముభంగి, దలఁకఁ బట్టగుధీరతఁ బొలిచె నధిప.

వ. ఇట్లు సుస్థిరుం డై మిత్రదేవునంగంబున గంకపత్రిశతంబును సత్యసేనుతనువున మార్గణత్రయంబును సుశర్మమిత్రవర్మలశరీరంబుల శిలీముఖాష్టకనవకంబులను బఱపి శత్రుంజయు శిలాశితశరంబులం బడ నైచి సౌశ్రుతిం బంచవింశతికాండంబుల గీటడంగించియుఁ జంద్రదేవుని నెనిమిదిఖరమ్ములం దునిమి యుల్లసిల్లిన.

చ. కనకపుంగామతోమరము గర్వ మెలర్పఁగ నెత్తి పద్మనా
భునిభుజశాఖ యుచ్చి చన భూరిబలుం డగుసత్యసేనుఁ డు

1. గ. నాతనిమేన. 2. జ. సామస్యుఁ డేడు.

కుఱ్ఱన నిగిడింపఁ జేతిమునికోలయుఁ బగ్గములున్ మహీతలం
బున నొగలందునుం బడిన భూవర పార్థుఁడు క్రోధదీప్తుఁడై. 169

క. హరిడెనఁ గన్గొని యాతని, యురదమునఁ గదియంగ నడపు మరద మనుజుఁ డె
చ్చెర నొండొకమునికోలం, గర ముద్ధతి నడపె ఘోటకంబుల నతఁడున్. 170

క. తే రతనియరదమునకుం, జేరువ యగుటయును గ్రీడి శితబహుభల్ల
స్ఫారగతుల గాత్రశిరో, దారణ మొనరించి యొప్పె దరహాసముతోన్. 171

వ. ఇట్లు సత్యసేనునిఁ జిత్రవధంబు సేసి. 172

చ. ఘనతరవత్సదంతశరఘాతమునం బడ వైచి మిత్రవ
ర్ముని రథసూతు [1]నట్టిదొక క్రూరపుఁదూపున నుర్విఁ గూల్చె నా
తని సముదీర్ణమై వెలుచఁ దాఁకి త్రిగర్తబలంబు సుట్టుము
ట్టిన వివిధోగ్రసాయకపటిష్ఠత నొప్పి కలంచె నేపునన్. 173

వ. వెండియు సుశర్మనిజ్ఞాతులు వోక పెనంగిన. 174

ఆ. వెండిపింజఁ బోలు చుక్కవెడఁదయమ్మున మిత్రి, సేనధరణినాథు శిరముఁ ద్రుంచి
వాఁడినారసము [2]సుశర్మనికునికిట, నాటె నయ్యమర్త్యనాథసుతుఁడు. 175

వ. అట్టియెడ సంశప్తకగణంబు లన్నియు నార్పులు నింగి ముట్ట నలుదిక్కులం గిట్టి బెట్టిదంబు లగు నస్త్రశస్త్రపరంపరలు గురిసిన నమ్మేటివిలుకాఁ డలుక నూనిన యులంతినవ్వు చెలువంబు మొగంబునకు వింత చె న్నొసఁగ విజృంభించి యైంద్రాస్త్రంబు ప్రయోగించిన నది ప్రదీప్తభల్లాంజలిక ప్రముఖంబులం బరఁగుటయు.

సీ. తేరులచెక్కులు వారణంబులఖండ,ములు భూషణంబులపోయుడి ఘోట
కంబులతునియలుఁ గరవాలతోమర, శరపరిఘాదులశకలములును
రథికజనంబుల వ్రయ్యలుఁ జామర,చ్ఛత్త్రికేతువులయంశములు భటుల
తుమురును [3]కాతులతుండంబులును గంక,టములభాగములుఁ జిందములనుఱుముఁ

తే. గలసి నెత్తుట మునిఁగి ప్రేవులఁ బెనంగి, మెదటఁ బ్రుంగి వియచ్చరహృదయములకు
నద్భుతంబు బీభత్సంబు నావహింప, సంగరాంగణ మతిఘోరభంగి యయ్యె.

వ. అప్పుడు. 178

క. కరిహయశవముల విఱిగిన, యరదంబుల విషమమైన యాజిక్షితి నె
త్తురురొంపిలోన రథ్య, స్ఫురణకతనఁ దవులఁబడక శోభితగతియై. 179

—దుర్యోధనుఁడు ధర్మజునితో యుద్ధంబు సేసి విరథుఁ డగుట.—

తే. నరుఁడు దీవ్రశరార్చులు పరఁగఁ జేయఁ
గలఁగి హతశేషసంశప్తకవ్రజంబు
వలుగడల విచ్చుటయుఁ బోగ వాసి మెఱయు

1. క. వి ట్టిదురఁ గ్రూరపు. 2. ఖ. సుశర్మనిసుజుకిట. గ. సుశర్మనిసుతుక. 3. జ. రాహుతుతుండం

నగ్నియునుబోలె వెలుఁగొందె నాతఁ డధిప. 180

ఉ. కౌరవరాజు ధర్మజుఁడు గయ్యము సేయు నెడం గడంకమైఁ
గౌరవరాజు ధర్మజునిఁ గాఁచుకొనన్ వనసాయకంబులన్
సారథిమేన నొక్కటుగ సాయకముల్ నిగిడించె నాతఁడున్
ఘోరతరాస్త్రుఁడై యతని నొంచెఁ బ్రచండకసాయకావళిన్. 181

వ. నొంచి తోడన. 182

తే. తునియలుగఁ జేసె హయములఁ జక్రరక్షకుల
నూతఁ బంచముమున ఘనకేతుయష్టి
షష్ఠమునఁ జాపదండంబు సప్తమున
నలిగి రెత్రిశకరవాల మష్టమమున. 183

క. ఆలోనన యజ్ఞసపతి, వాలికనారసము లైదు వక్షమున నడిం
గీలించి ధైర్యసారతఁ, దూలించినఁ దొలఁగి నీసుతుం డిల కుతికన్. 184

చ. వికలరథప్రయత్నుఁ బృథివీపతిఁ గన్గొని ద్రోణపుత్రక
ర్ణకృపులుఁ దక్కనుం గలుగునాయకులున్ రయమార వచ్చి కూ
డికొనుట సూచి యెంతయు వడిం జముదెంచిరి ధర్మసూనుపాం
తమున సముదగ్రులై యతినిశ్చితశస్త్రులు సంగరకౌతుకంబునన్. 185

వ. ఇత్తెఱంగున సవరాహ్ణంబున దొరకలమొత్తంబు లొక్కటఁ బెరకుం దార్కొనిన నుభయబలంబులు నురవడించి కలయంబడి పెనసినం గ్రందుకొన్నం బయ్యెనందుఁ జిందంబులమ్రోఁతయు నార్పులయులివ్వును బాణకృపాణాది హేతిసంఘట్టనంబునం బుట్టు రణనంబును రథావయవాస్థిక పాలభంజనంబున పెనంగునినదంబునుం గూడి పరఁగిన దిక్కులు పిక్కటిల్లఁ గరులకొమ్ములం జక్కఁ బ్రేలుతురంగంబులును సందుకొని చొచ్చినసుభటులు [1]సెరివిన నొఱిగి కూలుశుండాలంబులును నాశ్వికుల మొగంబునం బడి లులాయంబులు సొచ్చినసరోవరంబులచందం బగుకాల్బలంబులును రథికులు వేక పెనంగిన నఱవఱ లయినయురదంబులును నెత్తురుకాలువలును గండలతిట్టలును బ్రేవులప్రోవులును నెమ్ములరాసులును నత్యంతరౌద్రంబు నావహించె ననుటయు నాంబికేయుండు. 186

చ. సమరము [2]పెంపు సెప్పెదవు సంజయ చెప్పవు నీవు నీమహీ
రమణునిభంగి ధర్మజుశరంబులచే విరథత్వ మొంది మా
నముఁ బలముం దెగం దొలఁగెనా మగుడం బురికొంట లేదె ని
క్కము సెపుమా తనూజుభుజగర్వవిహీనత నొంచెఁ జిత్తమున్. 187

వ. అనిన నాసూతనందనుం డమ్మానవపతి కిట్లనియె. 188

తే. విరథుఁ డయ్యెను కాని యవ్వీరుఁ డాహవంబు దక్కక యొండురథంబు వన్ని

1. జ. వొదివిన. 2. గ. సొంపు.

కొని సముద్ధతి వచ్చి సక్రోధ మైన,మనమున నాతునకు నిట్టు ǂ లనియె నధిప.

ఆ. [1]తెల్లనీవిరులును ǂ వెల్లనిగొడుగు నై, యల్లవాఁడె పాండవాగ్రజుండు
మెఱసియున్నవాఁడు పటుప్రభ మహోత్కటిక్కి,గదమఘోటకములయరయము మెఱయ.

వ. అనుటయు నతండు నవ్వు చేయు నయ్యుధిష్ఠిరుండు నిజసారథి నాలోకించి యహి
కేతుమహితం బై వచ్చుచున్నధృతరాష్ట్రనందనస్యందనంబునకు సమ్ముఖంబుగా
మనరథంబు నడుపు మనుటయు నాతం డవ్విధం బాచరింప నయ్యిరువు రతిరథ
కులకుఁ బ్రకటప్రధనం బయ్యె నట్టియెడ. 191

సీ. పాండవుచాపంబు ǂ ఖండించె నీకొడు, కొండొకధను వెత్తి ǂ యాఱిక యాతఁ
డకురునాథువిల్ ǂ గ్రక్కునఁ దునుమాడె, నతఁడు వేఱొకవింట ǂ నతని నేయ
నయ్యుధిష్ఠిరుఁడు నాశనాస్త్రంబు లేసిన, నాచ్ఛాదితం బయ్యె ǂ నంబరంబు
వా రొండొరుల రక్తధారాప్లుతులఁ జేసి, ఫుల్లకింశుకభంగిఁ ǂ బొలిచి రేచి

ఆ. ఘోరశక్తి వైచెఁ ǂ గౌరవపతి యది, నడుమఁ దునిమి ధర్మనందనుండు
నొంచె నిశితవిశిఖపంచకమున్ వన మ్మహీశునురము దర్ప ǂ మొనర నొనఁగ. 192

వ. ఇట్లు కౌంతేయముఖ్యుచేత నొచ్చియు గాంధారీనందనుండు. 193

చ. బరవస మొప్పఁ గ్రూరనవభల్లవిదారితుఁ జేసె నమ్మహీ
శ్వరు నతఁ డల్గి బల్విడుగుపాడ్పుశిలీముఖ మిచ్చి పోవ న
క్కురుపతి నేయఁ గయ్యమున నొకం దుది యప్పుడు చేయువాఁడు గా
నరదము డిగ్గె నాతఁడు గదాకలనోద్భటబాహుదండుఁ డై. 194

క. డిగి రయమునఁ గదిసిన నా,జగతీపతి యేచి యుగ్రశక్తి నురము వె
ట్టుగ వైచిన నీతనయుఁడు, మగుడఁగ రథ మెక్కి వింట ǂ మూర్ఛనువాఁడై.

దుర్యోధనుఁడు ధర్మజుతో యుద్ధముసేసి మూర్ఛిల్లుట.

క. అత్తఱిఁ గడుఁబెల్లుగఁ గ్రొ,న్నెత్తురు వడియుటయు నతఁడు ǂ నిర్భరమూర్ఛా
యత్తుఁ డగుడుఁ గృతవర్ముఁడు,దాత్తత నెడసొచ్చె బాహుదర్పము నెఱయన్.

ఉ. ఆతనిఁ దాఁకె వీఁక ననిలాత్మజుఁ డప్డు బలంబు మారుతో
ద్ధూతపయోధివోలె వడిఁ ǂ బోడ్పడియెం గృతవర్మ కంత ను
ద్ద్యోతితభంగి వచ్చి విజయుండు వెసం దునుమాడె లీల మైఁ
జేతులతీఁట వోవ రథసింధురవాజిభటోత్కరంబులన్. 197

వ. అంత. 198

క. కురుపతి దెప్పిఱి బాహు,స్ఫురణంబు దలిర్ప నింద్రజుని మూర్ఛని ని
ష్ఠురవివిధవిశిఖవినిహత, శరీరుఁ జేయుటయు నతఁడు ǂ సక్రోధుం డై. 199

తే. కార్ముకముఁ గేతువును ఘోటకముల నూతు
వెడఁదబలుతూపు లేడింటఁ ǂ బుడమిఁ గూల్చి

1. గ. తెలనె నసిడము ♦ తెల్లనిగొడుగు నై.

భల్ల మొక్కట నతనిపెన్నెల్లు దునిమి
ప్రాణముల్ గొనఁ జాలెనుబాణ మేసె. 200

క. కని యాఱమ్ముల నెడ నడి, దునియఁగ గావించె గురుసుతుం డాకనివి
ల్లును మఱలందునిమి పార్థుం,డదియు మూర్కొనుకృపునిచాపదండము ద్రుంచెన్.

చ. వడిఁ గృతవర్మ దాఁకిన నపారశరంబుల దద్ధనుర్జ హయంబులన్
సిడమును రూపుమాపి పిలుకుల్లి యెదిర్చినదున్నసేనపైన్
నడిమికిఁ ద్రుంచి గాండివగుణధ్వని దిక్కులు పిక్కటిల్ల నె
క్కుడుమద మొప్పఁ గర్ణదెసకుం జన సారథికిం బుదగ్రుఁడై. 202

క. అన్నరుని మూఁడుశరముల, నెన్నని నిరువదిని శాతవిశిఖముల వెసన్
భిన్నాంగులఁ జేసి విజయుఁ, డు న్నేసినయున్నిబాణక్రమములఁబట్టెసెన్. 203

వ. అంతకు మున్ను సాత్యకితోడం బోరి పోరి రాధేయుండు దనదెస కడరిన కవ్వడిం గని యక్కడ మొగం బయి యిటుపరాక్రమించినం జూచి యేచి యా సవ్యసాచి కడ్డపడి యుక్కౌశవానుజుండు. 204

తే. నవతిశరముల నవమార్గణముల శతశిలీముఖంబుల నేసి ద్రోర్గ్లల మొఱయ
సారథిధ్వజహయరథసహితముగ ను,దీర్ణదర్పుఁడై కప్పె నక్కర్ణుఁ డధిప. 205

వ. అప్పుడు యుధామన్యుండును శిఖండియు ద్రౌపదేయులును నుత్తమౌజుండును యుయుత్సుండును గవలును ధృష్టద్యుమ్నుండును జేకితానుండును బ్రభద్రక చేదికరూశ మాత్స్య కేకయ వత్స బలసమేతంబుగా ధర్మనందనోత్సాహదీపితాటోపశోభితులయి కవిసి వివిధాస్త్రశస్త్రవ్రాతములు లాసూతసూనుపయి నడరించిన నవ్వీరుండు.

మ. అని వేగంబ మరల్చి భూరిపవనవ్యాపారనిర్ధూతతా
టవులం బోలఁగఁ జేసి దంతిభటఘోటస్యందనశ్రేణులన్
దివిజవ్రాతము పిచ్చలింప రభసోద్రేకంబు రౌద్రంబుఁ బెం
ప విజృంభించె ధనుర్గుణధ్వని నభోభాగంబు భేదింపఁగన్. 207

మ. కని గాండీవధరుండు దర్పమెసఁగం గర్ణాస్త్రజాలంబు నీ
సున వారించి శిలీముఖార్చులు పరిస్ఫూర్జత్ప్రభం బర్వఁ బే
ర్చినఁ గార్చిచ్చుడరన్ మృగంబులు భయోద్రేకంబునం బాఱుచా
డ్పున నీమూఁకలు నల్గడం బఱచె [1]నుద్యద్భాతభ్రమార్తంబులై. 208

వ. అంత నంశుమంతుం డపరగిరియవులకుం జనుటయు ధరాధూళికిఁ దోడు సంధ్యారాగమిళితంబై నతిమిరంబు గవిసిన నెద్దియుం గాన రామిం జిత్తంబులు గలంగ రాత్రియుద్ధంబునకు నోహటించుటం జేసి మనదొరలఁ బాండవసైనికులు దఱిమినం దాల్మి వాటింపక తిరిగిపోయిరి జయంబుసేకొని వీరినవ్వాము వాయుగవ్వడిం గమల

1. క. నిష్ఠ్యూతాంబుదాభంబులై.

రేపకడ సమస్తజనంబులు సంగ్రామంబునకు నడచి రంత నక్కడ నుక్కుమిగిలి
పాండవబలంబులుం దోఁతెంచె ధర్మనందనుండు బృహస్పతిమతంబైన దుర్జయ
వ్యూహంబు పన్నించినం జూచి మనవారును వానికిం బ్రతిగా మకరాకారంబు పెట్టకై
రాధేయు రాకకు నెదురుచూచుచు నొకభంగిం బన్నిరనిన విని యాంబికేయుండు.

క. శీతార్తజనంబులు ప్రద్యోతనునుదయంబు గోరుచున్నకరణిం దా
నే తేరఁ గురుజనులకు, నాతఁడు నిజతేజమునఁ బ్రియంబొనఁగెనొకో. 219

ఉ. అమ్మెయి ధర్మనందనునియగ్గలికం దొలునాఁడు రాజు బ
న్నమ్ములపాటు నూచుచు రణంబుకడంక దొఱంగి చన్నటం
బమ్మెయి నద్దినంబున నహీనపరాక్రమలీల నూపెనో
తమ్ముల నెఱుంగ రేమియు నహితండును నాతఁడు నేమి సేయుఁడున్. 220

ఆ. కర్ణుఁ డట్టి కలనఁ గౌంతేయవర్గంబుఁ, గృష్ణయుతము గాఁగ గెలువఁజాలు
నేమి సెప్పఁగలదు మామానవేంద్రుని, చిత్తమాంద్య మతిశయిల్లఁజేయుఁ గున్న.

క. సౌబలునీతియుఁ గర్ణుభుజాబలమును గూడి తనకు సామ్రాజ్యం బీఁ
గా బలసి వెలయువాఁడై, యాబేలూఱి మనంబున నెప్రొద్దున్. 222

క. జూదంబునాఁడు మొలచిన, యాదుర్దశ పెరిఁగి సంజయా సర్వసుఖో
దయపరంపరాసం, పాదిని యై మనసు నిట్లు పఱిగొనియెడినే. 223

క. దుర్యోధను చేసినయవ, కార్యంబున వచ్చినట్టికష్టంబులు దా
త్పర్యంబున వినియెదఁ బ్రతి, కార్యంబులు [1]గామి మనసు గందుచు నుండన్. 224

క. పాండునృపసుతులలో నొక్కండైనను నొవ్వఁ డింతకును మును వనితా
మండలి చేరువ మొలఁగెడు, గండున మొఱసెదరు కురునికాయము[2]ననుమన్. 225

వ. దైవంబు బలవంతం బనినవిని సంజయుండు జననాథునితో దేవా వినుము వగచినం
గృతపడిన కార్యంబు గ్రమ్మఱం బొడమునే డెందము గుందు నంతియ కాక యట్లుం
గాక నీవు సేసినయదియ చూవె ఫలించె భండనంబు వలదని యెన్నిభంగులం
జెప్పినం బాండవులకుం గీడు దలంచి యప్పలుకులు గొన వైతివి వారలవలనము
న్ననేకపాపంబు లాచరించితి నీవలన జనక్షయంబు వాటిల్లెం గావునఁ గడవంబడిన
దానికి వగవం బనిలేదు దారుణంబైన రణంబు వినుము మనుటయు నతండు కర్ణుం
డట్లు దడసినకారణంబుఁ దొడంగి యెఱింగింపు మనుటయు నమ్మానవేశ్వరునకు
నాసూతనూనుం డి ట్లనియె. 226

క. రేపకడ సకలబలములు, భూపాలురు వెడలి నడవఁ గోరికిఁ బినపన్
నీపుత్త్రుఁడు వెడలెను సాటోపతఁ దమ్ములును గర్ణుఁడును దోనడవన్. 227

వ. అయ్యవసరంబున. 228

సీ. రథము రథమ్ముఁ జేరఁగఁ దెచ్చి యమ్మేదినీశ్వరుతోఁ గర్ణుఁ డిట్టు లనియె

1. క. గనమి మనసు. 2. క. నెమురన్; ఖ. ఱుమమున్;

నాకుఁ గృత్యంబు లనేకములు గలిగె నను, న్నాథ ధనంజయునకు నట్లు గాన
యీరసంబున మూఁడు నిద్దఱ కొండొరు, వినుమ వెనుఁగఁ జొప్పడద యింకఁ
[1]గలవా మొక్కమొగంబుగాఁ బుస నేఁ డేను, సలుపఁ బడి పోరు నసురులవుఁ జలము

ఆ. సుల్లసిల్ల నొక్క రౌకరుని నొంపను, జంపఁ జూతు మీరు నిగ్రహింపనాథు
వలనఁ గన్నశక్తి వొలియూట నామీఁద, నలుకు లేక తెలియుమనాతఁ డధిప. 229

వ. అప్పుడు చేసెత్తురు గా కుంత సక్కిరీటి గిటు సంగించువిధంబూహింపుము. 230

చ. సరియగు నాకు దివ్యశరజాలములం దలఁపోసి చూచి న
న్నరుఁడు దృఢత్వలాఘవగుణంబులఁ దక్కువ యారపాలి వి
స్ఫురణఁ గరంబు [2]వట్రపడు భూవర సౌష్ఠవరేఖ నేమియుం
దొరయఁడు ధైర్యశౌర్యపటుదోర్విభవంబుల హీనుఁ డెంతయున్. 231

క. మును విశ్వకర్మ దేవేంద్రునకై నిర్మించె మహితరూపము విజయం
బను చాపము దానన బహుదనుజుల మర్దించె నలఁ డుదగ్రస్ఫూర్తిన్. 232

చ. పరిచయ సక్తచిత్తుఁ డయి భార్గవరాముఁడు కాతఁ డిచ్చినం
బరువపరాక్రమమ్మున నృపాలుర నెల్లను నిమ్మహాభుజుం
డిరువదియొక్కమాఱు సమయించెఁ దదీయనితాంతశక్తిన
ప్పురమదయాపరుం డొసఁగెఁ బార్థివ నాకది కూర్మి పెంపునన్. 233

ఉ. ఆమహనీయచాపమున నర్జునుదర్ప మడంచి నేఁడు సం
గ్రామము సుజ్జగించెద నకంటకసుస్థితి గల్గ మేటి నై
భూమి [3]యమర్చెదం గొనుము భూవర నీ దగుపుత్త్రపౌత్త్రులన్
శ్రీమహిమార్క సమస్తజనసేవ్యమహోన్నతిఁ బొందునట్లుగన్. 234

వ. అని పలికి వెండియు నిట్లను నావిజయంబును విజయగాండీవంబును నొక్క
రూప యతనికి నక్షయతూణీరంబులు నగ్నిదేవుం డిచ్చెనయు భేద్యరథంబును
నవధ్యరథ్యంబులుం గల వవి యొక్కఁడయినను దాని కంతఁ జింతింప. 235

క. నారాచము లాదిగఁ గల, ఘోర ప్రదరములు బండ్లఁ గొని వచ్చెద బల్
తేరులు దృఢవాజులు నా, తేరి వెనుకఁ బెక్కుమర్చి తెచ్చెద నధిపా. 236

వ. మఱియు నొక్కం డాకర్ణింపుము భువనప్రవర్తకుం డయినకృష్ణుండు సారథ్యంబు
సేయుట నప్పార్థుపరాక్రమం బసాధ్యంబై యుండు నట్లగుటం జేసి. 237

తే. ఖండనము నేర్పుమెయిఁ గృష్ణుపాటియనఁగ, మహిఁ బొగడ్తకు నెక్కినయమద్రనాథు
నాకు సారథి గాఁగ నొసర్పవలయు, గెలుతు నల్లైన నన్నరు నలవు మెఱయ.

క. హరి కక్కడరయ మద్రేశ్వరుఁ డశ్వజ్ఞానమున నసమశౌయు మే న
న్నరునకు మిక్కిలి బలవిస్ఫురణంబునఁ గర్మకుశలబుద్ధిఁ దలఁపన్. 239

క. కావున నవ్వర మిమ్మటు, గావించుట యెల్ల హితముఁ గావించినయ

1. చ. గల వెంత మొగి మను గావున. 2. జ. దొట్రుపడు. 3. జ. యొనర్చెదం.

ట్టి వెలయు నింత సేసి మ,హీవర ననుఁ జూడు పోర నె ట్లొనరింతునో. 240

క. విను మిత్త్రైఱఁగున నే న,య్యనిమిషవర్గంబు నైన నాజి జయింతున్
మనుజులు పాండుతనూజులు, జననాయక నాకు నొక్కసరకే తలఁపన్. 241

వ. అనిన విని నీపుత్త్రుండు ప్రీతుండయి రాధేయు నగ్గించి నీ కెల్లభంగి నిశల్యుసారథిం గావించెద నని పలికి కుతూహలదీప్తుం డై. 242

క. అమ్ములబండ్లును రథర,థ్యమ్ములునుం జెక్కుఁ దెత్తుఁ నవనీశులు నా
తమ్ములు నేనును నీపా,ర్శ్వమ్మున నడచెదము [1]బరవశనంబు గ్రముగన్. 243

క. అని చెప్పి ప్రీతుఁ డగునా,తనిఁ దోడ్కొని నడచి సముచితంబుగ శల్యుం
గని భక్తిఁ బ్రణతుఁ డై యి,ట్లను దుర్యోధనుఁడు సవినయముగ నతనితోన్.

—దుర్యోధనుఁడు శల్యునిఁ గర్ణునకు సారథ్యంబు సేయు మని ప్రార్థించుట.—

సీ. సత్యవ్రతంబును శాత్రవదుర్దశా,పాదనంబును మహాభాగతయును
నీకు నైజంబులు నాకుఁ బెద్దయుఁ గూర్తు, గావున నిన్నును గారవించి
వినతుండ నై వేఁడికొనియెద రాజుల, నడుమ నీ దగుసామర్థ్య మెఱిఁగి
యర్జును నని దెగటార్పఁగ వలయుట, యూహించి సంభృతోత్సాహ లీలఁ

ఆ. గావు మితని ననుచుఁ గర్ణునిఁ జూపి యీ,తని రథంబు గడపు మనఘ యిట్టు
లైన నితఁడు పగఱఁ బోనీక పొదివి య,స్ఖలితగతుల నొంపఁ జంపఁ జాలు.

చ. గురుఁడును భీష్ముఁడుం జనినఁ గొంచెపుమూఁకలతోడ నేను నం
గరవిజయంబు గోరి భుజగర్వమునన్ సడి నన్న పాండుభూ
వరసుతవర్గముం దొడరువాఁడన కా మది నిశ్చయించు టె
వ్వరిఁ గొని యింత నీ వెఱుఁగవా నినుఁ గర్ణునిఁ గాదె నమ్మితిన్. 246

క. ఇమ్మెయి వీర[2]మ్ము సార,థ్యమ్మితనికిఁ జేయు మినున కరుణుఁడు సాహా
య్య మ్మొనరిచినట్లుగఁ దిమి,రమ్ముక్రియఁ గా రూపు సెడి యరాతు లడంగన్.

క. అనిన విని కెంపుసొంపునఁ, గనుఁగవ యుగ్రముగ బొమలు గదియఁగ ఫాల
మ్మునఁ జెమటవొడమ నీసుతుఁ, గనుఁగొని యిట్లనియె నతఁడు కటము లదరఁగన్.

సీ. నను నింత నీచపుఁబనికిఁ బంపఁగ నీకుఁ, దగునె భూవర వర్ణధర్మ విధము
తెలియఁగ వే శూద్రుల కేనాఁటఁ బరిచర్య, సేసిరి మూర్ధాభిషిక్తు లైన
రాజులు సూతజు రాధేయు దొరఁ జేసి,కొని యేను సారథ్యమునకుఁ జొరఁగఁ
జాల నీతని బలశాలిఁగాఁ దలచెదు, [3]నాకంటె నిట్టిబన్నంబుఁ గలదె

ఆ. పగఱలోన నొకనిఁ బాల్పట్టు మెట్టివాఁ,డైన సమయఁ జూచి యురుగు వాఁడ
నట్టిభంగి సాల దంతేనిఁ [4]దరవాయి, గొని వధింతు శత్రుకోటి నెల్ల. 249

---

1. క. బరవసముద్రగమునన్. 2. గ. మితనికి సహాయమ్ముగ నినునకు ననూరుసారథ్యసహాయ మ్మొదవి_జ. మ్మసారథ్య మ్మితనికిఁ జేయు వినతతనయుసహాయత్వ మ్మొదవినరవిగతి. 3. క. నా కింతకంటె బన్నంబు. 4. క. దరువాయి_గ. అరవాయి.

క. విను మేను విక్రమింపఁగఁ, గనుఁగొనియెడు నంతవాఁడుఁ | గలఁడే కులశై
లనికాయంబు వగుల్తుఁ, వననిధులు గలంతు ధరణి | వ్రత్తుం గలయన్. 250

చ. నరవర చూడవే తెలిసి | నాదగు బాహులు మద్బలంబు నీ
వరయక పల్కితే నొకని | తక్కుట సారథి నైరథిత్వవి
స్ఫురణము తక్క నోపుదునె | సూతతనూజుఁడు షోడశాంశమున్
దొరయఁడు నాకు దానవసుకేతు సురమర్దనుఁ జీరికిం గొనన్. 251

వ. ఇట్లుగు లెఱుంగక చెప్పితి నెఱింగియుం గర్ణపక్షపాతంబున నవమానించెదేనిమా
భూమికిం బోయి వచ్చెద నని పలికి రాజమధ్యంబున నుండి వెడలిపోవం జూచినం
గురుపతి సప్రణయబహుమానంబునం జని నిలువరించి సాంత్వనస్వరంబున మధు
రాక్షరవిన్యాసంబుగా నతనితోఁ [1]కర్ణుండ యేల తక్క నీకెక్కుడయినరథికులుం
గలరే కడిందివగలకు హృదయశల్యం బగుటం గాదె నీకు శల్యుం డనునభిధానం
బయ్యె నాయభిప్రాయంబు వినుము ధనంజయునకు రథికగుణంబులం గర్ణుండు
మిక్కిలి కృష్ణునకు నశ్వహృదయజ్ఞానంబున నీవధికుండవు ధనంజయునకుఁ బ్రతి
వీరుంగా మనము కర్ణుం జాలించితి మది కృష్ణుండు నిల్ల నీకునికిం జేసి కృష్ణువర్త
నంబునకుఁ బ్రతివిధానం బాచరింప నిన్నుంగోరితి నింతవని నీకుందక్క నొరులకు
శక్యం బగునే యనిన విని ముదితహృదయుం డయి మద్రేశ్వరుండు. 252

క. ననుఁ గృష్ణుకంటె నధికుం, డని యిమ్మనుజేంద్రకోటి | యాకర్ణింపం
గొనియాడితి విమలయశో,ఘనుఁ డగుకర్ణునకు రథము | గడపెద నధిపా. 253

వ. అని యా సూతునందను నుద్దేశించి వెండియు నిట్లనియె. 254

క. జనవల్లభ యొకసమయము, విను మాతనితోడ నేను | విచ్చలవిడిఁ దోఁ
చినమాట లెల్ల నాడుదు, నను నెగ్గులు పట్టకుండ | నం బొందొనరున్. 255

క. అనుటయు గౌరవమున నీ,తనయుఁడు రాధేయుఁ జూచి | తగు నిట్లగుఁ గా
కని పలికి శల్యునిం గనుఁ,గొని యిది గడు లెస్స యనియెఁ | గురువంశనిధీ. 256

వ. ఇట్లభినందించి యున్నయన్నరేంద్రుం డమ్మద్రపతిమనం బురియాడునోయని
శంకించి యతనితో మఱియు నిట్లను నివ్విధం బాచరించుటకు విచారంబు వలవదు
తొల్లింటిపెద్దలవృత్తాంతంబు వినుము మార్కండేయమహాముని మాతండ్రి కేను
వినుచుండఁ జెప్పినయది నీకుం జెప్పెద సురలతోడి దురంబున నసురవరుండగు తార
కుండు దెగినపిదపఁ దదీయతనయులు విద్యున్మాలియుఁ దారకాక్షుండును కమలా
క్షుండును ననువారలు వారిజాసను నుద్దేశించి. 257

దుర్యోధనుఁడు శల్యునకుఁ ద్రిపురాసురుల వృత్తాంతంబు సెప్పుట.

క. దమమున నియమంబున ను,త్తమమును ఘోరంబు నైనతప | మతినిష్ఠం
బ్రమదితు లై చేయఁగ న,క్కమలభవుఁడు దోఁచి పరమ | కారుణ్యమునన్. 258

---

1. క. గర్ణుండ తేల తక్కనీ కెక్కుడురథికులుం.

వ. వరంబులు గోరికొం డనవుడు వా రందఱు నొక్కమాటయ కా సకలభూతంబుల వలనను సర్వకాలంబులయందును నవధ్యత్వంబు మాకు నీ వలయు నని యడుగుటయు నయ్యజుండు. 259

క. ఆచంద మెందుఁ గల దది, గోచరమే [1]యిచ్చుటకును ? గొనుటకుఁ దగుమై
నూచి యడుగుండు [2]శుభదం, బై చెల్లెడునట్లుగాఁ బ్రియంబున నిత్తున్. 260

వ. అనవుడు నయ్యసుర లస్త్రైవిమాను మహ్యాంకపు మయుఁడుపురంబు లెల్లసుఖంబులుం గలిగి కామగమనంబు లై దేవదానవయక్షోరగాదిజాతులకుం జెఱుప రాక విల సిల్లునట్లుగా నొసంగు మేము భవత్ప్రసాదంబునం బున నిర్భయులమై పెంపొంది సంచరించెద మనుటయుఁ బద్మభవుఁ డిది యెన్న దీనికిం దుది యిట్టిద యని నుడివి యట్టిద గాకుండ నప్రమత్తుల రై వర్తిలుం డనిన నద్దనుజేంద్రు లప్పురంబు లెప్పు డొక్కెడం గూడె నప్పుడు బలియుం డగువాఁడు పెఱుపం దలంచినం జెడునదిగా నొడంబడితిమి త్రిపురంబులు సంగతంబులు గాకున్న నసాధ్యంబు లై వెలయ వలయు నని పల్కిన నద్దేవుండు వీరు పురత్రయంబును సంపాదించుకొనుం డే నమ్మహానుభావంబులం బొందునట్లుగా నిచ్చితి నని నిజస్థానంబునకుం జనియె నిత్తెఱంగున. 261

తే. వరము వడసినయాదైత్యవరులు దమకుఁ
బురము లొనరింప దానవపూజ్యు మయుని
వేఁడికొనుటయు నాతఁడు ? విపులతపము
కలిమి నొప్పారుపురవరత్రయమ్ములు ఘటించె. 262

వ. అవియుం బ్రాకారగోపురప్రాసాదప్రముఖవివిధాలయంబులు పసిండియు వెండి యు నినుమును నై నాల్గుదిక్కులు నూఱేసియోజనంబులు గలిగియుండు నందుఁ బసిండిం జేసినయది దివంబునను వెండి నొనరించినయది యంతరిక్షంబునను నిను మునం గావించినయది భూమిని సంచరింపను వరుసన వానికిం దారకాక్షుండును గమలాక్షుండును విద్యున్మాలియు రాజులయి దివ్యంబు లగునంబరంబులను నాభర ణంబులను మాల్యానులేపనంబులను మఱియు ననేకవిభవంబుల నుజ్జ్వలులై [3]నెగ డుదు రిట్లు పురత్రయవిహారంబున జగత్త్రయంబును నాక్రమించి యసురత్రయం బప్రతిహతవిభూతిమై వర్తించు నమ్మువ్వురుం దన్ను నాశ్రయించుటం జేసి వారల యోగక్షేమంబు లరసికొని యెవ్వరికి నెయ్యది యిష్టం బయ్యది యెల్లం దన మాయాబలంబున మయుం డొదవించుచుండు నవ్విధంబునఁ బరమసౌఖ్యంబు లనుభవించుచుండ బహుకోటిసంవత్సరంబులు సనియె నట్టియెడ. 263

1. చ. నిచ్చువరము గొనుఁడు దగవు నై. 2. జ. సుఖదం బై, 3. జ. నెగడి రట్లు.

సీ. తారకాక్షుని కొడుకగు కమలాక్షుండు హరి యన, జనియించి వారిజాసనుగుఱించి
తపము సేయంగఁ బ్రత్యక్షుండైన యద్దేవుఁ, డడుగుము వరమన్న నతఁడు త్రిపుర
ములవార లాయుధంబులు దాఁకి చచ్చినఁ, బీనుఁగుల్ నీరిలోఁ బెట్టి తడుప
నొక్కఁడు పదుగురై యెక్కుడులావును, బీరంబు మెఱయ సంప్రీతి నుల్ల

ఆ. సిల్లునట్టిబావి చిరతరతోయమై, యాపురములఁ జిత్రమహిమ వెలయ
నావహిల్ల వలయు ననిన నిచ్చితి నని, యమ్మహాత్ముఁ డరిగె నదియుఁ గలిగె.

వ. ఇట్లు మహాప్రభావంబైన[1] యబ్బావి వడసి యప్పురంబులవారు పోరికి శంకింపక నిర్జరభయంకరు లగుచు భువనంబు లన్నియు బాధించుచుం బెఱిగి లోభమోహ వశతం బొంది విచ్చలవిడిం దిరుగం దొడంగిన దేవపితృమునిజనస్థానంబులకు హాని పుట్టినం బురందరుం డఖిలబృందారకులు బరివేష్టింప నప్పురంబులపై నెత్తి చని పెనంగి ఛేదింపం జాలక విషణ్ణుం డయ్యె నంత నతండు దివిజులుం దానుసంయమి సహితుండై చతురాననుపాలికిం బోయి ప్రణామపూర్వకంబుగా సద్దానవుల తెఱంగెఱింగించి తద్వ్యధోపాయం బడిగిన నతండు వారల కిట్లనియె. 265

ఉ. ఏచినయాపురత్రయము నేకశరంబున రూపు మాపఁగాఁ
జూచినఁ బోవుఁ గాని పెఱచొప్పునఁ బోవదు సంగరోన్ముఖుం
డై చనుదెంచెనేని మదనాంతకుచే నది సెల్లు నొండ్లకు
న్గోచర[2]మొట్టె యింతలు వసనుల్ సనుఁ డమ్మహాత్ముపాలికిన్. 266

ఆ. అనిన నట్ల కాక యని దివ్యవర్షసహస్రకంబు వార లధికనిష్ఠ
నతులతపము సేసి యత్యంతశుద్ధాత్ములై మహేశుకడకు నరుగునపుడు. 267

వ. అవ్విరించిం బ్రార్థించి పురస్సరుం జేసికొని యరిగి. 268

క. వరదు శరణ్యు శశాంక, స్ఫురితశిరోభాగు సర్వభూతేశ్వరు శం
కరు సాంఖ్యయోగనిష్ఠాపరసులభు ననంగదమనుఁ బరమాత్ము శివున్. 269

—త్రిపురసంహారమునకై బ్రహ్మాదులు రుద్రునిం బ్రార్థించుట.—

వ. కని ఫాలంబులు భూమి సోఁకం బ్రణమిల్లిన నద్దేవుండు మీరాకకుం గారణం బేమి యనవుడు లేచి నిలిచి వారు కరకమలంబులు భక్తి మొగిడ్చి. 270

క. స్తుత్యానుభావ నిర్మల, నిత్యానందస్వరూప నిగమవిరోధి
స్థిత్యపనయనోన్ముఖ చిత్సత్యాత్మక భక్తలోకదౌర్గత్యహరా.

వ. అని మఱియు ననేకప్రకారంబులం బ్రస్తుతించినం బ్రసన్నుండై భవుం డాదరించి మీకు భయంబు వలవదు మీచెప్పినయట్లచేసెద వలయు కార్యం బెయ్యది యనిన దేవమునిసంఘంబులు ప్రహర్షంబు నొంద నరవిందభవుం డప్పరమేశ్వరున కిట్లనియె

1. క. యవ్వరంబు వడసి 2. క. మెట్టు లింతలు పనుల్ సనుఁ డమ్ము: మెట్లగుం జనుఁడు గొల్చునమ్మ.

సీ. ప్రజలకుఁ బతి గాఁగఁ బనిచితి నీవు న, న్నట్లు పద్మభవుండ నగుటఁ జేసి
విచ్చలవిడి వరం బిచ్చితి నసురత్రయంబునకు దుర్గత్రయంబు గలిగి
యమ్మువ్వురును వారు నాక్రమమున భువ, [1]నత్రయము బాధనం బొనర్చు
చున్నారు వారల నోరులకును జంప శక్యము గాదు నీవ శిక్షింప జెల్లు

ఆ. వలయు మునులు దేవతలు నేను శరణుఁ జొచ్చితిమి నిన్నుఁ గరుణఁ జేకొనంగ
వలదె మమ్ము నోరులు గలరె జగంబులఁ గావ భూతనాథ నీవు దక్క. 273

వ. అనవుడు నద్దేవుం డయ్యసురులు సెఱుపవలయువా రగుటను వారలు బలవంతులే నొంటిమై నాపనికి నుత్సహింప నేర మదీయంబు లయిన తేజోబలంబులం గర్ధంబు పుచ్చికొని మీరందఱుం గూడి యాదుష్టదైత్యుల మర్దించుట కార్యం బనిన నద్దివిజులు మా కందఱకుంగల తేజోబలంబులకు నద్దనుజుల తేజోబలంబులు రెట్టియయి యుండు నట్లగుటం జేసి మాచేతం జెడరు భవదీయ తేజోబలంబులు భరియింప మేము శక్తులము గాము మాయందఱ తేజోబలంబులలో సగంబు పుచ్చికొని నీవ యాశత్రుల సమయింపు మెల్లభంగిని నీకు రక్షణీయుల మగుమమ్ము రక్షింపు మనుటయు నజ్జగన్నాథుండు. 274

క. అమరులకు నసురులకు నే, సముఁడ శివం బఖిలభూతజాలంబులకున్
సమత నొనరింప శివనా,మము నాకుం జెల్లు లోకసామాన్యం బగుచున్. 275

వ. అయినను. 276

చ. అనయముఁ గ్రూరకర్ము లగు నట్టివిరోధులఁ బల్కుఁ బూర్పఁ బూ
నన తగు ధర్మవర్తను లనం జనుమీయెడ ద్రోహు లైనయ
ద్దనుజులఁ ద్రుంచి మీకుఁ బ్రమదం బొనరించెదఁ దేజముం బలం
బును సగపాలు వెట్టి ననుఁ బొందఁగఁ జేయుఁడు మీర లందఱున్. 277

వ. అని మఱియు నొక్కటి సెప్పెద లోకంబుల కెల్లను బశుత్వంబును నాకుం బశుపతిత్వంబునుం గావలయు నట్లయినఁ బశుమానసంబునం బాపంబు లేకుండు. 278

క. ఒనరింపుఁడు దివ్యరథం,బును దచ్చోదకుని నశ్వముల విల్లును న
మ్మును నాకు నట్లు లైనను, దనుజులదుర్గములు వినిపాతము లగు నాచేన్. 279

ఆ. అనిన విని పశుత్వమునకు శంకించి వి, ష్ణుఁ డైనసురలచంద మెఱిఁగి
భయముఁ గొనఁగవలదు పశుభావమోక్షణ, విధముఁ గలదు దాని వినుఁడు మీరు.

వ. అని పలికి హరుండు వారలతోఁ బశుపతివ్రతానుష్ఠానంబునం బశుత్వమోక్షణం బగు నదియును ద్వాదశాబ్దములు నవవలయు నిష్ఠానురూపంబుగా సంవత్సరంబునఁ దదర్ధంబున ఋతువున మాసంబునఁ బండ్రెండుదినంబుల మాత్రను ఫలించు ననుటయు నట్లకాక యని వార లందఱును లోకంబులకు లోకేశ్వరునకుఁ బశు

---

1 క. నత్రయంబును బాధ నలఁచుచున్న, వారల నుడుప నెవ్వారికి శక్యంబు, తఱి గాదు శిక్షింప చెఱుప నిపుడ.

త్వంబుఁ బశుపతిత్వంబుఁ గలుగుటకు నొసంగుటకు యుష్మత్పశుత్వనిఁ బశుపతి వసి
పేర్కొని నిజతేజోంశార్థంబును సమర్పించినం గైకొని యుత్కృష్టబలుండై తొల్లిం
టికంటె వెలుంగె నప్పు డద్దేవునకు దేవతలు విభవంబు నెసంగ బుంహాసనంబునకు
యభిషేకంబునేసి ద్విష్టనాలోకించి మహాదేవునకు దివ్యరథంబు దగి యెట్టు సాధనం
బులనుగల్పింపు మనవుడు నతఁడు ప్రభావమహాసీయుండగు విశ్వకర్మయు సమీహితుండై.

సీ. సామర్థ్య మొప్ప విశ్వంభరారథంబు, రథము గాఁ జేసి చంద్రార్కులను సుష్ఠ
కరుని చక్రంబులు గాఁ బెట్టి సారథి, గాఁగ బద్మజుని హిమనగసీధ
రంబున వింధ్యనగంబున సస్తావ్యలంబున నుదయశైలమున [1]బలువు
టవయవంబులు దీర్చి యఱుగుల మరాటుఁ ద్రి, వేణుకరచనఁ గావించి మేరు

ఆ. పర్వతమున నాతపత్రంబుఁ గల్పించి, హాంసలు వేదములు శరాసనంబు
వత్సరంబు శరము [2]వాసుదేవుండును, గాఁగ సంఘటించె గౌరవమున. 282

వ. ఇట్లు చరాచరాత్మకం బై తేజరిల్లు తేరు సృష్టించి ఫాలాక్షుండు గ్రహామండిత
వ్యోమమండలం బుపాదానకారణంబు గావిశ్వకర్మ గావించినకవచంబు దొడిగి
శరాసనంబు ధరియించి శరంబు పుచ్చుకొని దానవసంత్రాసనోత్సాహుం డగుచు
నారోహణంబు సేసి వృషభధ్వజంబునం బొలు పొంది. 283

ఆ. అప్సరోగణంబు లాడుచుఁ బాడుచు, సంతసమునఁ జెలఁగ సకలమునులు
బహువిధములఁ దన్నుఁ బ్రస్తుతి సేయంగ, నమరవరులఁ జూచి యల్ల నగుచు.

క. సారథి యెవ్వం డనుటయు, వారలు సీచిత్తమునకు వచ్చినవానిం
గారుణ్యంబునఁ గైకొని, తేరు నడపఁ బనుపు మవిరి ధీర విచారా. 285

వ. అనవుడు సద్దేవుండు. 286

తే. అరయ నెవ్వాఁడు నాకంటె నధికుఁ డతని
మీర యెఱిఁగి యెవఁడు సారథిత్వ
మునకు ననిన చెప్పుటయు మహామునులఁ గూర్చి
కొని యమర్త్యులు సంభ్రమవినయు లగుచు. 287

వ. కమలాసనుకడకేగి యతనికిం భక్తిం బ్రణమిల్లి దేవా నీవలన నీలగ్రీవుండు ప్రసన్నుం
డయ్యె భవదాజ్ఞనే మితనికి రథంబుం దగుసాధనంబులు నమకట్టితమిసారథిదొరక
కున్నవాఁ డది యెట్లనిన సారథ్యం బాచరించుపురుషుండు బలసత్వంబుల రథి
కున కధికుండు గావలసి యుండు రథంబు పృథ్వి రథ్యంబులు వేదంబులు రథికుండు
రుద్రుండు రథచోదకుండు సులభుం డగునే గుణాధికుండు వగుసీ విప్రునికిం బూన
వలయు దానవభయభ్రాంతుల మైనమమ్ము రక్షింపుము మా కేమగడయు నీవ

1 అ. నవరత్నపంబులు దీరిచి ♦ వర్గత్రమమునఁ ద్రి. 2 అ. వాసుగోమాగ్నులు c. ఏ క. ధరి
యించి విష్ణుసోమాగ్నిసంభవం బై వెలుంగుశరంబు.

భవదీయప్రసాదంబునఁ బ్రదికెద మని చాఁగిలి మ్రొక్కినఁ బరమాదరంబున
నెత్తి యప్పరమేష్ఠి వారలఁ గారుణ్యంబునం గనుంగొని. 288

ఉ. మీరు నిజంబ చెప్పితిరి § మిక్కిలి నేర్పును లావుఁ గల్గినన్
సారథి పోరులన్ రథికసత్తముఁ డా గెలిపించు బుద్ధిదో
స్సారవిలాసభంగులకు § శక్యుఁడు మెచ్చఁగ నాగమాత్మకో
దారహయంబులన్ నడపెదన్ దనుజుల్ వెఱఁ గందునట్లుగన్. 289

వ. అని పలికి సురగణంబు ముదంబునం బొదలఁ దనచేతికమండలువు వొక్కెడ నిడి జడముడి బిగియించి యజినపరిధానంబు దృఢంబుగా బంధించి ప్రణవంబునం దష్టయోనర్చినముఖకోల పుచ్చుకొని నొగ లెక్కె నిట్లు లోకపితామహుని సురలు శంకరసారథ్యంబు సేయించి రని చెప్పి దుర్యోధనుండు వెండియు ని ట్లనియె.

క. హరు లమ్మహాత్ము లిరువుర, భరింపఁ జాల రొరు లేక § పటుతను నెత్తెన్
వెరవున లావున వాగెలు, ధరియించుచుఁ బద్మభవుఁడు § ధరణీనాథా. 291

వ. ఎత్తియత్తురంగంబులకు వీర్యశౌర్యంబులు గలుగ ననుగ్రహించి రథంబు గడపం దత్కౌశలంబు గొనియాడి కాముదమనుండు దానవుజులదుర్గంబుల దెసకు నరదంబు వఱపుము నేఁడు జగంబులయలజడి మాన్పెద నాచేతిబలువు చూడు మని పలికిన నప్పరమసారథి మనోమారుతజవసత్త్వంబులు గలుగువ్వేదాశ్వంబులం బఱప నథర్వాంగిరసులు చక్రరక్షకు లయి [1]చనుదేర నత్తే రాపురంబుల కడరిన నయ్యాదిమరథికుండు. 292

—శ్రీరుద్రుఁడు త్రిపురంబుల సంహరించి సురల సంతోషపఱచుట.—

సీ. కోపసందీప్తుఁడై § చాపంబు సజ్యంబు, గావించి మార్గణముఁ గూర్చి
పాశుపతాస్త్రసంబద్ధంబుగాఁ జేసి, పురములు మూఁటిని § బుద్ధి నిలుప
నవి యొక్కచోటికి § నరుదెంచి కూడిన మునులును, సురలును § ముదముఁ బొంది
గెలు గెలు మంచు నగ్గింప నయ్యుగ్రుఁడు, దెగ వాపియేసిన § [2]దితిజయుతము

ఆ. గాఁ బురత్రయంబు § గాలి నీఱై పఱ్చి, మాడ్కిఁ దొరఁగ నమ్మహాగ్ని లోక
ములు దహింపఁ జొచ్చెఁ బురహరుఁ డది మాన్చె, సంతసిల్లె సకలజంతువులును.

వ. అప్పు డనిమిషమునిజనంబులు కృతకృత్యు లయి భూతనాథుం బ్రణుతించి యతం డనుమతి సేయ నంబుజాసనుండు లోనుగా నందఱు నిజస్థానంబులకుం జని రివ్విధంబున లోకహితార్థంబుగా నప్పరమేష్ఠి శివునకు సారథ్యం బనుష్ఠించె నీవు నట్ల పోలెఁ గౌరవరక్షణార్థంబుగా రాధేయురథంబు గడపు మిక్కర్ణునకు నక్కిరీటికిఁ గృష్ణునకుం బలశౌర్యంబుల నెక్కు డయినవాఁడవు మదీయజీవితంబును రాజ్యంబును భవదధీనంబులు వానిం గలిగింపను జయంబును సుఖంబును గావింపను నీవ యొడయుండ వికార్యం బాచరించి నన్ను రక్షింపు మని ప్రార్థించి నీపుత్త్రుండు

1. ఖ. నడతేర. 2. గ. దివిజరిపుయుతంబుగాఁ బురత్రయంబు నీఱై.

మద్రపతికి మఱియు నిట్లనియె. 294

సీ. ఇది యొక్కయితిహాస మే నొద్దనుండ ధర్మప్రవీణుం డగుబ్రాహ్మణుండు
ధృతరాష్ట్రవసుమతీపతికిఁ జెప్పినయది వినుము భార్గవవంశమునఁ బ్రసిద్ధుఁ
డగుజమదగ్నికి నత్యంతనిర్మలమతి రాముఁ డుదయించె నతనిచేయు
తపమున హరుఁడు ప్రత్యక్షమై నిలిచిన, నతఁడు దివ్యాస్త్రంబు లడుగుటయును
ఆ. నమ్మహాత్ముఁ డశుచు లైనవారల నవి, నిగ్రహించుఁ గాన నీవు పరమ
శుచివి గమ్ము నీకుఁ జొప్పడు నఖిలమహాస్త్రవీర్య మనియె నాదరమున.

వ. అనిన విని జామదగ్న్యుండు వినతుండై నాకెప్పుడు పాత్రత్వంబు గలిగె నప్పుడు
నీవ తలంచి దయసేయుదువుగాక నీకు శుశ్రూష సేయుచుండున ట్లుగాఁ బ్రసాదింప
వలయు నని విన్నవించిన విని కరుణాయత్తచిత్తుం డగుభవుం డవ్వరం బిచ్చిన న
మ్మహాత్ముండు [2]నియమనిష్ఠాపరుం డై పూజోపహారప్రముఖవిధానంబుల నద్దేవు
నారాధించుచుండ ననేకసంవత్సరంబులు సన నొక్కనాఁడు పరమేశ్వరుండు
ప్రసాదలసితాననుండై గౌరీదేవికి నతనిం జూపుచు. 296

క. రాముఁడు విమలవ్రతచర్యామహితుఁడు నాకు భక్తుఁ డని పలుమాఱుం
దా ముద్దు సేసి మృదువచనామృతసంసిక్తుఁ జేయు నాసమయమునన్. 297

వ. బలవంతు లగుదనుజులచేత బాధితు లయి బృందారకు లయ్యిందుధరుపాలికి
భయసంభ్రమంబులతో నరుగుదెంచి తమయలజడి యెఱిగించిన. 298

ఆ. జామదగ్న్యుఁ జూచి చయ్యనఁ జని దానవుల వధించి దేవతలకుఁ బ్రీతి
యాచరింపుమని యీశ్వరుఁడు దానికి మదిఁ బ్రమదముఁ బొంది కేలు మొగిచి యతఁడు.

క. అకృతాస్త్రుఁడ నగునాకుం, బ్రకటభుజాబలులు నస్త్రపారీణులు నై
సకలసురనికరసంబాధకు లగుదానవుల గెలువ దరమే యనుడున్. 300

తే. అంబికానాథుఁ డిట్లను నతనితోడఁ
దలఁపు నీడెన నిలిపెద దానఁ జేసి
పగఱ నిర్జింప నగుఁ బదంపడి మనోర
థంబు సిద్ధించు నరుగుము దడయ కనఘ. 301

చ. అనవుడు నట్ల కాక యని యాజమదగ్నిసుతుండు ధీరతం
జని సముదగ్రు లైనసురశత్రులఁ దీవ్రత[3]రాయుధోత్కరం
బున వధియించి వారిబలుపోటుల నొచ్చినమేనితోడ వ
చ్చినఁ బురవైరి నిర్వ్రణునిఁ జేసెఁ గరంబున నంటి యాతనిన్. 302

వ. ఇవ్విధంబునం[4]బ్రకృతిస్థశరీరుం గావించి భర్గుం డాభార్గవుపయిం బ్రీతిశీతలం
బగునాలోకనం బొలయ నాతని కిట్లనియె. 303

1. క. నప్పుడ నీతలంచినట్ల దయసేసెదవు గాక. 2. గ. యమనియమానుష్ఠానపరత్వంబు గలిగి పూజో. 3. గ. రాశుగోత్కరం. 4. క. బ్రదీప్తశరీ.

క. అనివర్తనమతిఁ గవయుఁగ, నని నీ దగుతనువు సునిశితాయుధములు [1]దాఁ
కిన నొవ్వదు శత్రులు పన్నిన నుడువుము గర్వ మడఁచి నిర్మలచరితా. 304

వ. కావున వరప్రతిగ్రహంబునకు నిదియ సమయంబు. 305

క. కొను మని దివ్యం బగున, స్త్రనికాయము శస్త్రచయముఁ దద్దయు నుదయు ని
చ్చిన నవి యాతఁడు సాష్టాంగనమస్కారంబు సేసి కైకొనియె నృపా. 306

వ. తదనంతరంబ లోకగురుం డగునాహరునిచేత ననుజ్ఞాతుండై యతండు నిజస్థానంబు నకుం జనియె నయ్యతిహాసప్రకారం బిట్టిది యివ్విధంబున వివిధదుష్కరసత్కర్మానుష్ఠానఫలంబులైవచ్చినసర్వదివ్యాస్త్రంబులు నారాముండు రాధేయునకుఁ బ్రీతచేతస్కుండై యొసంగె నట్టిమహాత్ములు హీనకులజాతుల నాదరింతురే యప్పుణ్యపురుషుండు గయికొనుటఁ గర్ణుం డుత్కృష్టయోనిజాతుం డనితలంచెద వదనవక్షోబాహుప్రముఖాంగకంబులు సూడ దేవకుమారుండుం బోలె నున్నవాఁడు ప్రకృతికాంత కుండలవజ్రకవచంబులతోడ నాదిత్యసన్నిభుం డగుకొడుకుం గాంచునే సింగంబు లేడి కెట్లు పుట్టు నితనికి సూతసంవర్ధితుం డైనకీడు దొడరె నింతియ కానోపు రుద్రశిష్యత్వంబున విశ్రుతుం డగుభార్గవరామునకుఁ బ్రియశిష్యుం డగునంగరాజు ననంగదమనుం బరిగ్రహించినవిరించి భంగిఁ బరిగ్రహించి నీవు సారథ్యం బాచరింపు మఖిలగుణంబులను సారథి రథికున కధికుండు గావలయు ననునీతి నీవు ప్రసన్నుండ వగుటం జేసి నాకు సిద్ధించె ననుటయు. 307

తే. గ్రుచ్చి మద్రవిభుండు నీకొడుకుఁ గౌఁగి
లించి ప్రియ మానసమునఁ దలిర్ప నృపకు
మార నీవు నాకొలఁది యి ట్లరయ నెఱుఁగు
దేని నిది లెస్స నీకోర్కి యేను దీర్తు. 308

వ. అని మఱియును. 309

శల్యుఁడు కర్ణునకు సారథ్యంబు సేయ నొడంబడుట.

క. వీనులకుం బలుకులు నేఁ, డైనను జెప్పుదు హితంబు లగుకార్యంబుల్
దానికి నోర్వఁగ వలయుం, గాని యలుక వలదు నీకుఁ గర్ణ రథిపా. 310

ఆ. అనినఁ గర్ణుఁ డిట్టు లను మద్రపతితోడ, హరున కజుఁడు నరున కచ్యుతుండుఁ
బోలె హితుఁడ వగుము బుద్ధిపరాక్రమ, శాలి నాకు నీవు సంగరమున. 311

వ. అనవుడు నట్ల కాక యని శల్యుండు వెండియు. 312

క. తగువార లాయలు దెగడుట, పొగడుట యగుపలుకుపొంతఁ బోవరు హితకా
ర్యగతులు సెప్పఁగ [2]దెగడుఁ, బొగడుదు నెపుడు నోర్వవలయు బుద్ధిగలిగినన్.

తే. శక్రుతేరైన నడపంగఁ జాలువాఁడ, [3]నుఱువు సెప్పుదు రథికు నేర్ప మెఱఁగ [4]నీను

1. జ. దాఁకిన నొవ్వ కుండఁ జేసెద, విను మానుషకర్మ మడఁచి విమలచరిత్రా. 2. క. దెగడఁగఁ, బొగడఁగ నెపు. 3 గ. నొఱవు; క. నొఱవు. 4 జ. నీక.

కృష్ణసారథ్యమునఁ దగు నక్రీడి గెలువఁ, దలఁచుమని కేను గఁతవుల ✽ దగు రథంబు.

చ. అన విని భూవిభుండు ప్రియ ✽ మారఁగఁ గర్ణునిఁ జూచి దేవకీ
తనయుఁడు మద్రనాథుఁడటు ✽ దక్కువ మాటలిఁకేల దలంప నీ
తని కెన రాఁడు భాగ్యమున ✽ సంబున సారథి యయ్యె నీవు నీ
యనఁ గొని సేవ్య పార్థునియుప్రహంకృతి మాన్పుము ధీరమానసా. 315

క. అని యతఁడు శల్యుఁ గనుఁగొని, వినతుండ్రై నీవు లావు ✽ వెరవును మెఱయం
దనుఁ గావ నంగపతి యుర్జనుఁ గెలవ జయించువాఁడు ✽ రూఢిగ ననుడున్.

వ. అట్లయ్యెడుం గాక యని పలికి మద్రేశ్వరుండు సారథ్యంబున కనురూపం బగు సన్నాహంబు వాటించినం బ్రీతుం డగుచు సూతనందనుండు దనసూతు నాలోకించి తగురథంబునకుం గల్పన యొనర్పు మని సత్వరంబుగాఁ బనిచిన వాఁడును రయంబున దృఢసుందరం బగుస్యందనంబు సుకల్పితంబు సేసి తెచ్చి దీవించి యిచ్చిన నయ్యరదంబుఁ బూజింపం బురోహితు నియమించి తదీయమంగళవిధానానంతరంబ తాను నర్చించి కృతప్రదక్షిణుం డై ప్రణమిల్లి భాస్కరోపస్థానం బాచరించి సవినయంబున శల్యు నారోహణంబు సేయు మనుటయు నతం డచలతటంబునకు లంఘించుసింగంబుచందంబున నొగ లెక్కిన. 317

ఆ. మెఱుఁగుతోడ లలిత ✽ మేఘంబు మూఁడక్కి, బోయి వెలుఁగు భానుఁ ✽ బోలువు దోఁప
మద్రరాజసహితుఁ ✽ డై యొప్ప నత్తేరు కర్ణుఁ డెక్కి ✽ తేజరిల్లె. 318

వ. అని యిట్లు కర్ణసారథ్యంబునకు శల్యుండు మొకొనుట సంజయుండు ధృతరాష్ట్రునకుం జెప్పె నని విని యటమీఁదివృత్తాంతం బెఱింగింపు మనుటయు. 319

చ. అవిరళదర్శనస్థిరముహామునిమానస[1] వాసఖేలనో
త్సవరసికా రసాత్మక నిరంతకృపాకరదివ్యచిత్త స
త్త్వవిభవసంభృతైక్యసుఖ తామయ దేహా నిరామయా పున
ర్భవపరిహార[2] హారిపద పద్మయుగ స్తవహృద్యసంస్తవా. 320

క. కమలవనసదృశదృగ్రుచి, సముదయశమితార్థిక్ర్య[3]సంఘా లక్ష్మీ
రమణత్వాశివా ప్రియతా, సమవా[4]యాలంబ్యమానసౌందర్యనిధీ. 321

మాలిని. అనుభవశమరమ్యా ✽ హంసభావైకగమ్యా
వినమదఘవిదారీ ✽ విశ్వలోకోపకారీ
దినకరశశినేత్రా ✽ [5]ధీపరస్పందచిత్రా
దనుజమథనలీలా ✽ ధర్మతత్త్వానుకూలా. 322

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజితిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున కర్ణపర్వంబునందుఁ బ్రథమాశ్వాసము. 323

---

1. గ. ఖేలనోజ్జ్వలోత్సవ. 2. గ. హారిపద. 3. గ. సుకృత్యలక్ష్మి. 4. క. యాలంబ్యమాన. 5. గ. ధీపరిష్వంగ



హరిహరనాథాయ నమః

# శ్రీమదాంధ్ర మహాభారతము

## కర్ణపర్వము, ద్వితీయాశ్వాసము.



నిష్పాదననిపుణకృ
పానిరతిశయార్ద్రభావ భావాతీతా
భానుసహస్రప్రభ ర
మ్యానంతవపుః ప్రకాశ హరిహరనాథా. 1

— శల్యుఁడు కర్ణునుత్సాహంబునకు విఘ్నకరంబు లగువాక్యంబులు సెప్పుట. —

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు దనసుతుండు సూతసుతుకోర్కి దీర్పం బూని యతిప్రయత్నంబు సేయుట యాకర్ణించి యాంబికేయుండు. 2

ఆ. ఎట్లు ప్రియ మొనర్చె నట్లు సంప్రార్థితుం, డైనమద్రనాథుఁ [1]డంతఁ గౌరి
తేరు గడప నతని తెచ్చికొన్నట్టి యు, వ్వీరుఁ డేమిభంగి విక్రమించె. 3

వ. అని యడిగిన సంజయుం డిట్లనియె నట్లు రథిసారథులు విలసిల్లి వందిమాగధప్రస్తూయమాను లగుచుఁ దనవలనను గౌరవంబునం గనుంగొనుటయుఁ గురురాజయ్యంగరాజు నుద్దేశించి. 4

చ. గురుఁడును భీష్ముఁడున్ నరునకున్ బకవైరికి నగ్గలంబు వీ
రిరువురు వారి నిద్దఱ నహీనపరాక్రమలీల గీటడం
తురు ధ్రువ మంచు నాత్మఁ బరితోషముఁ బొందుదు నట్లు [2]గాక ని
ర్భరబలశౌర్యముల్ మెఱయ గ్రక్కున నావని నిర్వహింపుమీ. 5

తే. బాహుదల నొండెఁ బట్టుము పాండుతనయ
ముఖ్యు వీరు వారన నేల మునుము వట్టి
వైరివర్గంబు నెల్లను బారి నమరి
సైన్యయుతముగ నద్భుతజయము గొనుము. 6

1. శ. నంత గౌరి తేరు నడప. 2. గ. గాఢ నిర్భర.

వ. నడవు మనుటయు నమ్మాటఁ గైకొని కర్ణుండు శల్యునిం జేసి నడవు మనిన నతం
డట్లు చేసె నప్పుడు శంఖభేరీప్రముఖతూర్యనాదంబులు రోదసీగహ్వరంబు విహ్వా
లంబు గావించె నిర్ఘోషంబునం జని చని గర్వాగ్రహావిధేయుం డగురాధేయుం
డమ్మద్రపతి కిట్లనియె. 7

శా. నారాచాదిమహోగ్రబాణపటలీనానావిధోల్లాసముల్
సైరింపన్ ధృతి లేక పాండుతనయుల్ సంభ్రాంతి నొందంగ వి
స్మేరంబై ఖచరవ్రజంబు పొగడన్ మెచ్చంగ నీ చూడ్కి దు
ర్వారోదగ్రత నేఁడు సూపెద భుజాగ్రవష్టంభసంరంభినై. 8

సీ. అన విని మద్రరాజాతని కిట్లను, సత్యపరాక్రముల్ శౌర్యఘనులు
భుజవీర్యమహితులు భూరితేజోధను, లఖిలాస్త్రవిత్తము లాహ్వ లమర
పతికైన రణమున భయము పుట్టింపంగ, నోపుదు రప్పాండుభూపతనయు
లేల వారల నింత దూలఁబోఁ బలికెద, విప్పుడు పల్కరా దెట్లు నీకు

తే. గాండివజ్యానినాదమ్ము గ్రమ్మి కర్ణ
విదళనము సేసినను భీముగదమెఱుంగు
లోలసి చూడ్కులు మిఱుమిట్లు గొలిపినను భ
యంబు పెల్లున నపుడు వాయడఁగుఁ గాక. 9

వ. అని వెండియు. 10

చ. నరునిశరంబులన్ రథగణంబులు గూలఁగ భీముసుల్లన
త్పరిఘమునన్ గజవ్రజము భగ్నము గాఁ బెఱితమ్ములన్ యుధి
ష్ఠిరుఁడును దాఁకినం జలము డించి దొరల్ గలఁగంగఁ జూచియుం
దిర మయి నీవు నాలుకకుఁ దెచ్చినమాట గదా వినం దగున్. 11

క. అనుపలుకులు వినియుం దా, విననిచెవులు సేసి మద్రవిభుతో రాధా
[1]తనయుఁడు నాచేతిబలువు, గనుఁగొనియెద విపుడ యని యొగ్గం డమరంగన్. 12

వ. ఇట్లు సంగరోత్సాహదీప్తుండై నడతెంచు నతని నుపలక్షించి. 13

చ. కురుబల ముబ్బి యార్చెఁ బటుఘోటకహేషితనిస్వనంబులుం
గరివరబృంహితధ్వనులు గాఢము లై విలసిల్లె నెత్తురుల్
గురిసె నభంబు మ్రోయఁ బిడుగుల్ మొరసెం బొరి నుల్క లెల్లెడం
దొరఁగెఁ బ్రదీప్తమారుతము ధూళిఁ గడున్ వడిఁ జల్లె భూవరా. 14

వ. మఱియు బహువిధోత్పాతంబులు గౌరవులకు నాశం బగుటం దెలుపుచుం దోఁచె
దోఁచిన నవి యెల్ల నరకుగొనక వారు దైవమోహితులు గావున శల్యసహితుం
డైనకర్ణుం గనుంగొని కుంతీనందను లతనిచే నిర్జింపఁబడుదుర కాఁ దలంచి

1. గ. తనయుండు మాట లేటికిఁ.

సంతోషించి అతండు భీష్మద్రోణులదోర్వీర్యంబులు పాండుతనయులచేతం గోలుపోయె నని మనంబున వారల మెచ్చక ముంగలిదై మెఱసి నడచు చుండి పార్థపరాక్రమస్మరణంబునం గ్రోధంబు జనియించి యూర్పులు సందడింప మానదర్పోన్మాదంబున మద్రపతి కి ట్లనియె. 15

మ. అరదం బెక్కి శరాసనంబు గొని తేం పారంగ నే నేచి సం
గరసంక్రీడకుం జొచ్చినం దృణసముం గాం గొందు నద్దేవతా
వరు నైనన్ గురు నాపగాతనయుం జావం జూచుటన్ వైరు[1]లే
తురు చెండాడెద నుగ్రతం దలలు నాదోర్దర్పముం జూడుమీ. 16

వ. అని పలికి యనంతరంబ గాంగేయకుంభసంభవులంతటిమానుసులు నిట్లు రిత్త సావు సత్తురే యని యుగ్గడించి మఱియు ని ట్లనియె. 17

ఉ. వారల లోకవీరుల నసవధ్యుల గీటడంగించి పల్వురన్
వారలయట్ల యెందు ననివార్యు లనం జను మేదినీశులం
బోర వధించి రౌద్రమునం బొంగి క్రమాగతమృత్యువో యనం
గా రణకేళికిం గడంగు గాండివి నేన యెదిర్చి యోర్చెదన్. 18

ఉ. పాండునృపాగ్రనందనుడుం బావనియుం గవలుం జలంబునన్
నొండొరు మూదలించుకొని యొక్కట డాకినం దీవ్రవిస్ఫుర
త్కాండవిదారితాంగకులం గా నొనరించి యులంచి లీలనై
కం డడంగింతుం బోర పెనంగం గలచండ మెఱింగి చెండుదున్. 19

వ. [2]అని వెండియు నిట్లను భీష్ముండు డెగినను ద్రోణుదోర్వ్యాలంబునాసగలిగియుండె.

సీ. ద్రోణుండు బహుదివ్యశస్త్రబాణదీప్తుండు భుజాబలశాలి శౌర్యసంపన్నహృదయుం
డక్షీణవిక్రముం డతిరథశ్రేష్ఠుండ, వీరుండు పార్థుచేం బోరం బడిన
ధార్తరాష్ట్రులయేవు దఱిగెం దదాప్తసైనికులు గండడంగిరి నీ వెఱుంగ
నైనను రాముకృపాతిశయంబునం, గనినయీరథమును గార్ముకాది

ఆ. దారుణాస్త్రశస్త్రతతులును గలిమి నే, నతనిం దొడరి దివిజు లడ్డపడినం
గూల్తు నెల్లభంగిం గురురాజుమన్నన, యుప్పవీర్తుం బ్రాణ మూసవడక. 21

—శల్యుండు కర్ణునిపరాక్రమం బుగ్గడించి కర్ణునిం దూలం బలుకుట.—

వ. అనిన విని శల్యుండు కర్ణున కి ట్లనియె. 22

చ. వినినజనంబు లీతం డవివేకి యనన్ వల దింతరజ్జుల
ర్జునుబలశౌర్యసంపదలు నూచి యెఱుంగవె మున్నునిన్ను నా
తనిం గలనన్ జగం బెఱుంగదా యతం డద్భుతవిక్రమోజ్జ్వలుం
డనయుడె నీవుపౌరుషవిహీనుండ వద్దివిజేంద్రనందనున్. 23

1. గ. లేతురు. 2. అ. క. అని పలికి వెండియును నిట్లను భీష్ముండు దెగిన ద్రోణుం డతులిత దివ్యాస్త్రనిచయము దోర్బలాన్వయంబును జాలం గలిగి యుండె భూపాల వినుము.

సీ. రాత్రిప్పైఁ దాఁకి క్రూరతఁ బోరి మగఁటిమి, వాసినయంగారపర్ణుకంటె
ఘోషయాత్రావిధిఁ । గురురాజుఁ జెఱవట్టి, మాన మేదినచిత్రసేనుకంటె
ఖాండవోద్యానంబుఁ । గావ నేరక సిగ్గు, వడి చన్ననిర్జరప్రభునికంటెఁ
గ్రీడాకిరాతుఁడై । క్రోడంబునకుఁ గాఁగఁ, బెనఁగి చిక్కిన త్రిలోచనునికంటె
ఆ. నెక్కుడైనవీరుఁ డే నర్జునునితోడఁ, బొడుతు నోడుతు ననినఁ । బోలుఁ గాక
వినుము సూతతనయ । మనబోఁటు లాతని, జెఱుతు మనుట నోరిచేటుగాదె.

చ. నృపుఁడును భీష్ముఁడుం గృపుఁడు । నీవ్వ గురుండును దత్సుతుండు ను
గ్రపుబల మేచి తో నడవఁగాఁ [1]బెనుదాడిగఁ బోయి మత్స్యనా
థుపసులఁ బట్టి యుద్ధారలతోఁ జెడి పాఱితి కర్ణ యుష్మ ।
య్యపుబలు పాడె [2]దర్ప మనయర్జునసమ్మలు దుష్టవర్తనే. 25

ఉ. ముందరియట్లు గాదు జనమూల్ దెగడ౯ వెఱఁబాఱ నేఁడు సం
క్రందననూతి మార్కొని త్వరం బయి పోరెద దాఁపఁ బ్రాణముల్
విందకుఁ జాల నింక ననునిక్కపుఁబల్కులు పల్కు టొప్పు దా
నం దుదిఁ జచ్చినం జను మొనర౯ నరుఁ దాకుఁట రిత్తవోవునే. 26

వ. అనవుడు నలుక వొడమిన నడంచికొని రాధేయుండు మద్రపతి కిట్లనియె. 27

చ. నరునకుఁ బూని పల్కితి విసనం బవి మాలినదొడ్డపల్కులే
[3]నరగలి లేక పెట్టడరినప్పుడు నూడుము నన్ను నాతనిం
దిర మయి బాహుశక్తియును । ధీరతయు౯ వెరవుం బలంబు నె
వ్వరిదెసఁ గాంచె డెక్కుడుగ । వారి నుతింపుము మానుమంతకున్. 28

వ. అనుటయు నట్ల చేసెద నని పలికి శల్యుం డూర కుండెఁ దేరు వోనిమ్మని
రాధేయుండు దతిమి పలికిన నమ్మద్రేశ్వరుండును దురంగంబుల సత్వరంబుగా
నడపె నివ్విధంబునం జని మనమొన సొచ్చి సైనికులు సంతసిల్ల వారలం
గలయం గనుంగొని కర్ణుం డిట్లనియె. 29

సీ. వలను శోభిల్ల నెవ్వాఁడైన వీఁడె యర్జునుఁ డని నాకిప్డు । సూపెనేనిఁ
బనదనం బే నిచ్చుభంగి యుండలెకును, వివరించి చెప్పెద । వినుడు మీరు
పొగడంగఁ దగురథ్యములతోడిసౌవర్ణ,రథములు వలసిన । రయము లావుఁ
బొలుపును గలుగుకాంభోజహయంబుల, వలసినఁ[4] బేర్చుసత్త్వంబునందుఁ
తే. బరిణతము లగుసుందరకరివరముల, వలసినను జారులావణ్యవతుల వలసి
నను మహాగ్రామములు వలసినను గోర్కి, కెక్కుడమ్మేటిమగని కేనిచ్చువాఁడ.

క. మఱి యొక్కటి సెప్పెద నిద్దఱు కృష్ణులఁ జంపి వారిధనములు నా కి
త్తఱిఁ దద్రథ మిదియే యని, యెఱిఁగించినయతని కిత్తు । నేనుముదమునన్.

వ. అని పలికి శంఖంబొత్తిన దుర్యోధనుం డనుజసహితంబుగాఁ బ్రమోదంబునొంద

1. గ. వెస దాడిగా: 2. గ. దీప్త 3. ఖ. నరవంటు లేక. 4. క. చ. జ. బెక్కుక్రతంబులందు.

నప్పుడు నిస్సాణాదితూర్యనిస్వనంబులు దిక్కులం బిక్కటిల్లె మనయోధవరులును
వరూథినియు నుబ్బునం బేర్చి యార్చిననినదంబులు నింగి ముట్టె నయ్యెడం బ్రహాస
భాసురముఖుం డై మద్రవిభుండు రాధేయున కిట్లనియె. 32

ఉ. ఎవ్వరు నూప నేల నరు । నిప్పుడ కాంచెదు రిత్తవారికిం
గ్రొవ్వున నుజ్జ్వలార్థములు । గొం డని యీ వల దిట్టు లిచ్చినన్
నవ్వు జనంబు మిక్కిలి ధనంబులు గల్గినఁ జేయ రాదె నీ
కవ్విధి నైన సద్వ్యయము । [1]లెందు నపాత్రపుటీవి యొప్పునే. 33

వ. అని యంత నిలువక. 34

క. కొలఁది యెఱుంగక కృష్ణులఁ, గలన గెలుతు ననియె దీవు । గంటిమె సింగం
బుల నెత్తఱి నైనను [2]నే,పొలమున నేనియును నక్క । పోరి గెలువఁగన్. 35

ఉ. అగ్గి సొరం దలంచునటు । లర్జును నెక్కటి దాఁకఁ గోర్కి నీ
కెగ్గిది మాను [3]మీపలుకు । లెవ్వరుఁ జెప్పఁగ లేరు రూపఱ
న్నగ్గఁగఁ గాల మయ్యెనొకొ । నావచనంబు లొకింత కర్ణ యు
ల్లగ్గఱ నిచ్చి యోధులు బలంబులుఁ దోడు గఁ బోరు [4]టొప్పగున్. 36

ఆ. ఏను ధార్తరాష్ట్రహిత మాచరించుట,కై పెనంగి చెవుల । కప్రియంబు
లైన నిన్నిమాట । లాడితి నాబుద్ధి, విని దురాగ్రహంబు । విడువ వలయు. 37

చ. అనవుడు నగ్గి సూతసుతుఁ । డాతని కిట్లను మద్బలంబు న
మ్మిన నను నిత్తెఱంగునకు । మేకొన కుండఁగ మాన్ప వజ్రహ
స్తునకు వశంబు గా దనినఁ । జొప్పడునే నినుబోఁటి [5]కాప్తిఁ జె
ప్పిన క్రియఁ జెప్పి నీవు వెఱపించిన నే వెఱ పెక్కువాఁడనే. 38

వ. అనుటయు నతని నగ్గలంబు కోపింపం జేయుటకై శల్యుండు మఱియు నిట్లనియె.

తే. ఇప్పుడే నీకు బుద్ధులు । సెప్ప నేల, నరుఁడు గాండీవగుణనిక్వణంబు సెలఁగఁ
గదిసినీమెయి బలుతూపుగములనిగుడఁ, జేసి నిను బుద్ధిమంతునిఁ । జేయుఁగాక.

వ. అని యంతం దనివోక యతండు. 41

సీ. రోషమహాటోపభీషణహరితోడ, సమరంబునకు హరిణము గడంగి
దానధారాభీలదంతావళముతోడ, సంగ్రామమునకు శశంబు గడఁగి
చండస్వభావోగ్రపుండరీకముతోడఁ, నాజికి సారమేయంబు గడఁగి
దారుణతుండాతిఘోరగృధ్రముతోడఁ, గలహంబునకు నురగంబు గడఁగి

ఆ. యడరునట్లు గాదె । యస్త్రకౌశలము,జ్జ్వలుఁడు పార్థుతోడ । సంగరమున
కీవు గడఁగి యడరు । టెల్ల రాధేయ నీ, కేటిబలము నమ్మి । నెమ్మిఁ గలదు. 43

1. లింతయపాత్రపుటీవి, ఆ. ప్ర. 2. క. బెబ్బులిసేయము నెపరి నక్కంబోరు గెలువఁగన్.
3. ఆ. మన్నలుకు. 4. క. పొంప్పగన్_గ. పెంప్పగున్. 5. అ. కావ్రు చెప్పిన.

గా నెందుఁ దిరుగుదుము ద,వ్వైనను ఖేదంబు లేదు । హంసల మగుటన్. 58

వ. ఇట్టివిహాయమందును. 59

క. బలశాలి యైనహంసముఁ, బలిచితి పురుడించి పాఱ । [1]బేలతనమునన్
కలకే యింతకు మును హం,సలతోఁ బురుడించువాయసంబులు జగతిన్. 60

సీ. అనుటయుఁ గాక మి । ట్లను హంసములతోడ, గతులునూటొక్కటిగలవు నాన
నొక్కటొక్కట శతయోజనవ్యాప్తి నే, మెఱయుదుఁ బొడవుగామీఁది కెగసి
చనుట యచ్చటనుండి । చక్క నేలకుఁ జోడు, వట్టి డిగ్గుట సూరపాతభంగి
సంగతి వరువడి । చాలులీలాగతి, వక్రయానము వలయక్రమంబు

ఆ. లోను గాఁగ నెట్టు । లైనను మీకోరిన,ట్ల పఱచి మేటియంచ లైన
దాని నివుడ గెలుతుఁ । దక్కటియంచలు, భయముఁబొందఁ గాకపడుచుఁబొంగ.

— కాకము హంసముతో సముద్రముమీఁదఁ బఱచి భంగపడుట. —

వ. అనుటయు విని మున్నామహాతం బైనహంసం బక్కాకంబు నాలోకించి. 62

ఆ. నూఱుగతుల నీవు । వాఱు దే నన్నియు, నెఱుఁగఁ బలుఁగు లెల్ల నెట్లు వాఱు
నడరి యాకసమున । [3]నిడుబాట నట్ల పా,ఱుదును రమ్ము జలధిచదల ననిన. 63

వ. అయ్యెడం గూడినకాకంబు లపహసించి శతప్రకారగతి యగుదీనితో నేకయాన పర్యవసానహీనసముత్సాహదోహలి వగునీ వెట్లు మచ్చరించెదవు పఱచి భంగపడియెదవు గాక యనుటయు నమ్మరాళం బొకమిం బాసి పఱవఁ దొడంగినం దోన యవ్వాయసంబునుం బఱచె నిట్లు రెండును మున్నీటిపై మిన్ను దఱిసి పాఱునట్టియెడ. 64

క. రాయంచ మందగతిఁ జను, వాయస మతితీవ్రభంగి । వలను మెఱసి లీ
[4]లాయితము లొప్పబహుగమ, నాయాసము నొంది పఱచు । నగ్గలికమెయిన్.

ఆ. ఎలమిఁ గడచి పోవుఁ । బిలుచుఁ గ్రమ్మఱ వచ్చి
ముక్కు ముక్కుమీఁద । మోపుఁ జుట్టు
నేచి తిరుగు నీఁక । లీఁకలతో రాయఁ
నొరయుఁ జిత్రగతుల । మురియు నవ్వ. 66

వ. ఇవ్విధంబునం గాకం బనేకప్రకారప్రసరణచతురం బై సంచరించుటం జూచి ముదితంబు లైనవాయసంబు లధికస్వరంబుల మెఱయుచు హంసంబుల గేలి గొని నవ్వుచుఁ దరువులపయిం ద్రుళ్లి త్రుళ్లి యాడుచు మరాళంబు పరాభవంబుఁ బొందెడుఁ జూడుం డని పెద్దయెలుంగున బలుకుచుండఁ దదీయకలకలంబాలించి హంసంబు భరితోత్సాహం బై. 67

క. పొడవునకు నెగసి యొప్పటి, పడమటి దెస నిగిడి పెలుచఁ । బఱచినఁ గూడం

---

1. క. గ. చ. జ. బేలుదనమునన్. 2. క. చ. సంగడిఁ బరువిడిఁ 3. క. గ. చ. నిడు బాఱు – జ. నిడుబాఱు. 4. క. లాయితము లొప్ప.

గడురయమునఁ జని యంచం, [1]గడవం గా[2]కీలకఱచి కాకము పాఱున్. 68

వ. పాటి పాటి డయ్యాటయు నయ్యంచ యుదంచితత్వరితగమనకళావైదగ్ధ్యంబు మెఱయం బఱచిన [3]బీఱువడి కాకం బాకులాంతరంగంబును వికలాంగంబును నై యి ట్లని వితర్కించు. 69

క. నేరక తొడరితిఁ గాల్కొన, భూరుహములు లతలు గిరులుఁ బొడ లేమియు లే
వారయ బహుసత్త్వమయము, వారిధి డిగిపోఁకినవుడ వలయుం బొలియన్.

వ. అనుచు దీనమానసం బయి భయంబునం గలంగి డప్పి సొగసి యవశత నంత కంతకు డిగుచు చున్నయక్కాకిం గనుంగొని కలహంసం బి ట్లనియె. 71

ఆ. నీ వనేకగతులు నేర్తిది యేగతిఁ, జనుట చెపుమ వాయసంబ యేను
గడవ నరిగి పిలువఁ గా నేల తడసెద, వెఱక లేటి కిట్టు లెడల విడువ. 72

వ. అనియె నట్టియెడ. 73

క. తలకొని జలములు పక్షంబులు దుండము దోఁక సోఁక బొరిఁబొరి నెగయ
బల మఱి మెయిదిగఁబడఁగా,సొలసి యెగయలేక వాయసుఁడు వెగడొందెన్.

వ. ఇట్లు మున్మిటినీటివయిం బడి [4]నగ్గలం బగుదురవస్థకు బెగ్గలంబు నొందుకాకంబు నాలోకించి పలుక నగుం గాక పలికినట్లు యెవ్వరికిఁ జేయఁ దీఱుఁ బని తీరెం గదా యనిన రాయంచకు నక్కాకం బి ట్లనియె. 75

క. ఎంగిళులు గుడిచి క్రొవ్వునఁ, బొంగినమెయితోడ గర్వమునఁ దిరుగుచు నా
కుం గలదె యెందునెదురు వి,హంగమపతినైన గెలుతు నని మును దలఁతున్.

క. నాకొలఁది యిప్పు డెఱిఁగితి, నీకరుణాలోకనంబు నిగిడించి శర
ణ్యా కావు నన్ను మగుడం, గాకులలోఁ గలుపఁ [5]దగవు గాదే నీకున్. 77

వ. అని యిత్తెఱంగున. 78

క. ఆకులతఁ బొంది పలుకుచుఁ, గా కా యని చంచు [6]దెఱప గా నఱచుచు నీ
రాకరమున మునిఁగెడున, క్కాకిం గలహంస పరమకారుణ్యమునన్. 79

క. వెరవునఁ దత్తనువుం దన,చరణంబుల నిఱికి యెత్తి చా వుడిపి బల
స్ఫురణంబు మెఱయ వీఁపున, ధరియించుచు వచ్చెఁ బక్షతతులు నుతింపన్.

వ. ఇవ్విధంబునం దెచ్చి మొప్పటినెలవున డించి రాయంచ యక్కాకి దెప్పిఱిన దానితో నచ్చటికాకులు విన నింక నిట్టియవినయంబు లెన్నండును జేయకు మని పలికి నిజసహచరంబు లగుమరాళంబులుం దానును వలయుచోటికిం జనియె నీవు నాకొమటికొడుకులయెంగిలికూటం బెరిఁగినయక్కాకంబుచందంబునఁ గురుకుమారులయెంగిళులు గుడిచి క్రొవ్వి యెక్కుడువారల ధిక్కరించెదవు నీకొలఁది యెఱుంగవు దీనం జేటు వాటిల్లుఁగాన తేటపడ నెఱింగించెద నాకర్ణింపుము 81

1. క. గడవఁగఁ జనుకినుక నేచి. 2, క. గ. చ. జ. 'కీలుకఱచి'. 3. గ. బిఱు వడి_ఆ. బరువిడి
4. గ. యగ్గలం బగుదురవస్థకు బెగ్గడిలునక్కాకంబు. 5. క. దరము గాదే, 6. గ. తెఱవఁగా నఱచుచు,

చ. విరటునిగోవులన్ మరల విడిపించు మదంబున నీమహత్వమున్గని
బోదిగొనంగ బోరఁ బారి క్రీటి పోవఁటి నాఁడు ఘోషయాత్రలోఁ
సురపతి డించి క్రీడి కృపసంగదపాత్రము సేసి యొక్కఁడున్
సురిఁగితి చెప్పుమా నిజము సూతతనూభవ నాకు నేర్పడన్. 82

వ. అని వెండియు. 83

చ. వనిపడి జామదగ్న్యుఁడు సమర్థత విడిపించెడి మాకు నెల్ల న
ర్జునభుజవైభవంబు మధుసూదను పెంపును నాఁడ ద్రోణశాం
తనవులుఁ జెప్పరే బహువిధంబుల వారల గెల్వ రామి [1]మున్
వినవొ యెఱింగియున్ గఱువలా నీకుఁ [2]గ్రొంతుల కేలకు నేటికిన్. 84

క. ఒంటిమెయిఁ బోక నాముక్రిఁ గంటికి నరముకు నవిష్ణుగాండీవుల ని
ట్లంట యుడిగి తగురథికుల, జంటగొని రణమ్ము నడుపు శత్రులు నలఁకన్. 85

తే. గొంతికొడుకును దేవకీకొడుకు మనము
గనియెదము దినకరనిశాకరులఁ బోలె
వెలుఁగ నయ్యెడ ఖద్యోతవిలసితంబు
తోడి దగుఁ గాక నీపెంపు దోఁపఁ గలదె. 86

వ. అనిన విని కర్ణుండు గమలనాభునిపెంపును బాహుబలిమియు నెఱుంగక యే నేల
వారిఁ దొడరెద నెట్లు నెప్పినను దొడరుదుఁ దొడరి నా రెండె నేనొండె నగుదు
నింకియు నీవు వచమాట లాడక యుండుగు మని పలికి యచ్చటిమహీపతులు విన
నమ్మద్రపతి కిట్లనియె. 87

— కర్ణుఁడు శల్యునితోఁ దనకుఁ గలిగినశాపంబు తెఱంగు సెప్పుట. —

సీ. తలఁచిన నెదకు సంతాపంబుఁ జేయుంగఁ, జాలెమనట్టిని జామదగ్న్య
కోపంబు బ్రాహ్మణశాపంబుఁ గాక యే, సరకు గొందునె మురహరుఁ గిరీటిఁ
జెప్పెద వినుమ మత్రశిక్షార్థినై మహేంద్రనగంబునకు జమదగ్నిసుతునిఁ
గోరిపోయినఁ గృపాంభోరాశి యగునమ్మహామునిగులము నడిగుటయును

తే. బొంకునకు నోర్చి బ్రహ్మాస్త్రమునకుఁ గాఁగ
బ్రాహ్మణుఁడ నని చెప్పి తత్పాదభక్తి
గలిగి మెలఁగంగ శిక్షించె నలఘుబహువి
ధాస్త్రశస్త్రసంవేదిఁ గా నతఁడు నన్ను. 88

వ. భార్గవాభిధానం బగుమహాస్త్రంబులోనుగా ననేకదివ్యాస్త్రంబు లిచ్చెఁ బదంపడి
బ్రాహ్మం బగునస్త్రంబు నొసంగె నొసంగి సమరంబున నాపత్సమయంబున దీనిం
బ్రయోగింపుమని యానతిచ్చె మఱునాఁడ తత్తపోధనసత్తముండు మదీయాంకతలం

1. క. మి, వినమి యెఱుంగుదున్. గ. మి, వినమి యెఱుంగుచున్, 2. క. గ. చ. మాటలు బుద్ధిఁ జెప్పెదవ్ - జ. చెప్పుచున్.

కృష్ణార్జునులకు నే నెఱిఁగిన నింద్రయమవరుణకుబేరులు వజ్రదండపాశగదాహస్తులై
చెట్టు ముట్టినను బెదర నని యిట్టిమహాదక్షిణవాతిం జెప్పనేల యిప్పుడు బ్రహ్మా
స్త్రమునుం దోఁచుచున్నది యున్నారుని యున్నాఁడవు మనరథంబు సహపురుషు పుడమి
జనంబులు మదీయకోదండపాండిత్యం బొండొరులకుం జెప్పికొని యచ్చెరు వందు
చుండు నట్లు సేసెద నమ్మాటమగని ఋష్యూనివాసంబు నొందించెద. 94

సీ. కాండమహోత్తరంగములు వైరుల ముంచుచు, విజయాంబురాశికి వేల నగుదు
బాణరత్నములఁ బరిపంథులఁ జొదివెదు, నర్జునాకృత్యాన కళ్ళి యగుదు
విశిఖోగ్రశిఖల విపక్షపక్షుల నేర్చు కిరీటి,ఘోరదావాగ్నికాసార మగుదుఁ
బ్రదరవేగమున నరాతులఁ గూల్చు పా,ర్థాతివాయువునకు నచల మగుదు

తే. విల్లు పట్టెడువారికి నెల్ల నెక్కుఁ, డనఁగ నెగడినగాండీవి నాహవమునఁ
దొడరఁ బ్రాణంబులకు నాసపడుల ఘుప్ర,కారులకు వచ్చునే నాకుఁ గాక శల్య.

వ. అనిపలికిన విని యమ్మద్రపతి వీని యంతరంగంబు గలంగం దా నర్జునుచేతం జచ్చుట
నిర్ణయించె నెట్లనిన నిట్టియుప్పొంగు జములు దనమీఁదం జాలమి వెట్ట కుండుటకుం
గాదె జామదగ్న్యబ్రాహ్మణులశాపంబులు భూపాలుకు విన నుగ్గడించె నిక్కలంక
యే నీరజులానికి నర్జునుగుణవిశేషంబు లెఱింగించి మదంబడంచిన కతంబునం గలి
గెఁ గౌంతేయాగ్రజునకు నా యిచ్చినవరంబు సఫలం బయ్యె నని మనంబునం
దలంచె మనుజేశ్వర విను మాశల్యుండు సెప్పినయాఖ్యానంబునం జిత్తం బెరియు
చునికింజేసి యాసూతనందనుం డతనితో మఱియు నిట్లనియె. 96

—కర్ణుఁడు హంసకాకీయోపాఖ్యానము విని కోపించి శల్యుని దూఱుట.—

క. దృష్టాంతము సెప్పెద నని, కష్టాత్మా నీవు నన్నుఁ గాకము నను న
త్యుత్కృష్టమరాళము గాఁగ ని,కృష్టపుఁగథఁ జెప్పి తిది సఖిత్వము తెఱఁగే. 97

ఆ. నీచులకు బలంబు నెట్టన వరుసని, కాఱు లఱచు చున్కి గాన యిట్లు
వలికి తింతఁ జేసి భయ మయ్యెనే నాకు, నట్టిమాట లింక నాడ కుడుగు. 98

క. అడిగితినే నిను నాక,వ్వడిభుజబల మెట్టి దని యకారణ నీ వి
ప్పుడు నృపు లెల్లను విన వా, విడిచి పొగడె దిట్లు వందివిధమున నతనిన్. 99

చ. అనిమొన శత్రులం బొగడు టారయ మూర్ఖత గాదె యిట్టిమ
ర్జనుని సహింతురే పెలుచఁ జావక సైరణ సేయు కాల మై
నినుఁ దెగఁ జూడ నైతి ధరణీపతి కయ్యముపై భరంబునం
గొనకొని సూతకృత్యమునకుం దగఁ బంచినవాఁడు గావునన్. 100

వ. అని వెండియు. 101

తే. అకుటిలుం డగునాకు నత్యంతకుటిల
వృత్తి సహితంబు సేసెద వి త్తెఱంగు

మిత్త్రివంచన మూరయ మైత్త్రి నప్త
పదకృతోద్భాతి యని యెఱుఁగ పలుకు వినవె. 102

క. జను లెట్టిది మిత్త్రవిధం, బని చెప్పుదు రట్టిచంద మఖిలము దుర్యో
ధనునందుఁ గలదు నాయెడ, మన మూఱడి యుండు నాకతమం ద్రప్రీతిన్. 103

క. జను లెట్టిది శత్త్రువిధం, బని చెప్పుదు రట్టిచంద మారయుఁగా దు
ర్జనుఁడ వగునీకు నాయెడ, వినుము కలిగె దీన మనసు విచ్చిం గుటిలా. 104

ఉ. కావున నీకు నప్రియముఁ గౌరవరాజునకుం బ్రియంబునుం
గా విధి మెచ్చ బాహుబలగర్వ మఖర్వము గాఁగ లక్ష్మికిం
జేవయుఁ గీర్తి కున్నతవిజృంభణముం గలుగంగ ముకుందగాం
డీవులఁ దాఁకి గెల్చెదఁ గడిందిమగంటిమి యుల్లసిల్లఁగన్. 105

వ. అని పలికి మఱియును. 106

తే. ఖండనంబునఁ బార్థుచేఁ బడక [1]నేఁడు, మేలుచే యైతినేనియు మృత్యువునకు
నెన్నఁడును నగపడ నాకు నివ్విధంబు, నందియము లేక చిత్తంబునందుఁ దోఁచె.

చ. వినుతమహాస్త్రముల్ వఱపి విక్రమసంపద నాకుఁ జూపున
ర్జునుభుజలీల గోర్చెద వసుంధరఁ జక్రము గ్రుంగి నారథం
బునకు నవార్యమై యెడరు పుట్టక తక్కిన శల్య చూచుమీ
నను విశిఖావలీవిలసనంబున నాతని యేపు మాపెదన్. 108

వ. నీకు వెఱపింప నయ్యెడు కొలందివారిని వెఱపింపుము కర్ణుండు విక్రమంబునకుం
గీర్తికి నాస్పదం బగుటకు జనియించినవాఁడు గాని భయంబు గొనుటకుం గాదు
కురుపతిసన్నిధి నీవు సారథ్యంబునకుం బూను చుండి పలికి కొన్నబాసకతంబున
బ్రదికిపోయి తనిన విని శల్యుండియనర్గళప్రలాపంబులం బ్రయోజనం బేమి వినుము
కర్ణ కర్ణులు వేవురైనం గిరీటిని గెలువం జాలుదురే యనుటయు నితండు గినుక
[2]నెఱ్ఱనైన కన్నుంగవతోడి నవ్వు నవ్వుచు నిట్లను ధృతరాష్ట్రుసన్నిధి నుత్తమద్వి
జులగోష్ఠి సకలదేశాచారవిదుం డైనవృద్ధబ్రాహ్మణుండు చెప్పవింటి బాహ్లీకదేశం
బునవారు గోమాంసంబు నంజికొని మద్యపానంబు సేసి నగ్నులై యసంగతదురా
లాపంబులతోఁ దిరుగుదు రని తొడంగి యనేకప్రకారంబుల బాహ్లీకదేశనిందోప
న్యాసంబు సేసె నట్టిబాహ్లీకుల కొడయుండవు తత్కృతంబు లగుపుణ్యపాపంబుల
నాఱవపాలు నిన్నుం జేరు నట్లుంగాక వారియనాచారంబులు వారింపమిం జేసి యా
కల్మషంబు లెల్లను నిన్నుం బొందు బాహ్లీకులకంటె మద్రదేశజాతు లవినీతు లని
యార్యులు చెప్పుదురు నిన్నేమి చెప్పం గల దింతవట్టు నెఱింగి నాలుకయడంచి
యుండు మనవుడు నమ్మద్రేశ్వరుండు. 109

క. లావులు [3]రథాతిరథసం, ఖ్యావేశం దెలియఁ జెప్పెఁ గాదే భీష్ముం

1. క. నేను. 2. ఆ. నెఱ్ఱ నైనకన్నుంగవతో నవ్వుచు. 3. ఆ. రథ్యాతిరథసంఖ్యా.

డావచనమ్ములు మనమున, భావింపుము క్రోధ మేల । బలియుఁడ నీకున్. 110

తే. విడుతు రాప్తుల బంధుల । వెలలు గన్న, నమ్ముదురు కులకాంతల । నంగదేశ
జనితు లగువారు విభుఁడ వర్జనుల [1]కిట్టి, లేలాకో నొడ్డచరితంబు । లెన్న నీకు.

క. పరదోషము సెప్పఁగ నేర్తురు గా కాత్మీయ మైనదోషంబు మదిం
బరికింపఁగ నధములు నేర్తురె తలఁపక యాంటి పలుకరతో నుండకుమీ. 112

వ. అని యుల్లసం బాడి మఱియును. 113

ఆ. సకలదేశములను । సన్మార్గవర్తులుఁ, గలరు దుష్టతతియుఁ । గలిగి యుండు
మది నెఱుంగ నేర్చు ప్రమధ్యస్థు లదియును, నదియు నుగ్గడింతు । రెదురు మెచ్చ.

వ. ఒకదేశంబు వాఁగెడ యగుట కలుగునే యట్లుం గాక సదాచారదురాచారంబులు
దైవం బెఱింగెడు [2]నీ వనాత్మజ్ఞుండ వూరకుండు మనియె నట్లు య్యిరువురు వివా
దంబు సేయుట యాలించి చేరి కౌరవపతి సఖిభావం బుపన్యసించి రాధేయు రాజత్వ
గౌరవంబు గొనియాడి మద్రవిభుని వారించిన నాసూతనందనుండు నగుచు శల్యు
నుద్దేశించి పొద పొద రథమ్ము పో నిమ్ము పో నిమ్మని పలికి నట్లరిగి శల్యుండు
సస్మితుం డగుచు వెండియు నర్జును [3]నుగ్గడించి కృష్ణుండు సారథియును గాండీ
వంబు సాధనంబును నై యప్రతిహతమనోరథుం డగునారథికుతోడం బెనంగ
నోపితేని నీవ మాకెల్లను రాజవన్నిమిటి మగనియరదంబు మన మొగ్గరంబు చిక్కు
వఱచుట గలుగు నని యెఱుంగ నయ్యెడు మన మేమఱక యుండ వలయు
నీ తోఁచు దుర్నిమిత్తంబు లనుసంధింపుము. 115

—•• శల్యుఁడు గర్ణునితో నప్పుడు దోఁచు నుత్పాతంబులు సెప్పుట. ••—

క. పఱపులు మనచేరువఁ బ్రేల్లఱచుట బెట్టిదురు గాలి । యడరుట గ్రద్దల్
తఱచయి యాడుట వికృతవు, టఱపులతో రేఁగి కాకు । లఱచుట గంటే. 116

వ. అని వెండియు. 117

ఆ. సిడముకామ నూఁడు । వడఁకెడు మన తేరి, చుట్టు మెఱయుఁ గట్టినట్టి చిఱుత
పడగలందుఁ గంటె । వెడలెడు మంటలు, గ్రంబు గాఁగ నోపు । రణము నేఁడు.

వ. అనియె నప్పుడు రాధేయుండు ధృష్టద్యుమ్నాభిరక్షితం బయినధర్మతనయవ్యూ
హంబు గనుంగొని రథికవరులం దగినయెడల నమర్చి తనమోహారం బాయితంబు
సేసికొని యురవడింప నమ్మద్రపతి యత్తెత్తి యాలోకించి. 119

ఉ. అల్లదె యర్జునధ్వజవిహారము గానఁగ నయ్యెడుం గపీం
ద్రోల్లసనంబునన్ మెఱసి । యుద్భటులైన త్రిగర్తు లేవు రో
భిల్లఁగ వారె యన్నరుని । బెట్టుగఁ దాఁకి రతండు నంపపె
న్వెల్లి నిగిడ్చి ముంచె నదె । నింగి గుణధ్వని వొంగ వారలన్. 120

ఆ. అనినఁ గర్ణుఁ డిట్టు । లనియె సంశప్తక,బలము చేతఁ బొదువఁబడి కిరీటి

1. ఆ. కెల్ల, నొడ్డచరితంబు లెన్న నీ కనుచితమగునె. 2. అ. నీవు నాత్మజ్ఞుండవు. 3. గ. నగ్గించి.

మేఘపిహితుఁ డైనమిహిరునిచాడ్పున, వాఁడి లేక యున్న। వాఁడు గంటె. 121

వ. అనుటయు శల్యుం డు. 122

చ. వరుణుఁడు నీళ్లచేఁ జెడునె । వాయుసఖుండు మహేంధనోత్కర
స్ఫురణ నడంగునే నరుఁడు । వోరుల నేపఱు లేల కల్గు నె
వ్వరికిని వానిఁ గీడ్పఱుప । వచ్చునె గాలిఁ బరాభవింపఁగా
[1]దొరకొనినం జలంబుమెయిఁ । దోయధి యంతయుఁ ద్రావ వచ్చినన్. 123

ఆ. దేవతలకు నైన । దేవేంద్రపుత్త్రుని, నాహవమున గెలువ । నలవి గాదు
మనము గెలుతు మిట్టి। మాట లాతనిఁ జేరఁ, జనక యూడి దీన । నంతసింపు. 124

ఉ. మేరువుఁబోలె నొప్పినసమీరణపుత్త్రుని పేర్మియుఁగా మహో
దారుఁడు ధర్మనందను సుదాత్తతయుఁ గా విజయానుజన్ము లే
పారఁగ నున్నసొంపును నహంకృతి యేర్పడ ద్రౌపదీసుతు
[2]ల్వీరల మీఱి పొల్పెసఁగు । లీలయుఁ జూడుము సూతనందనా. 125

వ. పాండవులు ధర్మపరు లెవ్వారల ధర్మంబు గలుగు నవ్వారలకి జయంబు గలుగుట
దప్పదనుసమయంబున సంశప్తకకులంబుం గనుంగొని మనసైన్యంబునుసవ్యసాచిం
జూచి వారిసేనయును గడంగి యొండొంటితోఁ దాఁకిన గంగాయమునలసంపా
తంబుచందంబు దోఁచె నట్టియెడం గురురాజు రాధేయుని మద్రరాజుం దగురా
జులను సాదరావలోకంబున సంభావించి యి ట్లనియె. 126

ఆ. ఎద్ది ప్రియము సేయు । నేపారుశూరుల
చిత్తములకు నది యు। దాత్తభంగి
నొదవె మీకు బాహు। మదమునఁ గొనియాడుఁ
డుగ్రశౌర్యమహిమ । యుల్లసిల్ల. 127

క. బలు పెసఁగఁ బాండుపుత్త్రులఁ, బొలియించిన నతులరాజ్య। భోగంబును వా
రలచేతం బొలిసిన సు,జ్జ్వలనాకసుఖంబుఁ గలుగు । వ్రాలుఁడు పోరన్. 128

వ. అనిన వార లందఱు నుబ్బి సింహనాదంబులు సేయుఁ దూర్యనినదంబులు సెలంగ
సైన్యంబులు సంతసంబునం బొదలె నప్పు డశ్వత్థామ రథికజనంబులమనంబులం
బ్రమదం బెసంగ ని ట్లనియె. 129

క. ఆయుధము విడిచి యుండఁగ, సాయకగురు మీఱు నూడఁ । జంపినకష్టో
పాయుని ధృష్టద్యుమ్నుని, మాయించియ కాని తొడిన। ములు వే నూడ్పన్.

క. కడువడి వడముడియును గ,వ్వడియు నతనిఁ గావఁ బూని । వచ్చిరయేనిం
జెడుదురు మచ్చాపంబున, వెడలువివిధవిశిఖశిఖల। వేఁడిమిచేతన్. 131

చ. అన విని యవ్వరిష్ఠరథి। కావలి పెల్లుగఁ బాండుపుత్త్రయో
ధనులపయిఁ గా వెసం గవియు। దర్పము వార లుదగ్రవృత్తి మా

1. ఆ. దొరకొనునె చలం...ద్రావ వచ్చునే. 2. అ. ల్వీరల

ర్కానినమహోగ్రభంగియును ఘోరవులీలల విస్మయంబొన
ర్చె ననిమిషాంతరంగములఁ జెల్లె రణంబు సుదీర్ణరౌద్రమై. 132

కం. జనసంక్షయంబు వెల్లె, మనవచ్చుం బ్రళయకాల మయ్యెనొ కాకుం
డును నిట్టిది గలదే యని, మనమునఁ దలపోయ వలసె మనుజకోటులకున్.

వ. అట్టియెడ. 134

ఉ. ప్రీతి యెలర్ప వీరుల వరించుటకుం జనుదెంచి యప్సరో
వ్రాతము గంధపుష్పపరివర్షణకేళి యొనర్ప సౌరభం
బాతతి సంచరించు నలిశాలిలుఁ డెక్కుడు సేసి వీచె సం
జాత నవీన ఘర్మజలజాలక సైనిక లాలనీయుఁడై. 135

ఉ. ఆ సమయంబునం గురుకులాగ్రణి భీమునిఁ దాఁకె వైరిసం
త్రాసనమత్తవారణకదంబసముద్భటుఁడై యతండునుం
జేసె రణంబు దత్ప్రబలసేన దలంకెడునట్లుగా సము
ద్భాసితదుర్నివార్యబహుబాణవిసారణదారుణోద్ధతిన్. 136

కం. పదపడి రాధేయుం డున్మదవృత్తిఁ గవిసె గుణనినాదంబును బె
ట్టిద మగురథనిస్వనముం, జదల నిగుడఁ బాండవాగ్రజన్మునిదెసకున్. 137

వ. ఇట్లు గవిసిన మనసైనికు లిట్లని రివ్విధంబున ధర్మనందనుం గదియ నడరిన
నరుండు వచ్చి యడ్డంబు సొచ్చునపుడు. 138

చ. నరునకు సూతసూతికి రణం బగు నేఁ డతిఘోరభంగి నం
దరయ నితండు గిటడఁచు నాతని నన్నటు లున్నవాఁడు దు
ర్భరరిపుబాధ దక్కి కురురాజు సుఖత్వముఁ బొందు నిప్డు రం
డరదము సేరి యీతనిమహాస్త్రవిలాసము సూత మేర్పడన్. 139

కం. గెలు పెల్ల భంగి నితనికిఁ, గలుగు ననుతలంపు వుట్టఁ గా నిపుడు మనం
బుల జనియించు మనోరథ, ములవడుటయుఁ బోర నెఱుఁగ నయ్యెడు నదియున్.

వ. అనుచుఁ గూడుకొని రథకరితురగసమ్మర్దనిర్దళితభూభాగంబుగా నురవడింప రాధే
యుం డతిభీషణం బగురణంబున. 141

తే. మిగిలి యప్పాండవాగ్రజుమగఁటిమియును
బలముఁ గోల్పుచ్చి తూలఁ బోఁ బలికి నొంచె
నధిప యతనికి వీఁకమై నడ్డపడఁగఁ
గడఁగునద్దెస యోధులగర్వ మడఁచి. 142

— కర్ణుఁడు ధర్మజుపైఁ గవిసి విజృంభించుట. —

వ. అనిన విని సంజయునకు ధృతరాష్ట్రుం డిట్లనియెఁ గర్ణుండు దనచెయిన యొట్లాయి
తంబు సేసెఁ గౌంతేయముఖ్యసైన్యసన్నాహం బెట్టిదతం డతనిం బొదివినయప్పుడు
గప్పడి యెవ్వలనుండె నవ్వీరుం డన్నకడనున్న నాసూతనందనున కెట్లు సేయవశం

బగునే వాసవుండు సకలసురగణంబులతోఁ బన్ని యున్నరునిపైవచ్చి ఖాండ
వంబు గాల్పకుండఁ గావం జాలెనే బ్రదుకునకాసపడుగల కతని మార్కొన
వచ్చునే రాధేయునకు వచ్చుం గాక యనుటయు. 143

తే. ఇట్టు లను సంజయుం డమ్మహీశ్వరునకు
సంగరవిహారంబు తెఱంగు ధర్మ
సుతునియొద్దవిధంబు నర్జునుఁడు వారి
పోరునెడ లేమియును మీఁదిపోరు వినుము. 144

వ. కృపాచార్యుండును గృతవర్మయును మాగధులు వలపట శకునియు నులూకుం
డును గుఱ్ఱపుదళంబులతో వారికెలనను సంశప్తకగణం బిరువదినాలుగువేలు
ముఖ్యరథంబు లగ్గలిక నుల్లసిల్లి డాపటను నీకొడుకులందుఁ గొందఱు కాంభోజ
శకయవనసైన్యసమేతంబుగా వారిపువ్వులను బహుబలభాసితుం డై దుశ్శాస
నుండు వెనుకనుం గతిపయసోదరపరివృతుం డై కురురాజు పిఱుందను నశ్వ
త్థామప్రముఖయోధులు గరినికరకృతసన్నాహు లై యన్నరపతి నియోగింప
నతనిపజ్జ నిలువ నిజపుత్త్రులుఁ దనచుట్టునుం గదిసి యొసక మెసఁగుబరవసంబున
మెఱయ సూతసూనుండు సేనాముఖంబునకుం దిలకం బై నిలిచి పొలిచె నట్లు
మోహరించి మదకలమాతంగంబులతఱచుకతంబున మొయిళ్ళమొత్తంబుల
కైవడిం గాఱుకొను నమ్మోన సురవడి నడపించునాకర్ణునిం గనుంగొని కౌంతేయా
గ్రజుండు గాండీవి రావించి యి ట్లనియె. 145

ఉ. సూతతనూజమోహరము సూచితె యెంతయు గట్టి యై సము
ద్ద్యోతితభంగిఁ దోఁచె నది యుక్కునఁ బై పడి యుబ్బలంబు ని
ర్ధూతము సేయ కుండఁగ నెదుర్కొని యెమ్మెయి నిల్వరింత మ
న్నీతి విధింపుమా బలువు నేర్పును దద్జ్ఞులు పిచ్చలింపఁగన్. 146

వ. అనుటయు సంక్రందననందనుండు. 147

తే. సారవంత మై కర్ణునిసైన్య మురవ
ణించుఁ గా కేమి దీనికి నృపవరేణ్య
పూని సేయంగ వలయుఁ బ్రధానకార్య
మతని సమయించుటయ నాకు నది భరంబె. 148

వ. అనిన విని యమ్మనుజపతి యతని కిట్లను న ట్లేని నీవు రాధేయుని గెలువుము
భీమసేనుండు సుయోధనుని నకులుండు వృషసేనుని సహదేవుండు సౌబలుని
శతానీకుండు దుశ్శాసనుని సాత్యకి గృతవర్మను ధృష్టద్యుమ్నుండు ద్రోణపుత్త్రుని
ద్రౌపదేయులు శిఖండియుం దారును దక్కటిధార్తరాష్ట్రులం దలఁపడువా రేను
గృపునితోడం బెనంగెద ననుటయు నట్ల కాక యని యతండు మున్ను దననిలి

చిన నెలవునకుం జనునెడ నయ్యుధిష్ఠిరునను వు తెఱంగు వార లందఱకు నెఱిం
గించె నతండు వలపటివలన సైన్యాగ్రవర్తి యయ్యెను వృకోదరుండు వామ
పార్శ్వవర్తి యయ్యెను శైనేయద్రౌపదేయసమేతంబుగా నప్పాండవాగ్రజుండు
మధ్యభాగస్థుం డయ్యె నున్న యమ్మోహరం బా సూతనందను మొనయురవణి
నరకుఁగొనక మార్కొనియె ననవుడు నాంబికేయుండు. 149

మ. నరుఁ డమ్మైమ్మె విని వచ్చె నన్నరునకున్ సంశప్తకశ్రేణికి
స్థిర మత్యుద్భటభంగిఁ జెల్లుటయు మున్సూచించి తీ వయ్యుధి
ష్ఠిరునిం గర్ణుఁడు దాఁకి యోర్చె ననియుం జెప్పంగ వింటిన్ రణం
బరయం జిత్రము సెప్ప మత్తెఱఁగు సువ్యక్తంబుగా సంజయా. 150

వ. అని యడిగిన సంజయుం డమ్మానవపతి కిట్లను నట్లు ధర్మజుండు సెప్పిన కాని యయ్యిరువాఁగుం గదిసినప్పు డన్నియమంబు నడవక [1]కయ్యంపు టౌచిత్యంబున నొండు దెఱంగు సెల్లె నది యెఱింగించెద నవధరింపు మవ్విధంబున మొనలు రెండును నొండొంటిం దార్కొను సమయంబున సవ్యసాచి గర్ణునడచు చక్కటికి నడరం గడంగినఁ గ్రాలుకపికేతనంబు గనుంగొని తెంపు పెంపునఁ బొంపిరి వోవుచుఁ ద్రిగర్తాదిసంశప్తకులు సరభసంబుగా నడ్డపడి పైకొని తఱిమి పొంగినపయోనిధిం బోలిన నబ్బలియుండు సెలియలికట్టం బోలి నిలువరించి మాతంగప్రముఖసేనాంగసకలాంగశకలంబుల నిలాతలంబు గప్పుచుండ నొండొండ పేర్చి యాబలం బా బలమర్దననందనునరదంబు ముంచికొనిన నవ్వీరుండు విజృంభితవిక్రముం డై బడబాగ్నికీలాకలాపంబు చందం బగుసాయకనికాయంబు నిడిగించుచు నెక్కుడుమదంబున నమ్మూఁకలం ద్రెక్కొను చుండఁ దత్ప్రకారం బాలోకించి రాధేయునకు శల్యుండు. 151

ఉ. అల్లదె యర్జునధ్వజవిహారము గానఁగ నయ్యెడుం గపీం
ద్రోల్లసనంబునన్ మెఱసి యుద్భటు లైనత్రిగర్తు లేవు రో
ఖిల్లఁగ వారి యన్నరుని బెట్టుగఁ దాఁకి రతండు నంపపె
న్వెల్లి నిగిడ్చి ముంచె నదె నింగి గుణధ్వని వొంగ వారలన్. 152

వ. అని చెప్పి చూపెఁ బదంపడి భారద్వాజపుత్త్రునిబరవసంపుమాటల నాటోపంబు మిగిలి మనరథికులు గవిసిన దారుణరణం బయ్యె నని యాకర్ణించి తది యేర్పడ వినుము వివరించెద. 153

సీ. కృపుఁడు సౌబలుఁడును గృతవర్మయును నలిఁ
జెలఁగుమూఁకలతోడఁ బెలుచఁ గవిసి
కాశ కైకయ మాత్స్య కౌసల పాండ్యాది
బలములఁ దాఁకి రుగ్గలిక మెఱయ

1. క. చ. జ. 'కయ్యంపుటుచితంబున'.

నారెండువాఁగుల | నాయుధంబుల[1] యెడ
మంటలుఁ బొగ్లును | మింటఁ బుడమిఁ
జూడ నక్కజముగ | శోణిత[2]ధామము
ప్రచురధూళీతిమిరముల నడఁప

తే. భగ్నరథములు నిపతితేభములు నిహత
హయములును మృతభటులును | రయమునకు వి
ఘాత మొనరింప నున్మదగమనభంగు
లందు బలువెర వొలయఁ బోరాడి రధిప. 154

వ. ఆలోన. 155

కర్ణుఁడు పాంచాలకుమారుల ననేకులం జంపుట.

ఉ. మేలిమదావళంబులును | మేటిహయంబులుఁ దమ్ముపింపు నా
భీలతఁ జుట్టి రాఁగ రథబృందముతోఁ గురురాజు కర్ణుదో
ర్లీలకుఁ దోడ్పడం గడఁగె | రేణు వుదీర్ణముగా నతండు పాం
చాలబలంబుపై నడరె | శౌర్యసముద్భటబాహువీర్యుఁడై. 156

వ. అబ్బలంబునకు బాసటయై చేదిసైన్యంబును బెనుఁబ్రాపై పాండవానీకంబునుం దఱిమినఁ బెఱిగినదర్పంబునం బ్రదీప్తుం డయి యక్కర్ణుం డాగట్టిమూఁకలం దఱిసి మెఱుంగువాలమ్ములు వఱప నవి పీనుంగుపెంట లగుచుండ నుఱక యుక్కునం బొదివినబలుమగలకుం గీర్తియు స్వర్గంబును నొసంగి తమవారి కంటెఁ బ్రమోదభరితులం జేయుచు సాయకాసారంబులు పరఁగించుచు బహువిధరథప్రచారంబు లుల్లసిల్ల నాసేనలును గృపకృతవర్మాదియోధబృందంబులతో బెనంగు మొనలును నొక్కటిగాఁ గలంచి యందు శోణితజలంబులను మాంసమజ్జామస్తిష్కకర్దమంబులను బతితాతపత్రహంసంబులనుం బొలుచునట్టినదీప్రవాహంబులు వఱపె ననుటయు ధృతరాష్ట్రుండు ధర్మనందనుం గర్ణుండు గదియునప్పు డతని కక్కడ నడ్డపడుట కెవ్వారు గడంగి రిక్కడ నితనికిఁ దోడ్పడ నెవ్వారు గలిగి రనుటయు సంజయుం డవ్విభున కిట్లనియె. 157

తే. ఇవ్విధంబున సేనలు | క్రొవ్వడంచి
సూతసూనుండు ధర్మజు | కేతనంబు
దెసకు నడర ధృష్టద్యుమ్నుఁ | డెనక మొనఁగ
బంధులును దాను వడి నడ్డపడియె నధిప. 158

క. వారలఁ గడచి ప్రభద్రకు, లారాధేయుపయిఁ గవియ | నాతండు మహో
దారుల నేడ్వుర భద్రా,కారుల నారాచసప్తకంబునఁ గూల్చెన్. 159

క. కని పాంచాలురు గోపం,బును దర్పము నెఱయ మొఱయఁ | బొదివిన రాధా

1. క. గ. చ. యెఱమంటలుఁ బొగలును. 2. క. గ. చ. ధారలు.

తనయుం డిరువదియేవురఁ, జనియె నిటవదేను వెడఁదతూపులఁ బెలుచన్. 160

క. వెండియు నేవురఁ బైకొని, చండశరప్రకరములు వెసనం గురియఁగ ను
ద్దండతఁ బాంచాలురఁ గర్ణుం డేవురఁ జంపె నైదుక్రూరాస్త్రములన్. 161

వ. ఇట్లు భానుదేవ చిత్రసేన సేనాబిందు తపన శూరసేనులం గీటడంచి యాటోపదీపితుండయి చక్రరక్షకు లగుసుషేణసత్యసేనులును వెనుక బలసివచ్చువృషసేనుండు నిమ్ముగ్రవ్వుదుగొడుకులఁ గడిమి రూఢికెక్కం దనకు రణక్రీడకుం దోడుపడియెడు నుల్లాసంబున నుల్లంబు వల్లవింపం బాండవబలంబులం గలంచు నయ్యంగపతిమీఁద ధృష్టద్యుమ్న శిఖండి జనమేజయ ప్రముఖపాంచాలకుమారులును సాత్యకినకుల సహదేవద్రౌపదేయులును గేకయమాత్స్యయోధవీరవ్రాతంబును భీమసేనపురస్సరంబుగాఁ దోఁతెంచిన బహుళజలధరంబులు ధరణీధరంబుపయిం గురియు పెనుసోనచందంబు దోఁప వివిధాస్త్రశస్త్రంబు లతనిపయిం దొరఁగింపం గనుంగొని కౌరవేశ్వరుండు దుశ్శాసనశకునితదీయతనయులు దన కెలంకులం దఱుమం గరిఘటలతోడం గడంగి యవ్వడముడిసి తార్కొని. 162

క. తానును వారును దూపుల, వాన పయిం గురియ నతఁడు వారించి గళ
ద్దానాంబులోలమధుకర, మైనగజవ్రజముఁ బటుశరార్చులఁ బొదివెన్. 163

క. పొదివెడునప్పుడు శౌర్యోన్నదుఁ డగునయ్యనిలతనయుశరమార్గణములు బె
ట్టిదముగఁ గవియుడు నోటఱి, యెదురుపలేరైరి కురుకులేంద్రుఁడు వారున్.

మ. బలుగాలిన్ నలుదిక్కులం జెదరునభ్రశ్రేణి[1]మాడ్కిన్ సము
జ్జ్వలసూర్యాంశులచేత విచ్చునిబిడధ్వాంతంబు చందంబుఁ జూ
డ్కులకుం దోఁచెఁ బ్రచండసంగరపటిష్ఠుండైన యాభీముతూ
పులమొత్తం బడరం గరిప్రకర ముగ్రవ్యాప్తియై తూలినన్. 165

వ. అట్టియెడం గృపప్రముఖరథికులు రాధానందనభవనందనులకుం దలకడచి పవననందనుపార్శ్వంబులం దఱుముధృష్టద్యుమ్నాదియోధులం దలపడిరి దుశ్శాసనప్రభృతులును వారిం గూడికొనిరి కర్ణనందను లక్కుమారమర్దనుం దాఁకి రందు సుషేణుండు. 166

క. ఖరభల్లంబున నాతని, శిరాననము ద్రుంచి నారసములు రయము మై
నురమున నేడు సొనిపి నిష్ఠురనినదం బెసఁగ నార్చె సురలు నుతింపన్. 167

భీమసేనుఁడు కర్ణనందనుఁ డగుసత్యసేనుం జంపి విజృంభించుట.

సీ. కనలి యొండొకవిల్లు గొని కీచకాంతకుఁ, డక్కుమారునిచాపయష్టి విఱుగ
నేసి మై బల్దావు లీరేడు నాటించి, తన్నప్పు డొడరుశరాఘాతనూజు
నుబ్బువాలమ్ములు డెబ్బదియూఁట వ్రారించి తత్సుతుఁడు దోర్గల మెఱయఁ
జేరిన నాసత్యసేనురథ్యంబుల, నూతుఁ గార్ముకమును గేతనంబు

1. 'మాడ్కిన్' అనియే వ్రా. ప్ర.

తే. నేడుమూపులఁ దునుమాడి యేఁచి మూఁడు
నారసము లంగమున గ్రుచ్చి నాళమునకు
వికసితాంభోరుహముఁ బాపువెరవు దోఁపఁ
దునిమె వెసఁ గత్తివాతియమ్మున శిరంబు. 168

వ. తునిమి దోస్సారంబు దుర్వారంబుగా నుక్కునం దక్కటిరథికజనంబులవయి నడరి [1]కృపకృతవర్మాదిరథికవరులకోదండంబులు దుండంబులు సేసి వారిం గ్రూరమార్గణంబుల మర్దించి దుశ్శాసనుని సాయకత్రయంబునను సౌబలునిఁ దద్ద్విగుణబాణంబులను స్రుక్కించి యులూకుని నతనితమ్ముని నొక్కుమ్మడి విరథులం గావించి కర్ణుకొడుకుం గని యోరిసుషేణా పొలిసితి పొమ్మనుచు బలునారసంబు నిగిడించిన నది నడుమన కర్ణుండు నఱకి మెఱుంగుటమ్ములు మూఁడు మేనం బఱప నుఱక మఱియు నట్టిమార్గణం బక్కుమారు నుపలక్షించి యేసిన నాసూతనందనుం డదియునుం ద్రుంచి యవ్వడముడిమీఁదఁ ద్రిసప్తతిత్రివప్రదరంబులు వరఁగించె నప్పుడు నకులుండు గవిసిన. 169

ఆ. చిత్రచాపము త్రిశితశరపంచక, హతశరీరుఁ జేసి నాసుషేణుఁ
జేచి నకులుఁ డతని నిరువదియమ్ముల, నొంచి కర్ణుమనము నొవ్వ నార్చె.

చ. అలిగి సుషేణుఁ డంతయు రయంబునఁ దొమ్మిదిదొడ్డవాఁడితూ
పులు మెయిఁ జొన్పి విల్ దునిమి పొంగిన నొండొకదీప్తచాప ము
గ్గలిక దలిర్ప నెత్తి వెసఁ గార్ముకదండము ద్రుంచి నొంచె దో
ర్బలవిభవం బుదాత్తముగఁ బార్థునితమ్ముఁడు సూతు నాతనిన్. 171

ఆ. అన్యచాపలసితహస్తుఁ డై కడఁగి సు,షేణుఁ డతనిపష్టిబాణగాఢ
నిహతదేహుఁ జేసె సహదేవుఁ డడరిన, మేటితూపు లేడు మేనఁ గ్రుచ్చె.

క. అయ్యిరువుర యబ్బాలుని, కయ్యము మురదైత్యరణముకరణి మహోగ్రం
బయ్యె వృషసేనుఁ డత్తఱి, నియ్యని సాత్యకి నెదిర్చె నిషుచయ మడరన్.

సీ. సాత్యకి వృషసేను సప్తనప్తతిమార్గ,ణంబులఁ బొదివి బాణత్రయంబు
నూతుమైఁ బఱపిన నాతఁ డాతని పెనుఁ, [2]గడఁత వాలికయమ్ము గాఁడనేయ
గోపించి మూఁడుబద్దులూపుల సారథి, నొకభల్లమున విల్లు నుజ్జ్వలాస్త్ర
నప్తకనిహతి నశ్వంబుల నేకకాం,డస్ఫూర్తిఁ గేతుదండంబుఁ దునిమి

ఆ. శినివరుండు వక్షమున మూఁడుశరములు, నాట సొగసి కర్ణనందనుండు
డెలిసి కనలి వాలుఁ బలకయుఁ గొని తేరు, [3]డిగ్గ నవియు నతఁడు నుగ్గుసేసె

వ. ఇవ్విధంబున విరథుండును నిరాయుధుండును నగునక్కుమారుం గనుంగొని దుశ్శాసనుండు రయంబున నెయిది నిజరథంబుమీఁదికిం దిగిచికొని తొలంగం గొనిపోయిన నతండు వేఱొక్కయరదం బెక్కి యెప్పటియట్ల తండ్రితేరివెనుక వర్తించె నయ్యంగపతి దొమ్మిదియమ్ము లడరించి శైనేయుసూతాశ్వచాపంబులు

1. క.గ.చ. కృపకృతవర్మలకోదం, 2. గ. గడఁత వాలమ్మున. 3. అ. డిగ్గ కవియ నవియుఁనుగ్గు

రూ పడంచి యతనిఫాలమ్మున మూఁడు నాలికయమ్ములు నాటించె నానత్యకి నందనుం డుస్స్యందనారూఢుం డై కవిసి కర్ణునకుఁ దోడుపడుబలంబులం గలంచి యతనితనువున నేమనారసంబులు నిగిడించెఁ గూడికొని శతానీకుం డన్నియశరంబులు లేసె నవ్వు డురవడించి తక్కటిద్రౌపదేయులు దెబ్బదియూఁడును ధృష్టద్యుమ్నుండును శిఖండియుం బదిపదియు భీమసేనుం డఱువదినాల్గును సహదేవుం డేనును నకులుండు ముప్పదియును [1](యుయుధానుం డేను) బాండవాగ్రజుండు నూఱును బాణంబు లానూతపుత్త్రుపయి గుప్పించి నొప్పించిన.

క. మదమున నతఁ డందఱఁ బది,పదితూపుల నే పడంచి బహువిధగతులం
దదనీకంబునఁ దేరొ,ప్పదముగ వడి సంచరింపఁ బెద్దయు మెఱసెన్. 176

శా. శైనేయుండును భీమసేనుఁడును ధృష్టద్యుమ్నుఁడున్ ద్రౌపదీ
సూనుల్ మున్నడరంగఁ గట్టి విశిఖస్తోమంబు లొక్కుమ్మడిన్
మేనన్ గ్రుచ్చ శిఖండియున్ భుజబలోత్సేకంబు సూపన్ వెసం
దా నయ్యోధుల సూతిసూతి [2]విరథస్వస్తబ్ధులం జేసినన్. 177

వ. వియచ్చరులు వెఱఁగందరి వెండియు నప్పీనుంపు వారల నందఱ నస్త్రధారలం బొదువుచు నెడ్తెఱం బెఱవారెసి బాణాంధకారంబునం గప్పినం ద్రిప్పికొనియును దొలంగియుఁ బెరలియు మలలియు సాంధికసంఘంబు దైన్యంబు నొందె నంత ధర్మనందనుపు బాధింపఁ [3]దలం పియ్యున. 178

క. ఆ రాధేయుం డాతని,పై రయమునఁ గవియుఘోరభంగిఁ గని మహో
దారంబుగఁ జెదిబలము, బోరన నెడసొచ్చెఁ దూర్యములు మొరయంగన్.

ఉ. నూతలినూఱుఁ డబ్బలము సొచ్చి శతిత్రయయోధవీరులం
జేతులతీఁట వో నుఱుము సేసి విశృంఖలదర్పదుర్దముం
డై తఱుమంగఁ గల్పితరథాక్రమ మొప్పఁగ వచ్చి ధర్మజుం
బ్రీతునిఁ జేయుచుం గడిమిఁ బెర్చిరి సాత్యకియున్ శిఖండియున్. 180

క. వారికిఁ దోడ్పడి యక్కడి,వీరులు గొందఱు గడంగి వివిధోగ్రశరా
సారము లంగాధీశ్వరు,పై రయమునఁ గురిసి రుగ్రభంగిఁ జెలఁగుచున్. 181

క. కురుపతియోధులును సత్త్వరులై యా రథికవరులఁ దాఁకి భుజావి
స్ఫురణము సూపిన నద్భుత,కర మయ్యెఁ దదవసరంబుకయ్యం బధిపా. 182

వ. ఆ సంకులసమరంబునందు. 183

శా. బాణజ్వాలలు బెట్టు పర్వ గగనప్రక్షోభణజ్వాలతా
క్ష్వాణస్ఫూర్తి ఛటచ్ఛటారవముగాఁ గర్ణోగ్రదావాగ్ని య
క్షీణోదగ్రత వైరిసైన్యవనభస్మీభావనిర్వాహపా
రీణం బై వెలుఁగొందె నిర్జరులు వర్ణింపంగ నే మబ్బఁగన్. 184

1. ఇది వ్రాఁతప్రతుల లేదు. 2. అ. విరథధ్వస్తాంగులం. 3. గ. జ. దలఁ పెత్తిన.

వ. అమ్మహోగ్ర విజృంభణంబున. 185

క. ఆటోప[1]మడఁగి యచ్చటి, మేటిమగలు దెచ్చవడిరి [2]మొయిగలి కర్ణుం
డేటులవికిఁ గవిసె ధను,ర్జ్యాటంకృతి సెలఁగఁ బాండవాగ్రజుఁ దెలుచన్. 186

వ. ఇత్తెఱంగునం గవిసిన నతనిమీఁద నమ్మేదినీనాయకుండు సాయకజాలంబులు పరఁగించిన నతం డుఱక యతిరయంబున నవి వారించి. 187

సీ. నవ్వుచుఁ జాపంబు నడిమికిఁ ద్రుంచి మై,మఱువుఁ దొంబదిశితమార్గణముల
భేదింప రత్నప్రభాదీప్త మగునది, సౌదామనీచారుజలద మంబు
జాప్తునితనువున కడ్డమై యుండి వా,తాహతం బై పాయునట్టువోలెఁ
బడుటయు మణిమయాభరణసుందరమైన,యతనిగాత్రము నతారాంబరంబుఁ

తే. బోలి యుప్పాడ యానూతపుత్త్రిచేత, రక్తమయ మైనపల్లవోద్రిక్తకల్ప
తరువుచందంబు నొందె నత్తెఱఁగు రాజ,ధర్మసూనుఁడు చలింప కదల్చెనధిప. 188

వ. ఇట్లదల్చుచు. 189

క. చదల మెఱుంగులు పర్వం, గొదమపిడుగునట్ల నిగుడఁ గుంతీసుతుఁ డు
బ్బు దలిర్ప శక్తి వైచిన, నది కర్ణుఁడు సప్తభల్లహతి నెడఁ దునిమెన్. 190

సీ. పాండవాగ్రజుఁడు దర్పంబున వేగంబు, నొప్ప నవ్వీరునియురమునందుఁ
గరముల ఫాలభాగంబున నాల్గుతో,మరములు సొనిపి నెత్తురులు వఱపి
యార్చినఁ బేర్చినయుగ్గలికంబున, నానూతనందనుఁ డతనిసూతుఁ
జంపి కేతువుఁ ద్రుంచి శాతశరంబుల, నంగంబు నొప్పించె నపుడు సాత్య

తే. కియు శిఖండియు నెడసొచ్చి రయము బలువు
మెఱయ రాధాతనూజునిమేన నమ్ము
లొక్క మొగి నింప నయ్యోధుఁ డుఱక వారి
విరథులుగఁ జేసి వింటులు విఱుగ నేసి. 191

క. తనువులఁ బటుబాణంబులు, నినిచి వెగడుపఱచి కడచి నిరతిశయరయం
బునఁ గదిసి ధర్మనందను, ననేకసాయకపరిక్షతాంగుం జేసెన్. 192

వ. ఇవ్విధంబున రాధేయుండు నొప్పించినం దదీయసంరంభంబు సైరింపంజాలక యమ్మహీపతి హతసారథికం బగురథంబు దొలంగం దోలుకొని పోయినం దోడన తవిలి నిలువరించి హాసభాసితుం డగుచు నయ్యంగపతి యతనితో నిట్లనియె. 193

కర్ణుండు ధర్మరాజు నొప్పించి యవమానించుట.

సీ. క్షత్త్రియకులమున జన్మించి యిది ధర్మ, మిది యధర్మం బని యెల్ల నెఱిఁగి
నట్టినీ [2]కిట్టిమహాహవమునఁ బ్రాణ,ములు డాఁచికొన శాత్త్రవులకుఁ దొలఁగి
పోవుట దగునె నీబుద్ధి గానఁగ నయ్యె, నృపనీతి యెఱుఁగవుఁ నీవు బ్రాహ్మ

1. గ. మడిఁగియక్కడ: 2. క. మేగలి_జ. మేగరి. ఇట చూడు కర్ణ. ౧. ఆ. ౧౧౩. పద్య. మైగలి దుస్సేనుఁడున్. 3. క. గ. చ. కిట్లు మహా.

ణాచారవేదివి । యాగాధ్యయనముల, వర్తింపు కయ్యంబు । వలవ దుడుగు
తే. మింక ననుబోఁటిఁ దొడరినఁ నింతకంటె, నెడరు వాటిల్లు వేగ పొమ్మింటికడకు
హరియుఁ బార్థుఁడు నున్నెడకైన నరుగు, మేను దెగ నీదుప్రాణాన కింత నిజము.

వ. అని పలికి గొంతివచనంబులు మనంబున నునికిం జేసి వధియింప నొల్లనివాఁ డై యప్పాండవాగ్రజు విడిచి యాపురుషసత్తముండు తదీయ సేనాసముదయంబు నానాస్త్రనిహతంబు సేసె లజ్జాకులమానసుం డగుచు నమ్మానవపతియును దత్ప్రదేశంబున నిలువక తొలంగి పోయెం బోవుటయు. 195

క. విను మతనియోధజనములు, మొనయుఁ దిరిగె నట్లు సమరమున విముఖుం డై
చనునబ్బలముం గని వెను, కొనియెం గర్ణుండు నీదుకొడుకులుఁ దానున్. 196

క. పటుసింహనాదతూర్యోత్కటరవగుణనిస్వనములు । గలసి యఖిలది
క్తటధారణ కేలిసముద్భటము లగుచుఁ గురుబలమునఁ । బరఁగె నరేంద్రా. 197

ఉ. ఇమ్మెయి సూతనందనుని యెత్తెఱఁ గోడిన యోధవీరసం
ఘమ్ములఁ బాండవాగ్రజుఁడు । గన్గొని పేర్కొని పేరెలుంగునం
గ్రమ్మఱ దెంచు కౌరవనికాయము గర్వ మడంపుఁ డన్న ధై
ర్యమ్మిగురొత్త వే తిరిగి । రారథికుల్ మరలెన్ బలంబులున్. 198

వ. ఇవ్విధంబున వృకోదరపురస్సరంబుగాఁ బాండవబలంబులు మార్కొనినమన మూఁకలుం గూడికొని తిరం బై [1]త్రోచి తలఁపడుటయు నయ్యిరువాఁగునందు.

మ. కరిబృందంబులు ద్రెళ్ళెఁ బెల్లుగఁ దురంగస్తోమముల్ పెక్కుగూ
లె రథానీకము లగ్గలంబు గెడసెన్ । లెక్కింపఁ బెక్కైనకా
ల్వురమొత్తంబులు రూపడంగె సిడము । ల్నుగ్గయ్యె నస్నైలనె
త్తురు వెల్లిన్ మునిఁగెన్ మరుత్ఖచరపంక్తుల్ వెక్కసం బందఁగన్. 200

వ. అట్టినందడిగయ్యంబున భీమసేనుండును సైన్యేయుండును బెట్టిదంపుటురవడిం గవిసిన ధృష్టద్యుమ్నాదిరథికప్రకరంబును బరవసంబు సేయం గురుబలంబు వెఱచఱచిపఱచినఁ గర్ణుం డదల్చి కరతలం బెత్తి నిలునిలు మని పలికిన నమ్మహారంబు నిలువ దయ్యె నవష్టంభవిజృంభితుం డైన యాసూతసూనుండు వెండియుం గౌరవుల[2] వేఱువేఱపురికొల్పి మరల్చిన నమ్మొనయును మొగకట్టి నిలిచె నంతం బవమానసూనుండాను మార్కొన నగ్గలించె నతం డతని నాలోకించి యంతకుమున్న శ్రుతకీర్తిస్యందనం బెక్కియున్నతమయన్న వలను సాత్యకిధృష్టద్యుమ్నులకుం జూపి వారలతో నిట్లనియె.

ఉ. ఈతఁడు దుర్దశం బొరసె । నేను గనుంగొనఁ గర్ణుఁ డేచి దు
ర్నీతిపరున్ సుయోధనుని । బ్రీతునిఁ జేయుటకై కడంగె మీ
చేతికి నిచ్చి [3]యిట్లురువు । నేసెద నిన్నరనాథు నాకు నా

1. క. తోడంబడుటయు. 2. గ. పేరువాఱి_క. చ. వేఱువేరం. 3. అ. యుల్లడము; క.త. యుల్లెవు:_ ఇది 'యుల్లుఱువు' అని యుండనోపు.

సూతతనూభవుఁ సమయఁ జూడక పోదు విషాద మెయ్యెయిన్. 202

క. ఏ నొండె నతనిచే నా,చే నొండె నతండు దెగుట సిద్ధముగ మదిం
బూని కడంగెద మీరీ,భూనాథునిఁ గాచికొనియుఁ బోరు నడపుఁడీ. 203

చ. అని పటుసింహనాదమున నంబరముం బగిలించి తేరు క
ర్ణునిదెసఁ బోవ నిచ్చినఁ గనుంగొని శల్యుఁడు కర్ణుతోడ ని
ట్లను మనమీఁద వచ్చు ననిలాత్మజుఁ జూచితె యంతరంగ మే
ర్చునలుక కామిషం [1]బిడఁగఁ జూచినచందము గాన వచ్చెడున్. 204

చ. అలిగిన మూఁడులోకముల నైనను జీరికిఁ జేకొనం డితం
డలఘుపరాక్రమస్ఫురణుఁ డర్జునసూనుఁడు నాత్మపుత్త్రుఁడుం
బొలిసిర కాని కోపమునఁ బొంగఁడు [2]నాఁడును నాఁడు నింత దో
ర్బలమును శౌర్యసారముఁ దిరం బయి చూపఁడు మెచ్చఁ జూపుమీ. 205

చ. అనవుడు భీముఁ జూచి యతఁ డాతని కిట్లను నట్టివాఁడ కా
కనిలజుఁ డల్పుఁ డెట్లు సమరాగ్రమునన్ భవదుక్తియట్ల [3]యిం
తను వగునే కిరీటిఁ దెగ టార్పఁగ నీతని నొంపఁ జంపఁ దాఁ
గని వెన వచ్చునాతఁ డధికం బగుమద్బల మప్డు సూడుమీ. 206

చ. తర మిడి చంపెఁ గీచకశతంబు నితం డది యేల యెల్లెడన్
బిరు దనఁగా బలాఢ్యుఁ డనఁ బెద్దయుఁ బేర్చినవాఁ డగున్ వృకో
దరుఁ డటులైన నీతనిమదం బడఁగించుట లీల నాకు నీ
వరదము సమ్ముఖంబుగ రయంబునఁ బోవఁగ నిమ్ము భూవరా. 207

ఉ. నావుడుఁ దేరు మద్రనరనాథుఁడు భీముని దిక్కుదగ్గఱం
బోవఁగ నిచ్చెఁ దూర్యరవముల్ సెలఁగెన్ దివి పిక్కటిల్ల న
ప్పావని నవ్వుచున్ బలము వాయ వడం గడుబెట్టు గిట్టినం
జేవ దలిర్ప నారథికసింహునిఁ గర్ణుఁడు గప్పెఁ దూపులన్. 208

వ. కప్పి యాలోన. 209

క. వెస నతనియురము బలునా,రసమున నొంచుటయు నతఁడు రాధేయతను
ప్రసరన్నవనారాచో,ల్లసితుం డై మెఱసెఁ గురుబలంబు దలంకన్. 210

ఉ. సూతతనూభవుం డనిలసూనునిచాపము ద్రుంచి యేచి యు
ద్ద్యోతితమార్గణంబు మెయి నుచ్చి చనన్ నిగిడింప నొండువి
ల్లాతఁడు ధైర్యసారము రయంబును జూపఁడు మెచ్చ నెత్తి సం
స్ఫీతశరోత్కరం బతని పేరుర మాడఁగ నేసి యార్చినన్. 211

తే. ఈడఁబోక రాధాసుతుఁ డేసె నిరువ, దేనునారాచములు పవమానతనయు
కత్తళము దూఱి యంగంబుఁ గాఁడి పాఱి,నిలువ కట చని మేదినీతలముసొరఁగ.

1. క.గ. బడుగఁ. 2. క. గ. నాఁడు నితండు నింత. 3. క. గ. యిం, తనఁ దగునే. 4. క. గ. నాఁ గని

మ. అలుకం గెంపు గనుంగవం గదురఁగా నప్పాండవుం డేసినం
కులిశంబో యనఁ బ్రజ్వరిల్లి నిగిడెన్ ఘోరంపుభల్లం బుర
స్థలి భేదిల్లఁగఁ దేరిమీఁదఁ బడి మూర్ఛం బొంది కర్ణుండు ని
శ్చలతం జచ్చినయట్ల యుండె వెఱఁ దత్సైన్యంబుఁ దూలెం గడున్. 213

-- భీముండు కర్ణుని మూర్ఛితుం జేసి నాలుక గోయం బూనుట. --

వ. అప్పు డయ్యనిలతనయుండు దనయరదంబు గదియం దెచ్చి యా సూతనందనుం గనుంగొని యిన్నీచువాలుక గోసెద నని చుంగటీనయులుఁగు వెఱికి యతనియరదంబుమీఁది కరుగ నుత్సహించినఁ జూచి మద్రనిభుండు వారించి యిది మూర్ఛ గాని మరణంబుగా దీయనఘ నాలుక గోసినం జచ్చు నితనిం జంపుటకుఁ బార్థుండు ప్రతిన వట్టినవాఁడు నీవు నంపిన నతండు నెవ్వగం బొందు ననిన విని యవ్వీరుండు వీఁ డిప్పుడు పాండవాగ్రజుని బాధించినం గ్రోధాంధుండ నై యది మఱచితిం గాని చావు గామియు నిట్టియెడ నాలుక గోయం దడవఁ జచ్చుటయు నెఱుంగుదు నిత్తెఱంగు నీవు దలంపించి లెస్సచేసి తీదురాత్ముండు సభలోన నసభ్యంబు లగు మాటలు ద్రౌపది నుద్దేశించి యాడిన నుద్దిపించినకోపం బజాతశత్రునకుఁ బ్రియంబుగా నడంచికొని యుండితి నేఁడు తద్వేదన వెలార్పం జూచితి నట్లు చేసితి నేని మానధనుం డైనధనంజయుండు దనచేసినపూనిక నెఱపం [1]గావక మనంబునం [2]గుంది మడియుఁ గృష్ణయుధిష్ఠిరులు నాతనితోడివార యింతప్రమాదంబు నీవు గలిమిం దెలిసితి మే లయ్యె మాతులా నీయాజ్ఞ యుల్లంఘింప నని పలికి నిలిచె శల్యుండును సంతసిల్లి తేరు దొలంగించె ననుటయు నాంబికేయుండు సంజయున కి ట్లనియె. 214

క. పాండవుల నాజి నోర్చు న్నితం డని మీరాజు సూతతనయునిఁ బొగడుం
గం దడఁచె భీముఁ డిట్టిమగండుఁ గలఁడె పిదప నెట్లు గయ్యము చెల్లెన్.

-- భీముఁడు శ్రుతవర్మాది కురుకుమారులఁ బెక్కండ్రఁ జంపుట. --

వ. అనవుడు సంజయుం డాంబికేయున కి ట్లను న ట్లు బాధితుం డయినరాధేయుంగనుంగొని కురుపతి దమ్ములతో భీమసేనుచేత సూతసూనుండు గడు నొచ్చెంగావలయు వేగం బొయిదుఁ డనుటయు శ్రుతవర్మాదికుమారులు గొందఱు పటుగతిం గవిసి యక్కొంతేయుం జుట్టుముట్టిన నతండుఁ దదనుచరుల నేసూటయేఁబండ్రు వీరరథికులం బిలుకుమార్చి శ్రుతవర్మశిరంబు భల్లంబునం ద్రుంచిన నది ముఖకాంతిమెఱయం జంద్రమండలంబు మహిఁ గెఱఁగుతెఱంగుఁ దోఁపం బడియెఁ బటుబాణద్వయంబున వికటునిసముని బె ట్టేసిన వెడిదంపుగాలిం దూలుతరువులకరణి ధరణిం ద్రెళ్ళిరి తదనంతరంబ తీవ్రనారాచంబునఁ గ్రాథుం గూల్చి నందోపనందులనొక్కపెట్టపెక్కమ్ములం బొరివుచ్చె నిట్లునీకొడుకులార్వురుం దెగినఁ దక్కటివారువిచ్చి

1. క. గ. గామియు నెఱుంగుదు. 2. జ. గుందు మఱియు.

దైన్యంబు నొందిన సైన్యంబు గలంగ నంతకుఁ దెప్పిఱి యొప్పటిపరవసంబు
శోభిల్లం గర్ణుండు గడంగి డగ్గఱి. 216

చ. అనిలజుమీఁద నేయ నతఁ డాశరముల్ దునుమాడి సప్తకాం
డనిహతుఁ జేసె నాతని దృఢప్రదరంబులఁ గప్పె నాతఁడున్
వినుము సముజ్జ్వలప్రదరవిద్ధునిఁ గా నొనరించి యమ్మరు
త్తనయుఁడు పేర్చి యార్చె వసుధావర యాతఁ డుదగ్రుఁడై. 217

మ. పది బాణంబుల నొంచి విల్లు దునుమం బ్రస్ఫీతదీప్త్యుజ్జ్వల
గ్గద వైచెం బవనాత్మజుం డది యొకట ఖండించె నవ్వీరుఁ డు
న్మదుఁడై పాండవుఁ డొండువిల్లుఁ గొని నానానాకంకపత్త్రంబులం
బొదువం గర్ణుఁడు నొంచెఁ దత్తను వతిస్ఫూర్జద్దశాస్త్రంబులన్. 218

వ. దానం గోపించి. 219

చ. పటుతరమైననారసము పాండునృపాత్మజుఁ డుగ్రుఁడై యుర
స్తటమున బెట్టు గ్రువ్వ సుకృతం బయి వీఁపున వచ్చి పోవ ను
త్కటధరణీప్రకంపచలితం బగు శైలముఁ బోలి తాల్మిని
క్కటముగ రోమరంజితముఖుం డయి కర్ణుఁడు ఘూర్ణితాకృతిన్. 220

చ. రయమునఁ బంచవింశతిశరంబులు మేన నిగిడ్చి భల్లసం
చయహతి విల్లు నక్కఁడఁచి సస్మితవక్త్ర సహస్రపత్త్రల
క్ష్మి యతిశయిల్ల రథ్యములఁ జెండిన మారుతి యేచి విద్విష
ద్భయదగదారుచిస్ఫురితబాహువిలాసవిభాసమానుఁడై. 221

వ. అరదంబు డిగ్గ నుఱికి కర్ణునిదెసం గవియం గురుపతి సేనం గలయేనుంగులం బది యేడింటిం బురికొల్పిన నవి దివాకరుఁ బొదువు నంబుదంబులచందంబున నాజెట్టి మగనిం గిట్టిన నతండు జోదులతోడం గూడ నగ్గజంబులం జదుపుటయు సౌబలుని ఘోటకంబు లాటోపంబున మూఁడువే లొక్కట నురవడించిన వాని ప్రావున నరదంబులుం గాలుబలంబులుం గవిసి కూడికొని పొదివిన మదం బొదవి యమ్మహాబలనందనుండు దారుణరణవిహారంబున నొండొండ పేర్చిన యబ్బలం బుజ్జ్వలానలంబున వైచినచర్మంబువాడ్పున ముడింగి యొదిఁగె నవ్వడాశకునియోధులు పంచశతరథికులు రథసంబున నడరిన వారల సూతాశ్వకేతుస్యందనసమేతంబుగా నఱిముఱి నుఱుమాడి యగ్గలిక మెఱసినం గని యగ్గాంధారరాజు వనుపం గడంగినయవనదేశీయు లగునాశ్వికులం ద్రిసహస్రసంఖ్యుల నవ్వడముడి పొడిసేయుచప్పుళ్లు గార్చిచ్చు వెనుకుటడవి నేర్చు తెఱంగునం దోఁచె నిట్లు గదవండువు సేసి యొంటురథం బెక్కె యక్కౌంతేయుండు ఖండనంబు సేయ రాధేయుండు పాండవేయాగ్రజుం దాఁకి తీవ్రప్రకాండంబులం

గప్పి సారథి సమయించినఁ దేరు తురంగంబులు దూలంగ నీడ్చికొని పాఱిన
వెనుకొనునయ్యంగపతిం గనుంగొని. 222

ఉ. భీముఁ డదల్చుచున్ రథము భీమగతిం గవియించ నాతఁ డు
ద్దామత మాఱుకొన్న వివిధస్ఫురదస్త్రపరంపరాప్తయు
శ్రీ మొన లప్పు డచ్చెరువుఁ జెంది నుతించె మురాంతకానుజుం
డామరుదాత్మజుం గడచి యంగపతిన్ వెసఁ దాఁకెఁ దాఁకినన్. 223

క. ఆ యిరువురనిబిడశర, తోయదపటలములు నిగుడ సరి మధ్యాహ్న
స్ఫాయత్ప్రభాఢ్యుఁ డయ్యుం, దోయజబాంధవుఁడు మింటఁ దోఁపక యుండెన్.

వ. వా రొండొరులశరపరంపర లడఁగించి రాసమయంబున. 225

చ. తన కరముల్ నిగిడ్చి [1]యుచితంపుమెయిం గొనిసూడి యంతటం
దనియక లీలఁ జేరి సముద్రదంబుగఁ బశ్చిమిఁ బొందె భాస్కరుం
డనుటకుఁ దావలం బయి జనాధిప చూడ శమంతపంచకం
బున విరిదమ్మితేనియలఁ దెల్పఁగెం బ్రతిబింబ మొంతయున్. 226

వ. అప్పుడు కృప సౌబల కృతవర్మాశ్వత్థామలయుద్దామ [2]సాహాయ్యంబున సమధికోత్సాహుం డగునాసూతనందనుసంరంభంబునం గౌరవానీకంబు దర్పోద్రేకంబునం గడంగినం బాండవబలంబునుం బొంగె నివ్విధంబున నిరువాఁగును గలయం బెరసిన నార్పుల నదల్పులం బొగడుటలం దెగడుటల నెసఁగునులివు తూర్యరవంబుల గెలువ నమ్మేదిని నెత్తుటం జొత్తిల్లి కెంజాయ రంజిల్లు పుట్టంబు ముసుంగు వెట్టినయంగనచందంబు నొందె మస్తకప్రముఖావయవంబులును గోదండాద్యాయుధంబులును మకుటప్రభృతిభూషణంబులును నాతపత్రధ్వజచామరంబులుం దునిసి పడి భీషాభిరామంబులుగాఁ గరిహయనరసమూహంబులు రక్తసిక్తంబు లైన సకాలబాలాతపలీల యావహిల్లం దక్కినసేనాంగంబుల మిగిలినమాతంగంబులు పెనంగినకసతలిప్తకాండంబులు [3]లూడుకొనం దాఁకిన నెరగల్లు వోవుకొండలకైవడిం బొలుచునవియును నస్త్రశస్త్రపాతంబులం గ్రమ్మురుధిరమ్ముల గైరికనిర్ఝరంబులతోడిధరాధరంబుల ననుకరించునవియును మెయిమఱువు లఱువు లై నానానిశితశరంబులు నాటినం జేష్టలు దక్కి ఱెక్కలు దెగియున్నశైలంబులం బోలునవియును నగుచుండఁ జెలంగి చతురంగంబులును బెరయఁ బెనంగునుల్లాసంబున శోణితం బడంగ మట్టువిసి రేణువు లెగసినం జూమ్కులు నిగుడ కున్నను దఱియ నుఱికి నిజాభిధానంబులను జననీజనకనామంబుల బిరుదాంకంబులం దమ్మెఱింగించికొనుచు వీరులు పోరుచక్కటికిం జొచ్చి ప్రాపై [4]పేరువాడుతదీయబంధుమిత్త్రులం బొగడు నమరులయెలుంగులు సింగి నిండం జెల్లు వారఁగుకిలాలం బాధూళి

1. గ. యుచితంబుమెయిం. 2. జ. సహాయంబున 3. చ. లూడిపోవం. 4. జ. పేరవాడి.

నడంచిన గోలంది నిలువక యేఱు లయి పాఱ నుబ్బి భూతభేతాళక్రవ్యాదంబు లోల లాడుచుం ద్రావుచు మదించి నృత్తంబులు సేయ నంబరంబున నట్టలాడ వెక్కసపాటొనర్పం జాలునాసమయంబున మనంబు లెవ్వటిల్లమకంబున ననిం దనివి సనమిం గవిసి కయ్యంబు సేయు సైనికోత్తములసింహనాదంబులు దిక్కులం బిక్కటిల్ల నాకలని కలన నట యున్న తన్నుం బొదివిన త్రిగర్త కోసల నారాయణ గోపాలబలంబుల నబ్బలనూదనసూనుండు గాండీవారావం బాకసంబు వగిలింప నొప్పించి. 227

చ. తఱిమి సుశర్మం దాఁకిన నతండుఁ దదంగమునన్ దశాస్త్రముల్
వఱపి మురాసురాంతకుని బాహువునం బటుమార్గణత్రయం
బఱిముఱిఁ జొన్పి బల్విడఁ దయమ్మున నుజ్జ్వలకేతుదండ మే
త్తెఱఁ జలియింప నేసిన నుదీర్ణతఁ దక్కపి యార్చె నార్చినన్. 228

సంశప్తకు లందఱు నొక్కపెట్ట యర్జునరథంబుపైఁ బడి యాఁగుట.

సీ. వెగడునఁ [1]జెయ్యెది వేగంబ తేఱి సంశప్తకు లర్జునసాయకముల
కోహటింపక సముత్సాహంబు వదలక యందఱు నొక్కపెట్ట తద్రథము పొదివి
హారులతోఁ గాడి యహరి కేలు నొగలును, [2]బలుగాఁడియును గంట్లు బట్టి మీలఁగ
మిడుక రాకుండ నమ్మేటి విల్కాని మేనును నిగ్రహించుట గనుఁగొనంగ

తే. నద్భుతం బయ్యె నపుడు నే యార్చె శౌరి
లీలఁ గొందఱు మత్తశుండాలభంగి
మెఱయఁ దూలించెఁ గాలను గుఱుచతూపు
గములఁ బార్థుండు పలువుర నమయఁ జేసె 229

వ. అంతఁ గొంతయూరుపు వోయినం జిఱునవ్వు నవ్వి కమలనాభునకి ట్లనియె.

ఆ. తేరు గదల నీక వైరులు బలువిడిఁ, బొదివి పట్టరాచపొల్లనైన
యేనుదక్క నృపతి నూనుఁ డిట్లూరుఁడు సహించు నెట్లు విక్రమించుఁగాక. 231

క. అని పలికి చూడుమీ య, న్ననుచు భుజంగాస్త్ర మేయ నది యరులకు గ్ర
క్కునఁ బాదబంధ మొనరిం, చిన ముంచె నతండు వారి శితవిశిఖములన్. 232

వ. ఇవ్విధంబున. 233

ఆ. నాగపాశబంధనంబుల గుదివడి, వారు వివిధబాణ దారితాంగు
లై రథంబు విడిచి రప్పుడా సంశప్తకవ్రజంబు గని త్రిగర్తవిభుఁడు. 234

క. గరుడాస్త్రం బేసిన న, చ్చెరువుగ గరుడములు గవిసి చీరెం బంచు
స్ఫురణము మెఱుఁగ వెస న, య్యురగాత్మకబంధ మూడ నుర్వీనాథా. 235

క. తనకడిమి బంధమోక్షము, గనినరథికకోటి గఁడగి గాండీవివయి నే

1. క. జేడ్వడి. 2. జ. బలుబండి కండ్లును బట్టి తోలఁగ.

పునఁ దూపులు దొరఁగింపఁగ, ఘనభుజుఁడు సుశర్మఁ జేసెఁ । గనదస్త్రమునన్.

చ. అది [1]నరుఁ డెంద మూఁపటయు । నాతఁడు మూర్ఛ మునింగి తేఱి పైఁ
జదికిలఁ బడ్డ నుబ్బి యుదె । చచ్చె సుశర్మ నిరోటు దాఁకె బ
ల్లిదుఁ డగుపార్థుఁ డంచు మదసంలీలల నార్చిరి వీరసైనికుల్
చదలను దిక్కులం బరఁగె । శంఖముఖోద్భట తూర్యనాదముల్. 237

సీ. అంతఁ దెప్పిఱి విజయాంతకుఁ డై వడిఁ, గవ్వడి యేచి మార్గణ చయంబు
పెల్లడరించిన । బిఱుసోమె సుశర్మ, యాసేనయందఁ నైంద్రాస్త్ర మక్కి
రీటి సవ్యూచు నేయ । నాటోపమున నది, వివిధబాణాకృతిఁ । గవిసి నుఱుము
గావింపఁగాఁ బదివేవురు సంశప్త, కాగ్రేసరులు దెగటాఱి రప్పు

ఆ. డుక్కు దక్కి తలరి । తక్కటియోధులు, చేష్టితంబు లెడలఁ । జిత్రరూపు
లట్టులైరి ధూమ । మడఁగిన వెలుఁగొందు, ననలు చంద మయ్యె । నన్నరుండు.

వ. హతశేషులైన సంశప్తకులు చతుర్దశసహస్రయోధముఖ్యు లవ్విజయువిజయంబు నహింపక యొండొరులం బురికొల్పి కొని బలంబులతోడం గడంగి నతం డతిదారుణం బగురణంబు సేయఁ దక్కటిపాండవుల దెసఁ బోరు కౌరవబలంబు దద్బలశౌర్యంబు లోర్వక భీతిం గలంగి పఱచినం గృతవర్మ కృప గురుపుత్ర కర్ణులు నులూకసౌబల సుయోధనులును దుశ్శాసనాదికుమారులును బరవసంబు సేసి యాసైన్యంబు దైన్యంబు వాయ విక్రమించి రట్టియెడ గృపునిచే నపరిమితశరజాలంబు పాంచాలపుంజంబుం బొదివినం గని శిఖండి యుగ్రహాసురవధుని పూర్వకాని యె నయ్యుభయపుర సమరంబు రామ రావణుల రణంబుకరణి నొప్పె నట్లు పోరి పోరి శారద్వతుండు.

చ. హయులను సూతుఁ జంపిన నుదగ్రత నా ద్రుపదాత్మజుండు వి
స్ఫురితకృపాణచర్మపరిశోభితుఁ డై యరదంబు డిగ్గి స
త్వరముగ నేఁగుదేర శరవాహిని పై నిగిడించె నాతఁ డ
య్యరి వెఱఁగందుచుం నిలుచునట్లుగ జోదులు పిచ్చలింపఁగన్. 240

వ. అట్లేచిన కృపాచార్యు పైఁ నురవడించిన ధృష్టద్యుమ్నుం గృతవర్మయు ధర్మతనయ ద్రౌపదేయుల నశ్వత్థామయుఁ గవలం గురుపతియును వృకోదరుం గర్ణుండును దలపడి నిలువరించి [2]రగ్గాతముండు శిఖండిపలక పఱియలు సేసిన నతండు దెరలక కేవలకరవాలంబున విక్రమింపం గడంగిన నయ్యతిరథుండు. 241

క. వాలికతూపులు మేనం, గీలుకొలిపి నొంపఁ గని సుకేతుఁడు బాణ
జ్వాలలు నిగుడ నడిరి యాంభీలత నాకృపునితోడఁ । బెనఁగె నరేంద్రా. 242

తే. తనకు నెడ సొచ్చి యిట్టు లసతండు పెనఁగ
ద్రుపదనందనుఁ డల్లన । తొలఁగి పోయె

1. ఆ. నరుమేన నాటుటయు. 2. క. దంట్యర.

నా సుకేతుండు గృపునిపై ఽ నాడ నిరువ
దాఱుశరములు వఱపి రథయంబు మెఱయ. 243

వ. ధనువు దునిమి యొండుకోదండం బెత్తిన నదియును ఖండించి. 244

క. తోడన హయసూతుల [1]నోఁ, గాఁడఁగ నేయుటయు నతఁడుఽగనలుచు బలువిల్
గ్రీడయుఁబోలం గొని పే, న్గాఁడఁగ నిగిడించెఁ ద్రిదశనారాచంబుల్. 245

— కృపాచార్యుండు సుకేతుం డను పాంచాలకుమారునిం జంపుట. —

తే. అట్టు నొప్పింపఁ దూఁగాడుఽనా సుకేతు
కంధరము మెఱుఁగారెడుఽక త్తివాతి
దొడ్డతూపున నేవునఁ ఽద్రుంచుటయును
శిరము ధర డొల్లెఁ గుండలస్ఫురణ మెఱయ. 246

వ. ఇట్లు సుకేతుండు నచ్చిన నతనిమూఁకలు విచ్చె ధృష్టద్యుమ్నుండుఁ గృతవర్మయుం బోరునెడ ధృష్టద్యుమ్నుండు గృతవర్మవక్షస్స్థలంబు విశిఖనవకంబున నొప్పించుటయు నప్పాంచాలవరు నతండు సూతకేతుహయస్యందనసమేతంబుగా నిబిడశరజాలంబునం బొదివిన నవ్వీరుండు బలాహకపిహితమూర్తి యగు మార్తాండు ననుకరించి తాను సైంధవవధదినంబునం బారావతవర్ణంబు లగురథ్యంబు లగ్గురునరుణాశ్వంబులఁ బెరయం బఱపిన తెఱంగున. 247

తే. అలిగి నొగ నొగతోఁ దాఁకఽనతిరయమునఁ
దేరు వఱపి కృపాణప్రదీప్తపాణి
యగుడు గద వుచ్చికొనియును ఽనఱుమ లేక
చలము డిగఁ ద్రావి కృతవర్మఽయలకు దాఁటె. 248

వ. అక్కుంభసంభవుచందంబు గాక వంచకుం డై యవ్వరుసున నబ్బలుమగండు దొలంగిన నయ్యరదంబుమీఁదికి లంఘించి యా ధృష్టద్యుమ్నుండు. 249

క. ఆ రథికు నచటఁ గానక, సారథితల దునుముటయును ఽ సంతసమునఁ బాం
గారి [2]తనశబ్ద మిచ్చె మ్మహారవమున నిక్కడిక్కఽ దనియె నతండున్. 250

చ. విని కృతవర్మఁ గాంచి పటుఽవిక్రమకేళి యొనర్ప నాత్మవా
హనమున కేఁగి యేచి ద్రుపదాత్మజుఁ డాతఁడు లోను గాఁగ వ
మ్మునఁ గలమేటిజోదులనఽముద్ధతి యేడ్తెఱ నివ్వారింప వి
ల్గొనెఁ బటుశౌర్యశోభితబలుం డగునయ్యదుముఖ్యుఁ డొక్కఁడున్. 251

వ. అట్టియెడ నొక్కరథికుండు రయంబున నిజరథంబుమీఁదికిఁ గృతవర్మం దిగిచికొని యనికిం దొలఁగం గొనిపోయెఁ బాంచాలోత్తముండును దనమునుము బలంబు గలంగం బరాక్రమించుచుండె. 252

సీ. ధర్మపుత్త్రుఁడు గురుఽతనయుతోఁ బెనఁగుచో, బాసట యై శినిఽపౌత్త్రుఁ డడర

1. క. పైఁ గాఁడఁగ. 2. క. గ. తలశబ్ద.

నా యుద్ధమును ద్రౌపదేయులు వెఱఁగందు,నట్లు వారలను సైన్యంబుఁ బొదివి
బహుళాంధకార మాపాదించి యమ్మేటి, విలుకానిసాయకవితతి నింగి
ఘనమయంబుగఁ బర్వ జననాథ వారల్లి, యొక్కొక్కరుం డనేకోగ్ర బాణ
ఆ. నిహతుఁ జేయునతఁడుఁ బ్రహసితవదనుఁడై,యొకనినొకని బహుసముజ్జ్వలాస్త్ర
విద్ధుఁ జేసి కడఁగి విచ్చుకొడుకుచా,పంబు దునిమెఁ గ్రూరభల్లనిహతి. 253

క. ధృతి నొండువిల్లుఁ గొని యా,శ్రుతకీర్తి దదీయతనువు సొనిపెం బ్రదర
త్రితయంబుఁ గవలి యాతం, డతనిం దత్పార్శ్వచరుల నమ్ముల ముంచెన్.

క. ముంచుమహోద్ధతి యాలో,కించి తనదుచూడ్కి దట్టకెం పెనఁగం గో
పించి శరనికరములు గుప్పించుచు ధర్మజుఁడు గవిసె భీమణభంగిన్. 255

చ. కదిసిన నమ్మహాభుజుఁడు గార్ముకముం దును మాడి మూఁడుబె
ట్టిదపు మెఱుంగుతూపులఁ బ్రటిష్ఠత సూపిన నా నృపాలుఁ డు
న్మదుఁ డయి మేటివింట బలుమార్గణముల్ వెస నేసె మూఁడు న
ర్వ్యాఁదియును నద్ధరామరుని పై శినివంశవరుండు దోడ్పడన్. 256

వ. ఇట్లు ప్రాపై కడంగి.. 257

ఆ. అర్ధచంద్రబాణహతి గురుపుత్త్రుని,ధనువు శినివరుండు దునుముటయును
శక్తి వైచి యతఁడు సారథి గూల్చి బల్, వింటఁ గురిసె బహుళవిశిఖవృష్టి.

క. సారథి లేమిని సాత్యకి, తే రిడ్చెఁ దురంగమములు దే రటు వాఱన్
భూరమణ ధర్మనందను,వారు వొదివి రంపగముల వడి గురుతనయున్. 259

క. భీమాస్త్రశిఖల నశ్వ,త్థామాగ్ని దహించె ధర్మతనయానుచర
స్తోమాటవి నొక వ్రేల్మిడి, నామెయి జనవిస్మయావహం బయ్యె నృపా. 260

వ. అప్పుడు కురురాజు పాండవుల నాచార్యనందనుచేతం దెగినవారలంగాఁ దలంచె నంతఁ దఱిమి యుధిష్ఠిరుండు ప్రచండకాండంబుల నవ్విప్రవరుం బీడితుం జేసి.

సీ. అలవును వెరవును గలవు కృతాస్త్రుండ, వని నిన్ను నెఱుఁగుదు నైన నెల్ల
సొంపు పార్షతునకుఁ జూప నోపినఁ దెల్ల, మగు నది యట్లుండె నరయనీకు
నెయ్యంబు వాటించు నేర్పు కృతజ్ఞత, యనునివి లేవు బ్రాహ్మణుఁడు దపము
దమమును గల్గువర్తనమున నుండుఁగా, కని సేయునే యెంత యడచివడినఁ
ఆ. బడిరి గాని యడ్డపడ లేవు కౌరవ,కులము నెల్లభంగి గెలుతు మేము
నీవ చూడ ననుడు నావీరుఁ డేమియు, ననక నగుచుఁ బఱపె నంపవెల్లి. 262

వ. ఆవెల్లికి నోర్వలేక యా భూవిభుండు దొలంగె నట్లంతటి మానిసి గెలిచినవాఁడై నిలిచి నిజపార్శ్వంబుల మూఁకలం గనుంగొని గురుపుత్త్రుండు క్రూరవిహారంబునకు నమరి మెఱసె మారుతితోడం బోరు కర్ణుండు దదనుచరంబు లగుకరూశచేదిసృంజయపుంజంబులుం దన్నుం బొదివిన నబ్బలంబునకు బాహుబలంబు సూపుచుండ నతని విడిచి యాభీమసేనుండు కౌరవసేనపయిం గవిసి కనుపుగొట్టె

నా రాధేయవృకోదరులమునుములు ధనంజయు మునుమభంగిం బ్రజాతియం
బగుచుండె నీ దుర్మంత్రంబున ననేకులకుం బొలియవలసె నయ్యవసరంబున. 263

సీ. కవలతోఁ బెనఁగెడు కౌరవనాథుఁ డ,న్నకులునంగంబున నవశరములు
నాటిచి యాసహదేవు కనకపుసిడము ద్రుం,చిన వారలిద్దరు నెనిమిదింటఁ
బదితూపులను నొంపఁ బతిరెండువిండులుఁ, దునుమాడుటయు నన్యధనువులెత్తి
యన్నయుఁ దమ్ముండు ¹నదన్నుఁ బెక్కమ్ములఁ, బొదివినఁ గనలి యా భూవిభుండు

తే. వారి దివ్యాస్త్రములఁ గప్పి ఘోరభంగి
గాంచి జను లక్కుమారులు గాలవశతఁ
బొందుదురు కాఁ దలంప నప్పుడు గడంగి
యడ్డపడియె ధృష్టద్యుమ్నుఁ డతిరయమున. 264

వ. ఇట్లు పాండవసేనాపతి భూనాథుం దాఁకి యేసిన నతండు. 265

ధృష్టద్యుమ్నుఁడు దుర్యోధనుం దాఁకి విరథునిఁ జేయుట.

ఆ. ఇరువదేను నిశితశరముల నొప్పింప, నలిగి యాతఁ డతని హయంగకముల
నఱువదేను తూపు లడరింప నఱకె న,క్కౌరవేశ్వరుండు కార్ముకంబు. 266

మ. బలువిల్లుగ్రత నెత్తి యొక్కట మొగి నప్పాంచాలవర్యుండు దీ
ప్తులు గ్రమ్మం బదియేనుమార్గణము లా భూమీశుపై నేసినం
గలయం బూచినకింశుకంబు చెలువంగం బొందెఁ దచ్చాపముం
బెలుచం ద్రుంచి యతండు ఫాలమున గుప్పించెన్ దశోగ్రాస్త్రముల్. 267

క. కాలాయసనారాచము, లోలి నుదుట నాటి యున్న నొప్పారెం బాం
చాలవరుముఖము మధుకర,మాలికచేఁ బొలుచుతమ్మి మాడ్కిం జూడన్. 268

సీ. కనలి యవ్వీరుండు కార్ముకాంతరమునఁ, గ్రూరభల్లంబుల ఘోటకముల
సారథిఁ జాపంబుఁ దేరును గొడుగును, దునుమాడఁగా భవత్పుత్త్రుఁ డేపు
గుందక శక్తి ²నిగుడ్పఁగఁ ద్రుంచె నే, త్తెఱఁ గృపాణము గొన నుఱుము నేసె
గద యెత్తఁ బఱియలు గావించె నుబ్బి ర,త్నమయాహికేతువు నఱికి వైచె

తే. నిట్లు హయసూతకోదండహీను దళితరథుని విగతాతపత్త్రు నిర్భగ్నశక్తి
ఖడ్గముద్గరకేతు విఖండితాపిధానుఁ జేసె నప్పార్షతుం డా నరేంద్రు. 269

తే. వికలసాధనుఁ డైనయవ్విభుని నతని
తమ్ముఁ డగుదండధారుండు తనదు తేరి
మీఁద నిడుకొని శత్రుసమీపభూమి
వాయఁ గొనిపోయెఁ జూచి రాధేయుఁ డపుడు. 270

క. శినివంశవరునితోడం, బెనఁగి పెనఁగి యతని విడిచి పెలుచ ద్రుపదనం
దనునిరథమునకు నెదురుఁగఁ, దనయరదము సనఁగ నిచ్చె ధరణీనాథా. 271

1. క. గ. చ. నెన్నఁ బెక్కు. 2. 'నిగుడ్చిన' అనియే వ్రా. ప్ర.

వ. సాత్యకియును శరంబులు గురియుచుఁ ద్రోణు తవిలె నుభయసేనాపతు లగు నా సూతనందనధృష్టద్యుమ్నులట్లుదార్కొనిన నయ్యిరువాగునందు నొక్కరుం డైన నోల మానఁ గొనక కడంగినం బోరు ఘోరం బయ్యె నప్పుడు పాంచాలకుమారులు వ్యాఘ్రకేతు సుశర్మ శుక్ల చిత్రోగ్రాయుధులును జయ రోచమాన సింహసేనులును బలుజోదుల మొత్తంబులతోఁ దన్నుం గవిసినం గర్ణుం డయ్యేనమండ్రు వీరుల నినిమిడిభల్లంబులం దునిమి తత్సహచరుల బహుసహస్రరథికుల సమయించినం జేదిరథికప్రవరులు జిష్ణు జిష్ణుకర్మ దేవాపి భద్రులును దండ చిత్ర చిత్రాయుధులును హరిసింహకేతు రోచమానశలభులును సబలంబుగాఁ దలఁపడిన [1]నావదు నొక్కండ్రు నొక్కట పెట్ట పెట్టి దంపుటంపఱపాలు చేసి మఱియును బిరుదు లయి పయింబడినదొరలను వారివరివారంబులను వసుధం గూల్చియు నలంచియుఁ గలంచియుం గడిమి మెఱయుచు నిట్టిచందంబు భీష్మద్రోణులయందుఁ జూడ మని జనంబులు వెక్కసపడ వివిధసమరవిహారంబు సలిపి వెండియు 272

సీ. సింహంబు పొరిఁ బొరిఁ జొచ్చినగజంబులభంగిఁ, బులి కగ్గ మైన జింకలవిధమున
జ్వలనంబుఁ గిట్టినశలభంబులట్లుఁ బాంచాలయోధులుఁ జేదిసైనికులును
దనుఁ దాఁకి పొలియ రాధాతనూభవుఁ డనిఁ, దనివోక ధర్మనందనునియున్న
చక్కటి కడర ధృష్టద్యుమ్నుఁడును ద్రౌపదీపుత్త్రులును సహదేవుఁడును శి

తే. ఖండియును సాత్యకియు నకులుండుఁ జేయఁ
గలమహీశులుఁ బొదివి రక్కర్ణు నతఁడు
పెక్కుపాములు బొదివినఁ బెనఁగుగరుడు
ననువు దోఁపఁగ బోరాడె మనుజనాథ. 273

వ. ఆసమయంబున భీమసేనుచేరిం బడినకౌరవసైన్యంబునం బ్రబలచతురంగంబు లొక్క మొగి బడలువడి రణాంగణంబు [2]మూసికొనియెం బెఱమూఁకలు వెఱఁగునం జెయ్యేది కరళ్ళడంగినమున్నిటియ ట్లుండె గాండీవి సంశప్తకుల ననేకుల మేటిమగల గీటడంచి హతశేషం బగుబలంబువిచ్చుటయు వాసుదేవునాలోకించి.

ఆ. అమరులకు నజయ్యు లగుసంశప్తకులు మదీయబాణఘోరభంగి
కోహటించి పాఱుచున్నారు భీముని, మునుము కౌరవులును మొనయ లేరు.

క. కర్ణుం డొక్కరుఁడును సమదీర్ణుం డై సిడము మెఱయఁ దిరిగి బలువిడిఁ జూ
ఘూర్ణితము సేసె మనసైన్యార్ణవమును మంథనగము సనను వమరంగన్. 276

చ. అరదము వోవ నిమ్ము రయమ్మునఁ గ నాతనిదిక్కు నావుడు

1. క. గ. చ. నాపదునొకళ్ల. 2. క. మునురుకొనియె; గ. మునుంగుబడియె.

న్దరహాసితంబుతో నలినసనాథుఁడు భీమునిచేతఁ బోదు నీ
శరములవేఁడిఁ గౌరవులసంగరవాంఛ యడంపు మనస్వి న
న్నరుఁడును నిమ్యకొన్నఁ గురునాథుని యోధులు బెగ్గడిల్లఁగన్. 277

ఆ. అమ్మురారి ధవళహయములు మెఱయు న్వద్దికు సత్వరముగఁ దేరు వోవ
నిచ్చుటయును జూచి విచ్చె నబ్బలము సింహంబుఁ గనిన లేడిగమియుఁ బోలె.

వ. అప్పుడు నీకొడుకు సంశప్తకులం బురికొల్పిన రెండువేలరథంబులును మున్నూ
ఱేనుంగులును జతుర్దశసహస్రతురంగంబులును లక్షద్వయపదాతులును నప్పార్థు
పయిం గవిసిన నతండు శింజినీటంకారంబునం బటుశరనారాంబున నింగి నించి
పదివేవు రుద్భటక్షత్త్రియులం బొలియించి యక్కాలనం గాంభోజబలంబు దోఁచిన
సందుటికి తదీయసైనికులకరంబులు శిరంబులు నఱికిన నది [1]మహావాతనిహత
విటపం బైన యారామంబుచందం బయ్యె నట్టియెడ. 279

క. అడరి సుదక్షిణుతమ్ముఁడు, గడువడి నేయుటయు నతనికరశాఖలు గ
వ్వడి యర్ధచంద్రశరముల, వెడందతూపున శిరంబు వ్రేల్మిడిఁ ద్రుంచెన్. 280

క. యవనశకసైన్యములు పైఁ, గవిసినఁ దద్రుధిరజలము గాలువలై పా
ఱ వెనం బఱపెను వివిధా, స్త్రవితానము లక్కిరీటి ధరణీనాథా. 281

మ. కని సంశప్తకు లేచి యొక్కమొగి నాకాంతేయునిం జుట్టుము
ట్టిన సేనాంగచతుష్టయాంగములు ఖండీభూతముల్ సేసె నా
తనిబాణోత్కరవేగ ముత్కటమరుత్సంక్రీడ జీమూతపా
టనముం జేసినభంగిఁ జిత్రబలగాఢస్ఫూర్తి శోభిల్లఁగన్. 282

క. హరి వెరవున ధవళాశ్వ, స్ఫురణమున రథంబు మెఱయఁ బొలు పారెడు న
న్నరునత్యద్భుతవిక్రమ, పరిణతి సూడఁ గనుదోయి పదివేల్ వలయున్. 283

క. ననుఁబోటులమనములు మెచ్చునఁ గరఁగె ననంగ నేల సురతతి కృష్ణా
ర్జునులం గని దుందుభినిస్వనములతోఁ గురిసె విరులవాన వొగడుచున్. 284

వ. అయ్యవసరంబున నశరీరవాణి యయ్యిరువుర నుద్దేశించి యఖిలజనంబులు నాక
ర్ణింప వీరు చంద్రార్కులం గడచిన కాంతిదీప్తుల నుల్లసిల్లెదరు తొల్లి యేకరథస్థు
లైన బ్రహ్మేశానులవిధంబున వెలింగెదరు గంటిరే వీరలు పరమమును లగునారా
యణుండును నరుండును జండీ యనియె నిట్లు మహానీయాశ్చర్యములు గనియును
వినియును మాత్సర్యధుర్యుం డగునాచార్యనందనుం డరిగి యమ్మహాత్ముల మా
ర్కొని మార్గణోజ్జ్వలం బగుదక్షిణకరంబున నాఫల్గును బిలిచి హాసభాసిత
ముఖుం డగుచుఁ గుపితుం డగునతని కిట్లనియె. 285

అశ్వత్థామ యర్జునుం బేర్కొని మార్కొని సంగ్రామంబు సేయుట.

క. ననుఁ దగియెదునతిథిం గా, మనంబునఁ దలంచి నీవు మన్నించెద వే

1. క. మహాశనిపాతనిహతవిటపం.

నిని వచ్చెద నీపాలికి, ననఘా సంగ్రామ మొసఁగు మాతిథ్యముగన్. 286

ఆ. అనినఁ గృష్ణుఁ జూచి యర్జునుఁ డాచార్యతనయుఁ గెలువ కునికి దైన్య మిపుడు
సమయఁ జూడ వలయు సంశప్తకులను నీ, మనను వచ్చువనికి బనువు మనుడు

ఉ. తేరు మురారి ద్రోణసుతు దిక్కునకుం జన నిచ్చి మేలు మేల్
పోరు ఋణంబు దీర్చు కురుభూపతికిన్ నరు బాహులీలకున్
నైరణ గల్గి నిల్వు మనినన్ విని యట్టుల కాక యంచు న
వ్వీరుఁడు షష్టిబాణముల వెన్నుని నేసె మదగ్రుఁ డై వెసన్. 288

ఉ. అమ్ములు మూఁడు పార్థు నేడఁగ నేసినఁ ద్రుంచి వైచెఁ జా
పమ్ము తెఁ డమ్మహాద్విజుఁడు ఘోరవహమ్ము గనొండువిల్లు శీ
ఘ్రమ్మున నెత్తి చేతులను గాళ్ళను మోమున [1]వింటికొమ్మునం
గ్రమ్మినభంగి గా శితశ[2]రప్రతతుల్ వడి నించెఁ బైపయిన్. 289

క. కడుఁ బెక్కువేలు దూపుల, వడిఁ గృష్ణార్జునుల సరథవాహంబుగ నె
క్కుడుమదమునఁ బొదివినఁ జె, య్యొడలి వెఱఁగుపడిరి వార లిద్దఱు నధిపా.

వ. ఇవ్విధంబున వివిధవిశిఖజాలంబులఁ గారు సేయు నార్పరా కుండఁ గప్పి యార్చిన నప్పార్థుం డతనిచేత దనవిక్రమం బపహృతంబయ్యె నని తలంపఁ దత్సైన్యంబున హాహాకారంబు లెసంగఁ జారణసిద్ధగణంబు లట్లు నిశ్చేష్టితులైన యా లోకరక్షకుల నాలోకించి లోకంబులకు బ్రదుకు గలుగునో యని పలుక నప్పద్మనాభుండు గనలి యక్కవ్వడి నుద్దేశించి. 291

క. గురుసుతుఁడు నిన్ను మిగులుట, గర మాశ్చర్యంబు ముష్టి గాండీవము దాఁ
దిర మయి యుండదొ బాహుల, వెరవుబలువు గుందెనో వివేకింపు మదన్.

క. గురునికొడుకను తలంపునఁ, బరుసఁదనంబునకుఁ జొరక భంగపడితొ యు
ద్ధురతఁ గడుఁ జేసితొ ననవుడు, [3]సక్రోధసంరంభుఁ డై విజయుఁ డాతనితోన్.

క. వెసఁ బెక్కమ్ములు మనపైఁ, ముసుఁగువడం బఱపి యతఁడు మురభంజన సం
తస మందెడు నింతన యేఁ, గసిమసఁగెదఁ జూడు నన్ను గాండీవంబున్. 294

మ. అని భల్లప్రకరంబులన్ గురుతనూజాస్త్రప్రతానంబుఁ ద
ద్ధనువుం గేతువు నాతపత్రమును జిత్రస్ఫూర్తిఁ దున్మాడి గ్ర
క్కున నవ్విప్రుఁడు శక్తియున్ గదయు నుగ్రక్కుం దాల్మియుం దోఁప నె
త్తినఁ దోడ్తో నవి ద్రుంచి వైచె సమరస్థేమాభిరామాకృతిన్. 295

ఆ. ఇట్లు ద్రోణసుతుని యేపు పార్థుఁడు దుహినంబుఁ జెఱచి మనిచు విగ్రహంబు మెఱయ
జెఱచె నంతఁ బొదివె నుఱక యారథికు నం, సంశప్తకవ్రాతంబు సరభసముగ. 296

క. ఎందఱు వొదివిరి వారల, కందఱకును దమక తమక యర్జునచటుల
స్యందన మొదు రైనట్లు మ, దిం దోఁచెఁ దదీయబాణవ్రతతి బహుళతన్. 297

1. అ. వింటికొప్పునం. 2. అ. రమ్ములు చే నిగిడించె. 3. అ. సక్రోధుఁ డై క్రీడి యతని నెంచి కాముని కోన్.

క. అప్పుడు గురుతనయాద్రిం, గప్పఁగ వజ్రోపమానకాండఘనాలు వెసం
గుప్పునఁగూర వఱప నరుఁ, [1]డప్పరుసఁదనమున కోర్చి యతఁడుం బెనఁగెన్.
వ. అశ్వత్థామ పెనంగు చుండ సంశప్తకవ్రజంబునందు. 299
క. చేతులు దలలును బహువిధ, హేతులఁ దునియలుగఁ జేసి యిలఁ దొరఁగించెం
జేతులకసి వోవంగ న,రాతులు బెగ్గిలఁగఁ గ్రీడి ప్రకటస్ఫురణన్. 300
క. తురగద్విపరథతూర్యా,భరణధ్వజచామరాతపత్రశకలముల్
పొరిఁ బొరి ధరఁ గప్పఁగ నె, త్తురుటేఱులు వానిఁ దొలఁగఁ ద్రోచుచు వచ్చెన్.
వ. అట్టియెడ. 302
తే. అంగవంగనిషాదకళింగబలము, లర్జునునిమీఁదఁ బెల్లుగ నడరుటయును
గురుతనూభవుఁ డతనిని మురవిరోధి, సంపవెనువెల్లి ముంచి బెట్టార్చి పేర్చి
వ. అవ్విక్రమవిశేషంబునకు రోషంబు నొంది. 304
క. అవ్వీరుం డవ్విప్రుని, క్రొవ్వును నాసైన్యసమితిక్రూరోద్ధతియున్
నివ్వటిల నీక ఖచరులు, నివ్వెఱపడ సమరకేళినిపుణత మెఱసెన్. 305
వ. మెఱసిన నెఱసినరోషంబున మఱియును. 306
మ. గురుపుత్త్రుం డసురాంతకున్ విజయునిం గ్రూరాస్త్రసంతానని
ష్ఠురపాతంబున నొంప నాహరి దనాటోపంబు సైరింప క
న్నరుతో నౌషధ మూఁది చేసి తెవులు న్మర్దింప కున్నం దుది
స్భర మై యుండదె యే పడంపుము రిపు న్సంరంభి వై నావుడున్. 307
వ. అతండు విజృంభించి గుణంబు సారించి. 308
చ. శిరమునఁ గంఠదేశమునఁ జేతులయందు నురస్స్థలంబునం
జరణములన్ శరంబులు వెసన్ నిబిడంబుగఁ గీలుకొల్పుచున్
వెరవునఁ బగ్గముల్ దునుమ వేగమ యీడ్చెఁ దురంగమంబు ల
గ్గురుసుతుతేరు గయ్యమునకుం గడుదవ్వు దొలంగ భూవరా. 309
వ. ఆ భూదేవుండును భగ్నోత్సాహుం డై యల్లన సూతనందనుసమీపంబునకుం జనియె నప్పుడు శౌరి సంశప్తకసైన్యంబు దెసకుం దేరు నడపుచుం దమసేనదిక్కోలాహలం బాకర్ణించి చూడ్కి యట నిగిడించి యర్జును నుద్దేశించి వేదండారూఢుం డైనదండధారుండు మనబలంబులం గలంచుచున్నవాఁ డమ్మగధోత్తముండు భగదత్తునంతవాఁడ యతని మడియించి మఱి చేయుం గలపని సూచికొంద మనిపలికిన నక్కవ్వడి యొకంబడ నక్కడ కరదంబు వోవనిచ్చె నట్టియెడ.

—ஃ దండధారుం డనురాజు కోదండంబుతోడ నర్జునుచేఁ జచ్చుట. ஃ—

క. పాండవసైన్యంబుల వేదండంబుల ఘోటముల రథంబుల భటులం
జండగతి మగధపతి నిజ, శుండాలముఁ బఱపి యేపుఁ జూపి తెరల్చెన్. 311

---

1. క. దప్పరుసున కోర్చి యప్పు ♦ డతఁడుం.

వ. అవ్విక్రమవిహారంబు వీక్షించి. 312

తే. మాగధునితోడ లలకుఁ గాక తమబలంబు
విఱిగెఁ బోడ పోద మని తాను దమకుఁ దేఁకు
హరియుఁ బలువంగ నర్జునుం డడ్డపడియె.
జండచేష్టితోద్దండవేదండమునకు. 313

క. అగ్గలిక దంతిఘాతుఁడు, దిగ్గజనిభనిజగజంబుఁ దీవ్రత నెఱయం
దగ్గఱఁగఁ బఱపి హయములు, నగ్గలిధ్వజునరుని సమ్ముఖులఁగప్పెన్. 314

చ. అలిగి కిరీటి మాగధధరాధిపువాహము లేర్చి గ్రక్కునం
దలయును ద్రుంచి యేనుఁగు నుదగ్రతఁ బీనుఁగుఁ జేసె నప్డు గొం
దల మొకయింత లేక తలనిగ్గతమ్ముఁడు దండుఁడు బాఁకి తోమరం
బులు వఱఁగింపఁ గేలు శిరస్సుం గరటిం దునుమాడె నుగ్రతన్. 315

క. తదనీకంబుగజంబులు, హదిపిన బలుగాలి మేఘచయములఁ దీవ్రగతిం
జెదరించుపగిది నరుఁ డున్మదుఁడై నలుదెసలఁ దోలెఁ దమనుజాధీశా. 316

వ. ఇవ్విధంబున మగధసైన్యంబు మర్దించి సంశప్తకసైన్యంబుపైఁ గవిసి కపికేతనంబు మెఱుంగులు మెఱయ మధుమథను నేరుపున వెలిమావులగతు లక్కజంబుగా నుక్కునఁ బార్థుండు భల్లనారాచప్రముఖప్రదరపరంపరలసొంపును బాహువీర్యధైర్యంబులపెంపును నలింపనికరంబు ప్రస్తుతింప నందు మహార్ణవంబునం దిరుగుమందరనగంబుచందంబున నిజస్యందనంబు బొప్ప నప్పటప్పటికి నక్కడ గడగుమదంబునం ద్రిగర్తాదు లగునమ్మహారథులు పైపయిం గ్రమ్మఱియు నస్త్రశస్త్రంబులు విదళితచ్ఛిన్నచూర్ణితంబులు సేయుచుఁ దదీయగాత్రంబులుం గరటిఘోటకతనువులుం దునియ లయ్యును నుగ్గు లయ్యును బఱియ లయ్యును గుదు లయ్యును ధరం దొరఁగ దామరబావిం గేలిసల్పు హంసంబుచాడ్పున విహరించి యవిహతధృతివ్రతమహితు లగునహితుల నత్యుత్తమలోకంబులకుం బుచ్చినం గొంచెపుమూఁక విచ్చినం బెద్ద వెనుకొనక యరదంబు మరల్చి వచ్చు నెడ నచ్యుతుం డర్జును నుద్దేశించి భవద్విక్రమవిహారస్థలంబు సూచితే యని పలికి వివిధాయుధఖండంబులను వేదండాశ్వరథపదాతిశకలంబులను భూషణాతపత్రకేతుచామరాంశంబులను జక్షుశ్శ్రమత్కారణపరిణతం బగురణస్థలంబు సూపె నప్పుడు గోఱిప్రాణంబులతో నొఱలునరతురగద్విరదంబులను గొందఱు దమ వారిం గానక [2]కన్నీళ్లు నించుచు నాలింగనరోదనప్రముఖంబులైనకరుణాభాషణంబు లగునవస్థావిశేషంబులం బొందువారలం గృపాళులై యాలోకించుచు నయ్యిరువురుఁ దమవిహారంబున నెసంగుకలకలంబు విని యుదీర్ణగమనంబునం జనుదెంచుచుండిరట మున్ను కౌరవ్యులమొనయును గర్ణునిమొగ్గ

1. క. తయమునన్. 2. క. గ. వారలకు నీళ్లిచ్చుచు.

రంబును రెంటను ముఖంబులం బెనంగుచుండి కయ్యంపు[1]టుచితత్వంబునం గలసె
నట్టియెడ రాజరాజు ప్రేరేపింప రాధేయునకుఁ బ్రాపయి పుళిందబాహ్లీక కేంక
గాంధారభోజానీకంబు గవిసినం గౌంతేయబలంబునకు భరంబగుటయు. 317

మలయధ్వజుం డను పాండ్యమహారాజు అశ్వత్థామచేతఁ జచ్చుట.

సీ. పాండ్యుఁ డానేకలక్ష్యపై బెట్టిదంబుగ, నదరి బాహాబల ♦ మక్కజముగఁ
[2]బేరిచి పీనుంగుపెంటగాఁ జతురంగ, ములఁ రూపుమాపె నయ్యుగ్రభుజుఁడు
ద్రోణభీష్ములు దనతోఁ బాటి యనుఁ బలు, కున కోర్వఁ డచ్యుతార్జునులు దనకు
నెక్కుఁడు నా విన్న ♦ నేవగించుచు నుండు, నవ్వీరుఁ డమ్మెయి ♦ నాక్రమింపఁ

ఆ. గని కడంగి యెదురు ♦ చని గురుతనయుండు
నగుచుఁ బగఱ నీవు ♦ మృగకులంబు
గలఁచు హరియుఁబోలెఁ ♦ గలఁచెదు నాదిక్కు
మొగము సేసి యనికి ♦ మొనయు మనియె. 318

చ. అన విని మేను వొంగ మలయధ్వజుఁ డుగ్రపునారసంబుఁ ద
త్తనువును గ్రుచ్చి మార్కొనినఁ దంబు నభంబునఁ బర్వ నంపవ
ల్లి నిగుడఁ జేయుఁ దొమ్మిదిశిలీముఖములఁ వెస నమ్మహీశుపై
ననిమిషవర్ణనీయగతి ♦ నగ్గురునందనుఁ డేసె నేసినన్. 319

వ. అత్తొమ్మిదింటిలోన. 320

క. ప్రతిశరములు పాండ్యమహీపతియును నిబరఁగింప నైదు ♦ భగ్నము లయ్యెఁ
గతి సెడక నిగిడి రథ్యప్రతతి ధరం గూల్చె నాల్గుబాణము లధిపా. 321

తే. మఱియు గురుపుత్త్రుఁ డేయ నమ్ములయు కేతుఁ
డాశరంబులుఁ దద్ధనుర్జ్యాలతయును
దునిమెఁ దునిమిన నతిరయంబున నతండు
నారి సంధించి యమ్ముల ♦ నభముఁ గప్పె. 322

వ. అప్పాండ్యమహీపతి పరివారసామర్థ్యంబున రథ్యావంతుం డయి వాయవ్యాస్త్రంబున నయ్యంపపరంపరఁ బ్రతిహతంబు సేసి తదీయచక్రరక్షకులం దెగటార్చి యార్చినం గెరలి యగ్గురునందనుండు దత్సహచరుల నొక్కుమ్మడి రత్నమయాగురుచందనసుందరం బైన మలయగిరిప్రకారంబునం బొలుచు కేతనంబు గూల్చి గుఱ్ఱంబుల గీటడంగించి సూతుప్రాణంబులు గొని చాపంబు ద్రుంచి తేరు దుమురు సేసి యతండు వాలివోనిపౌరుషంబునం బ్రయోగించు నస్త్రశస్త్రంబుల నుఱక నఱకి యుగ్రమై యున్నను గయ్యంబువలని వేడుక నతని సమయింప నొల్లక యరవాయి గొనినయాలోనఁ బతితయోధం బైనసుకల్పితమాతంగంబు నెక్కి గిరిశిఖరంబు

1. క. గ. జ. టుచితంబునం. 2. క. గ. చ. బేర్చినఁ బీనుంగు♦పెంటలై...రూపుమాసె.
3. క. జ. నడరింపనేను

నలంకరించు కేసరియట్లొప్పి యాద్రవిడేశ్వరుండుసామజంబు నుద్దానుగతిందఱిమి భీమాభిరామం బైనతోమరంబు వైచిన మణిగణోజ్జ్వలం బైనయాదాంశిశిరోభూషణంబు ధరణిం బడినం ద్రొక్కంబడినభుజంగంబుపోలికం గవలి యబ్బలు మగండు తత్పార్శ్వవర్తుల నార్వురరథికవరులం దద్వేదండంబుతుండంబును జరణచతుష్టయంబును నమ్మేదినీపతిపాదంబులుం గరంబులుఁ శిరంబును నతితీవ్రభల్లంబులం దునుమాడిన నద్దిక్కుమూఁకలు విచ్చిం గురుభూవరుం డమ్మహీసురవరుం జేరం జని యగ్గించె నప్పుడు. 323

క. నిలు నిలు మని తమమూఁకల, నిలిపి వృకోదరుఁడుగవిసె । నీబలములపైఁ
దలకొని ధృష్టద్యుమ్నా,దులు సంరంభోద్భటముగఁ । దోడ్పడి రథిపా. 324

క. వారలవడి కోర్వక యు,క్కౌరవసైన్యంబు దెరలఁ । గర్ణుఁడు దర్ప
స్ఫారత నడల్చి నిల్చి యు,దారగతిఁ వైరిరథికతతి మార్కొనియెన్. 325

వ. అతనికి బాసటయై యుడరినయశ్వత్థామచేతం బలువురు పాంచాలురు వొలిసిరి కృష్ణుండు గ్రీడికిం బాండ్యమహీపతి సమయుట నూపి సమీరనందనకర్ణాదు లగు నిరువాఁగుఁ రథికులపరాక్రమంబును వేఱువేఱ నిరూపించి చూపిన నతండును రథంబు మనసేనలోనికిం బోవ నిమ్మనిన నతం డట్లజేయ నుబ్బినపాండవానీకంబునకును రాధేయుగుఁరుపుత్త్రులరభసంబునం జేర్చినమనమొనకును సంకులసమరం బయ్యెనం దాకర్ణునకు ధృష్టద్యుమ్నునకుం బరస్పరశరకర్తనంబును నితరేతరచ్ఛత్త్రకేతుఖండనంబును నన్యోన్యవర్మవిదారణంబును మిథశ్శరీర[2]పాతనంబును నగుసంగ్రామంబు సెల్లె నట్టియెడ నాసూతనందనునకుం దలకడచి గురునందనుండు ద్రుపదనందనుంగవిసి బ్రహ్మఘ్ననిలునిలు మేనుగలుగ నెట్లుబ్రదికెద వని పలికి వెండియు.

క. మాతండ్రియెడం జేసిన, పాతకము కతంబు గాఁగఁ । బాంచాలనికృ
ష్టా తునిమెద నిను నరుఁ డిట, యేతేరక యున్నఁ బాఱ । కీవు నిలిచినన్. 327

వ. అన విని ధృష్టద్యుమ్నుం డతని కి ట్లనియె. 328

క. మీతండ్రి [3]కుత్సికి నటీకిన, [4]హేతియ నీకొఱకు నునిచి । తిపుడ నఱుకుదుర్నీతులువపలుకులకు నీ, డై తోఁచినయుత్తరంబు । నదియె దురాత్మా. 329

వ. అని యంత నిలువక. 330

తే. వినుము బ్రహ్మఘ్నుఁ డన నీకుఁ । జనునె బ్రాహ్మ
ణబ్రువఘ్నుఁడ నై నమ్రున్నతి వహించు
నన్నుఁ గిల్బిషపరుఁ డను । నిన్ను జనకు
కడకుఁ బుచ్చెద వేగిర । పడక నిలుము. 331

1. క. వారలయురవడి కోర్వక, కౌరవ. 2. క. పాతనంబును. గ. పాటనంబును. 3. క. గ. చ. కొర్కి నటీకిన. 4. క. గ. జ. హేతియ నీకొరకియును నిప్పుడ నఱుకుదు. చ. హేతిన నీ దె నకొర్కి నిపుడ నఱుకుదుర్.

వ. అనియిట్లయ్యిరువురు నొండొరులం బరుషంబులు పలికి తలపడి వియత్త
లంబు విశిఖశిఖాకలాపంబులం గప్పిరి రాధేయుండు యుధామన్యువు నుత్తమౌజు
ద్రౌపదేయులైన యేవురను మఱియుం జేవం గల పాండవ పాంచాల యోధులను
బొదివి ఖండనంబు సేయుచుండె నా ధృష్టద్యుమ్నుండు గురుపుత్త్రుకోదండంబు
దుండంబులు సేసినం గుపితుండై యొండువిల్లుఁ గొని యవ్వీరుండు. 332

క. సూతతురంగస్యందన, కేతనచాపములు నఱికి కేలిమెయిఱ్ఱ ను
గ్గై తోరఁగ నేసెఁ దోడ్త్రో, నాతఁడు శక్తియును గదయు నవలఁ దెత్తంగన్. 333

వ. అప్పాంచాలోత్తముండు వాలునుం బలకయుం గొని కవియం గడంగిన నదియును
దుమురు సేసి పెల్లేసి పడకున్న నశ్వత్థామ[1] వేగిరపడి వెఱఁగందుచుఁ జేతిబాణా
సనంబు విడిచి కృపాణంబు గొని భుజంగంబుదెస కడరువిహంగపతివిధంబునఁ
జనుట సూచి సవ్యసాచితో శౌరి ధృష్టద్యుమ్నుండు గురుపుత్త్రుంబారిం బడియెం
గావవలయు ననుచు నద్దిక్కు సూపిన నతండు సత్వరుండై యవ్వీరుం డాద్రుపద
పుత్త్రుం గవిసినకొలందిఁ గ్రూరంబు లగునారాచంబులు గుప్పించుచు నొప్పించిన
నమ్మహీసురవరుం డయ్యుత్సాహంబు వదలి మరలి యరదంబున కరుగ సహదేవుం
డు దనతేరిపైకి నప్పార్షతుం దిగిచికొని తొలంగం గొనిపోయె నక్కుంభసంభవ
సంభవుం డగ్గాండీవి మార్కొని పెనంగి బెట్టిదంబుగాఁ గనుకనిం దాఁకియతండు
నాటినసునిశితశరంబున సొలె సారథి రథంబు బొండువలనికిం దోలె నర్జునుం డట్లు
నిజసేనానాథు రక్షించి ద్రోణిమదం బడంగించుటకనుంగొని కౌంతేయసైనికులు
సింహనాదంబులు సేయ నక్కడ నిస్సాణాదులనాదం బెసంగి నింగి నిండిన. 334

తే. సూతసుతుఁడు ధనంజయుఁ జూచి రోష
కలుషితాక్షుఁడై తలఁపడఁ దలఁచె నపుడు
తత్క్షణమున సంశప్తకసతతియుఁ దోఁచె
రెండుఁ గని యిట్టు లనియె నా హరికి. 335

వ. కర్ణుండు మనల మార్కొనం గడంగెడు సంశప్తకులుఁ గ్రమ్మఱం [2]బొదివిరి కర్ణు
చేతం దగులువడితి మేని సంశప్తకుల కోపాటించినవార మగుదుము వారల
దిక్కు దేరు వోవ నిమ్ము. 336

చ. అన విని యట్ల చేసె నతఁ డర్జునుఁ డా రిపుకోటి సుట్టి యే
పున నుఱుమాడు చుండెఁ గురుభూవర యప్పుడు ధర్మసూతనం
దనులు సముద్ధతిం గడఁగ దండడి క్రొత్తగ వారిసేనయుఁ
మనయినయుం బెనంగె నుపసమారహితం బగువిక్రమంబునన్. 337

ఉ. సంగర మేను బెక్కుదివసంబులు సూచితిఁ గాని యెప్డు నా
భంగి మునుంగ దచ్చెరువుపాటునఁ జిత్తము వోరు చున్కియో

---

1. క. గ. ఉ. వెఱఁగుపడి చేతి. 2. క. నడిఁ బొదివిరి కర్ణ.

త్రుంగుచు నున్న యెడ[1] మొఱంగి దూలక పైపయిఁ గ్రమ్మఁ గూలు సే
నాంగము లంద నిండఁ గలహాంబుమహోగ్రత యేమి సెప్పుదున్. 338

కర్ణుండు పాంచాలసైన్యంబు దైన్యంబు నొందించి విజృంభించుట.

తే. అందు బాంచాలవీరుల నశ్వసూత, రథసమేతంబుగా సంగరాజు దర్ప
మెసఁగ నేపుర మెఱుపుర స్వేచ్ఛను మృత్యుమార్గణములఁ దునుమాడె నధిప.

క. పదపడి పాండవయోధుల్, హ్యోదివినఁ బెనఁగుచుండ మనుజుల్ గజపతి యు
న్మదవృత్తిఁ గేలి సలుపఁగ, నిది గాలముఁ[2]వోలె సురలు నగ్గిక సేయన్. 340

వ. అట్టియెడ. 341

చ. ద్రుపదతనూజులుం గవలు ద్రోవదిపుత్త్రులు శౌరితమ్ముఁడుం
గుపితమనస్కులై బలువుగా నెల్లలఁ దాఁకి రతం డదల్పి యు
గ్రపురభసంబునన్ శరపరంపరలం బరఁగించెఁ గౌరవా
ధిపహృదయంబు మోదమునఁ దేలఁగ నందఱయంగకంబులన్. 342

వ. వారలపై నక్కురుభూనాథుం డేనుఁగుకయ్యంబునకు నేరవు గల కళింగవంగాంగ మగధసుహ్మపౌండ్రాదిదేశంబులబలంబులం గవియించిన నవి తదీయచతురంగ బలంబుల మట్టి మల్లాడి చిత్రవధవిహారంబు సలుప నగ్గజప్రధానసేన లగ్గలికం జించి చెండాడుచు నాదండిమగలును జేకితానప్రభద్రకులును రౌద్రరసంబునం బెనఁచినం గనుంగొని మదంబునం బొదలి యుత్తరించి యురవడించిన. 343

శా. వంగాధీశుఁ గరీంద్రుతో [3]నడఁగ గర్వస్ఫూర్తి నైనేయుఁ డే
యం గేలిగతి మాద్రికొడుకు పౌండ్రాధీశ్వరుం గిట్టి యా
భంగిం గూల్పఁ దదగ్రజుం డటుల దర్పం బొప్ప సుహ్మాధినా
థుం గోపంబున ద్రుంప నేచెఁ గరటిస్తోమంబు లంతంతకున్. 344

క. విను మ్లేచ్ఛి నకులుఁ బొదివె, నుదగ్రధ్వని ననేకవేదండము లం
దెనిమిదిటిఁ గూల్చెబాణము, లెనిమిది యెనిమిదులఁ దమ్ముఁ డేత్తెఱ నధిపా. 345

క. ఆ ధృష్టద్యుమ్నాదులు, క్రోధాంధత నడరి యేనుఁగుల నత్త్రుపాతిక
వ్యాధూతములుగఁ జేయుచు, రాధేయుం గదియ సంగరము పేర్చె నృపా. 346

వ. ఆసమయంబున శోణితంబు వెల్లువ మున్నుగ సినరేణు వడంగిన నిట్టవాఁగు నై నిఖిలలును దమతమయుడియాలంబులతోడి గొడుగులును సిడంబులును బెద్దయు మెఱసి పెనంగుచుండ సంశప్తకసంచయంబు గించిదవశిష్టంబుగా నష్టంబు సేసిన సవ్యసాచికి శౌరి యక్కౌరవపాండవబలంబులపోరు సూపి యప్పుడు దుర్యోధనుండు దనయందుఁ జేయంగలవారును దానును ధర్మనందనుం బట్టుతలంపున బెట్టుపొదువుటయు నమ్మృతంబున కానపడి యడరు నసురుల మరల్చు శక్రాగ్నుల చందంబున

1. క. గ. జ. యనఁగ. 2. ఆ. దోశ. 3. క. నడవ; గ. జ. నప్పుడు.

భీమసేనుండును సాత్యకియుం బ్రతిఘాతములం జేయుచుండుటయు నంత నిలువక యక్కురు
విభుండును గర్ణకృపాశ్వత్థామలును సుద్దామగతి నసంఖ్యపుంఖశరజాలంబుల
నమ్ముల జడియుఁ బెం గడిమి యక్కౌంతేయాగ్రజానీకంబు ద్రుంచి వైచుటయుఁ
గర్ణసుతప్రాణంబునం గడంగు ధార్తరాష్ట్రసింహనాదంబులకుం దెరలక మరు
త్సుతుండు మండలప్రచారంబు దగుబలిమి నాసూతనందనుండు మొదలగునమ్మేటి
మగలమార్గణంబులు లక్ష్మనుజపతిపైఁ బఱచుటయు నకులసహదేవసాత్యకిధృష్ట
ద్యుమ్నద్రౌపదేయప్రభృతు లైనపాండవేయపాంచాలాదియోధులం గలంచి
యక్కర్ణుండు కమలాకరంబునం గేలి సలుపుశుండాలంబులీల నటించుటయు
నవ్విధం బగ్గలిక నక్కవ్వడి నాక గోరి కపికేతనం బాలోకించుటయుం గలిగిన
యప్పరిపాటి యంతయు నేర్పడం జెప్పి యా రాధేయురభసం బుగ్గడించి
మఱియు ని ట్లనియె. 347

క. నినుఁ దలఁపడఁ జూచినయీ, తనియేడ్తెఱ మంట సొరఁగఁ ॥ దలఁచు మిడుతయు
బ్బున కెన యై నాకుం దోఁ, చినయది మ్రందింపు మితని ॥ శితవిశిఖములన్. 348

వ. అని పనికి యతని కప్పుడు దోడ్పడ నుత్సహించు పవనసుతు నుపలక్షించి బీభ
త్సునకుం జూపి. 349

ఉ. ఇత్తఱిఁ ద్రుళ్లు మాపి నిను ॥ నేవున మార్కొని గెల్తు నన్నలం
పెత్తి సుయోధనుం డదె యశేషబలంబులఁ జూర్చి గర్ణుతో
మత్తగజంబు లీల నెలకొమ్మ మిడిఁ గూల్చినభంగిఁ బాండుపు
త్రోత్తమ వీనిఁ గూల్చు మతఁ ॥ డొంటిగ రాజ్యము నీకుఁ జేకుఱున్. 350

వ. అనునవసరంబున. 351

మ. సముదాటోపత వాయునందనుఁడు ధృష్టద్యుమ్ను శైనేయు లే
కమనోవృత్తిఁ గడంగి తో నడర దోర్గర్వంబు శోభిల్ల శౌ
ర్యము సొంపార నిలింపకోటి వొగడన్ ॥ రారాజుసైన్యంబు లో
క్కొమొగిం బెల్లగిలంగ బెట్టడరె నక్క్రోధాంతరంగంబుతోన్. 352

క. అడరి పటుబాణజాలం, బడరింపఁగ వారిబలము ॥ లధికరయమున నె
క్కుడుమదము నొలయఁబై కొని, బడలుపడఁగఁ జేసె నీమకబలముల నధిపా.

క. వడిఁ బొదివి భీముఁ డార్చినఁ, జెడ విఱిగినసేన నేమి ॥ సెప్పుదుఁ దనదొం
దడిఁ దాన చదిసె వెనుకొను, కడిఁదిమగల చేత గాసి ॥ గాదె నరేంద్రా. 354

ఉ. మ్రొగ్గెడువాహనంబులును ॥ మోములు వాడఁగ వాహనంబుల
డ్డగ్గి తలంగుసైనికులు ॥ నేలకుఁ [1]గప్పుఁజొప్పు సొప్పడం
దగ్గుసిడంబులుం గులముఁ ॥ దన్నుఁ దలంచి యొచెర్చి యొంటిమై
మ్రగ్గెడువాడు నై కురుధరావరుసైన్యము రూపు మాయఁగన్. 355

1. క. గప్పుటొప్పు.

ఆ. పావనికి నిషాదపతినందనుఁడు పదాఱు, గొనిన నాతఁ డతనికుంజరంబు
కరముతోఁ దదీయకరమును శిరమును, నఱకె శితశరములు నాలుగింట. 356

క. మూఁ డక్షౌహిణు లిమ్మెయిఁ, బోఁడిమి సెడి పాఱఁ బవనపుత్త్రుని యెదురన్
వేఁడిమి సూపంగ నొకఁడు, న్వాఁడిమిగలఁడు లేఁడె యే మనంగల దధిపా. 357

వ. ఇవ్విధంబున విక్రమించిన భీమసేను బరవసంబును దనసైన్యంబు నికులసంరంభంబునుం బద్మనాభుండు ఫల్గునునకుం జూపి చెప్పె ననిన విని సంజయునకు ధృతరాష్ట్రుం డిట్లనియె. 358

క. నీచెప్పినమెయి సూడఁగ, నీచత వాటిల్లె మన యనీకమునకుఁ దా
రేచేటు సెడిరొ కౌరవు, లావంత యుపన్యసింపు మంతయుఁ దెలియన్. 359

క. అనవుడు నతఁ డిట్లను న, మ్మనుజపతికి హితులు సెప్ప మానక నీచే
సినదుర్నయమునఁ జేటొం, దెను వగవక రణము వినుము ధీరవిచారా. 360

వ. ఇట్లు భీముకడంకఁ గని కవ్వడి దనమునుముకొంచెపుమూఁకలం దోలి మగిడి మన సేనల మర్దించుటకుం దమవారిఁ జేరం జనఁ గౌరవపతి యమ్మారుతి మార్కొని.

— దుర్యోధనుఁడు భీమసేనుం దలపడి పోరుట. —

తే. ఎందు వచ్చెదు నిలు నిలు మేను గలుగఁ, గడిమి సెల్లునె నీకు నీక్షణమున నిన్ను
నంతకునిపాలి కనిచెద ననుచు రోష, రక్తలోచనరుచుల శరములు వఱపె. 362

క. రాధేయుండు సుదీర్ణ, క్రోధుం డై గర్జితోద్యద్గుణరవము నభో
[1]బాధం బొనర్పఁగా నిజ, యోధులఁ బురికొల్పికొని సముద్ధతిఁ గడఁగెన్. 363

వ. అట్లయ్యిరువురు నుత్సాహంబు వాటించి నిజానీకంబు నిలువరించిన నది పురికొని పోరికి నమరుటయుఁ బాండవబలంబును దిరంబయి పెనంగం దొడంగె నట్టియెడ నక్కడ నిక్కడఁ జేయం గలదొరలు దలపడి యుక్కున నక్కజం బగుసమరక్రీడ సలిపి రందు. 364

సీ. కర్ణుఁ డేపారి శిఖండిరథ్యముల సా, రథిఁ గేతువును గూల్చి రయము మెఱయ
విగతాయుధుండు బాణవిహతాంగుఁడును గాను, దగ్రుఁడై తఱుమునతఁ డండు దొలఁగఁ
బాఱె దుశ్శాసనపార్షతు లొండొరు, తనువులు నొంచుచు ననిమిషులకు
నచ్చెరు వగునట్టియసి సేయు వారల, యనుచరు లెడ సొచ్చి పెనఁగి రంగ

తే. రాజు సూడఁ దత్పుత్త్రిసారథిశిరంబు, నకులుఁ డొకభల్లమునఁ ద్రుంపఁ జకితమైక
లంగు నచ్చటిమూఁకఁ జలంబు మిఱియ, నిలిపె నాసూతసూనుండు నృపవరేణ్య.

వ. అట్లు సారథిరహితుం డైనవృషసేనుండు వేఱొకసూతు నమర్చికొని తండ్రికిం జక్రరక్షకుం డై నిలిచె నకులుండు నొండుదెస కడరె సహదేవుండు దులూకుని విరథుం జేసి పఱపె సాత్యకిసౌబలు లన్యోన్యకేతుపాతనంబును బరస్పర

1. అ. వేధి యగుచు నిగుడఁగ నిజ; గ. వీధిఁ బొలుపారఁగా నిజ

కంకటకర్తనంబునుం జేసి రాశ్వైనేయుండు దురంగంబులం జదిపిన నరదంబు
డిగ్గనఱికి యొసరించు నగ్గాంధారవిభుం గని యులూకుండు. 366

క. మును సహదేవుం డెగవం, జనినప్పుడ యొండు దేరు నపహరించుకొనం
గనుట నది సేర్చి యతనిం, గొనిపోయెను సంగరమున కకుంఠ దొలంగంగన్. 367

ఉ. అచ్చటిమూఁక నల్లడల నాతురతం జెడి పాఱి భీముచేఁ
జచ్చెఁ గురుక్షితీశ్వరుని సారథి గూలె హయాలినుగ్గుగాఁ
జొచ్చె రథం బతండు వెలి సొచ్చి ధరిత్రికి దాఁటి పోయి వె
న్నిచ్చిన నీదు యోధవరు లేడ్తెఱ మార్కొని రమ్మరుత్సుతున్. 368

వ. యుధామన్యుండు కృపాచార్యధనువు దునిమిన నమ్మహాత్ముండు వేఱొక్కవిల్లెత్తి

ఆ. కేతనంబు గూల్చి యాతపత్రము దును,మాడి సూతుఁ జంప నధికభయము
గదిరి తేరు డాన కయ్యంబునకుఁ దొలఁ,గంగఁ దోలె నతఁడు కౌరవేంద్ర.

క. శితశరము లుత్తమౌజుఁడు, కృతవర్మనిమేన నింపఁ గినుక గదిరి మూ
ర్ఛితుఁడుగఁ జేసె నతఁడు వెస, నతనిం దత్సూతుఁ డెగచె నరదముఁ దొలఁగన్.

అశ్వత్థామ యర్జునుం దలపడి మహాహవంబు సేయుట.

చ. గురుతనయుం డనేకరథికుల్ దనపార్శ్వములం దుదగ్రులై
దురముకడంకమైఁ దఱుమ దోర్బలశౌర్యము లుల్లసిల్లని
ష్ఠురశరవృష్టి ముంచె మధుసూదను మధ్యమపాండవున్ వియ
చ్చరులు ప్రశంస సేయఁగ నిజధ్వజినీ నయనోత్సవంబుగన్. 372

క. అలిగి నరుఁ డైంద్ర మాదిగఁ, గలదివ్యాస్త్రంబు లేయఁగా నయ్యాయు
జ్జ్వలమార్గణంబులను నఱకెఁ గలశభవసుతుండు మాన్చెఁ గౌరవముఖ్యా. 373

వ. ఇవ్విధంబున వివిధాస్త్రంబులం బోరి పోరి. 374

సీ. ఉఱక యశ్వత్థామ యుగ్రబాణంబులు, విజయుని దక్షిణభుజము నాఱ
మూఁడేయ నొచ్చియుఁ బోఁడిమి సెడకయు,బ్బలియుం దదల్పెఁ దత్పార్శ్వవర్తు
లగు పెనుమూఁకల నమ్ములవెల్లిఁ బే,రల్క నకుంఠధైర్యనాత్మజుండు
రథ్యచయంబు నారాయణు వానర,ధ్వజము నప్పురుగాత్రమును బొదివె

తే. మెఱుఁగువాలంపగముల నమ్మేయి నరుండు,ద్రోణితోడ భరంపశిరణ మొనర్చు
చుండ నటమున్న ధర్మజుఁ డుపవసించి,చిత్రసేనుని నమ్ములఁ జిక్కువఱిచి.

క. తఱిమి తనమునుము సైన్యము,నుఱుమాడఁగఁ గని సుయోధనుఁడు మున్నగు నే
డ్తెఱ నీయోధులు మార్కొని,యఱిముఱి నొప్పించి పట్ట [1]నమరి పొదివినన్.

ఉ. పావని మున్నుగాఁ గవలుఁ బార్షతుఁడున్ వెస వారిఁ దాకినం
జేవ దలిర్ప నచ్చటికిఁ జెచ్చెరఁ గర్ణుఁడు వచ్చి తీవ్రబా
ణావృతమూర్తిఁ జేసె మనుజాధిప యారథికావలిన్ ధను

1. నఱిమి.

దనువయి నాగ్రహించెదు హితంబగుకార్యమె యమ్మహీశు నీ
వనిఁ దెగటార్చిన ట్లయిన నర్జునుఁ డుత్కటశోకరోషముల్
పెనఁగొన నిన్నుఁ గౌరవులఁ బీనుఁగుపెంటలు సేయ కుండునే. 389

తే. ఇతఁడు దెగటాఱెనేని యీయనిమిషులయ్యుఁ గలదె నరుఁ బోలి యింతటిసుభటుఁడు ఘనశౌర్య
మది కురుక్షితిపాలున కఖిలరాజ్యసిద్ధియును జేయు నింక నాబుద్ధి వినుము. 390

వ. అదియునుం గాక. 391

క. వాఁడె కురుక్షితిపాలుఁడు, పోఁడిమి సెడి భీముచేతఁ బొడువఁబడియె న
వ్వాఁడిమగని కర్ణము నీ, వేఁడిమి దక్కంగఁ గలదె వేఱొకఁ డరయన్. 392

క. పవనసుతుచేత నాభూధవుఁ డీల్గెనయేని నీవు ధర్మతనయునిం
గవలను సమయించుట యల్పవ వృథాస్ఫురణంబు గాదె పరబలభేదీ. 393

క. అన విని యత్త్రైభవ, త్తనయుని దెసఁ జూచి వాయుతనయునిచే నా
తని పొడువఁబడుట యేర్పడఁ, గని రాధాతనయుఁ డతనిఁ గావఁగ జనియెన్.

క. చనుటయు నజాతశత్రుఁడు, దనశిబిరంబునకుఁ బిన్నతమ్మునియరదం
బున నతని నతనియన్నను, గొని చనియెను సత్వరముగఁ గురుకులముఖ్యా. 395

వ. అని యిట్లు సంజయుండు ధృతరాష్ట్రునకు ధర్మనందనుపలాయనం బెఱింగించె
ననుటయు. 396

ఆ. మొదలిరాజు సభయమున నిట్లు సమరంబు, దొలఁగి చనియె నట్టిపెఱబలంబు
దొరలు నిలిచి పోరు టెరిది యనంతరవర్తనంబు విప్రవర్య చెపుము. 397

వ. అని యడుగుటయు. 398

చ. అనిమిషవంద్యమాన ఘనసాదరశీలసుధాయమాన స
త్త్వనలినగంధరూప విబుధద్విషదంతకరప్రతాప సం
జనితనిరస్తశామ మునిసంఘమహార్ణవపూర్ణసోమ వే
దనికరసంవిధేయనిజతత్త్వపరిష్క్రియ నిత్యనిష్క్రియా. 399

క. ప్రమితివిదూరా సుమనస్సమితిసమారాధనప్రసన్నాకారా
గమనాగమననిరసనా, శమనదమనసాధ్యపరమసారోల్లసనా. 400

మాలిని. ద్విజపతివృషభాంకోదీర్ణ కారుణ్యపూర్ణా
భజననిరతరక్షాప్రౌఢ నిర్భేదరూఢా
గజదురితసముత్సేకఘ్న హృత్పద్మనిఘ్నా
యజనవిధిఫలత్వవ్యాప్త నిత్యప్రదీపా. 401

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి
తిక్కనసోమయాజిప్రణీతంబైన శ్రీమహాభారతంబున కర్ణపర్వంబునందు ద్వితీ
యాశ్వాసము. 402



హరిహరనాథాయ నమః

# శ్రీమదాంధ్ర మహాభారతము

## కర్ణపర్వము, తృతీయాశ్వాసము.



మచ్చరణాంబుజయుగ
ళీమధుమూర్తిప్రభావిక్లీనవిమలచే
తోమత్తభృంగభక్తజ
నామృతసరసీస్వరూప ! హరిహరనాథా. 1

వ. దేవా ! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు కర్ణుండు గాంతేయాగ్రజు విడిచి దుర్యోధనసంరక్షణంబునకుం జనుట విని ధృతరాష్ట్రుండు దనమనంబున 2

క. అనిలజునకుఁ జాలఁడె నా, తనయుఁడు మానంబు గాక ! ధర్మజుఁ డట్ల
బ్బినఁ బోనిచ్చుట రాధా, తనయునకుం బుద్ధి యగునె ! తప్పం దప్పెన్. 3

వ. అని వగచి యుధిష్ఠిరుండు సనినపిదప నెత్తెఱంగున సంగరంబు సెల్లె నని యడిగిన సంజయుం డతని కిట్లనియె నట్లు సని యాధర్మతనయుండు రథావతరణంబు సేసి మందిరంబు ప్రవేశించి సెజ్జ నొడలు సేర్చి నాటి యమ్ములు వెలికించుకొని హృదయంబున నమ్మెయి నున్న పరిభవంబు పీడ యొనర్ప విషాదవివర్ణుం డగుచుఁ గవలం గనుంగొని మీరు సమీరనందనుకడకుం జనుం డని చెప్పి నట మున్న నకులుం డొక్కయరదం బాయితంబు [1]సేసికొని యుండుట నయ్యిరువురుఁ ద్వరితగతిం జని యంబుదంబుచందంబున గర్జిల్లుచుఁ గౌరవులతోడం గయ్యంబు సేయుచున్నభీమసేనుఁ [2]జేరం జని యవష్టంభవిజృంభణంబునం బొలిచిరంత నప్పాండవాగ్రజు తెఱంగేమియు నెఱుంగక నరుండు ద్రోణితోడ భరంపడి రణంబొనర్చుచుండె. 4

క. నెఱి దగఁ దేజితమైగము, మెఱుగు లడరునారసమున ! మిక్కిలివసి నే
డ్తెఱి మెఱయ నురము నొంచిన, నుఱి కవ్విప్రుండు వైచె ! నుగ్రంపుగదన్. 5

వ. వైచిన నవ్వీరుండు. 6

చ. అది దునుమాడి మేనఁ బదియమ్ములు గ్రిమ్మఱ గ్రుచ్చి నూతు వె
ట్టిద మగుకోలఁ గూల్చినఁ గడిందిమగంటిమిఁ దాన రథ్యసం

1. సేసికొనియె నయ్యిరువురుఁ 2. సేనం జొచ్చి

పదయును నూలుకొల్పికొని పార్థునిఁ గృష్ణుని నొంచె విస్మయం
బొదవఁగ దేవకోటికి నృపోత్తమ యక్కురువృద్ధుఁ డుగ్రుఁ డై. 7

వ. అట్లద్భుతవిక్రమంబున నశ్వత్థామ విజృంభించిన సహింపక. 8

చ. హయములు వగ్గనుల్ వెడఁదగయపట్టిన మగ్గఁగఁ గ్రీడి యేయుడున్
రయమున నీడ్చెఁ జేరటు దుస్తరంబునకుం దొలఁగంగ నంతయున్
భరమున నీమొనల్ గలఁగి పాఱె నరేశ్వర వారిసైన్యసం
చయ మెగవన్ మహీతలము సంభృతకంపము గాఁగ నల్లడన్. 9

ఉ. పాఱినఁ జూచి కౌరవనృపాలుఁడు సూతతనూజుతోడ నీ
కాఱియ మన్నలంబునకుఁ గాఁ దగునే వివిధాస్త్రసంపదన్
మీఱిన నీవ నూడఁగ నప్రమేయపరాక్రమ నీకు బాండవు
ల్మాఱె తలంప నీ దగుబలంబును జేవయుఁ జూపు మిత్తఱిన్. 10

వ. అనిన విని యబ్బలుమగండు మదోద్రేకంబున మద్రపతి నాలోకించి యిట్లనియె.

చ. కనుఁగొను మిప్పు డేను మురశత్రుఁ ఫాల్గుని భీమసేనునిం
దునిమెద నస్త్రసంపదయు దోర్బలవంబును శౌర్యసారము
న్జనులకు నెల్లఁ దెల్లముగ నా దగుపూనిక పార మెయ్య మే
దిని గురునాథుఁ డొక్కఁడ యప్రతిస్థిరసౌఖ్యత నేలునట్లుగన్. 12

వ. రథరథ్యగతులు నెఱయ మెఱయ వలయుం జమిమ్ము యని పలికి విజయంబు
వీక్షించి గుణంబు సారించి గాండీవంబు నీ కెవ్వారే యని యగ్గించి యవ్వాసు
పైవయి నురవడించువరసైనికులం జేరొత్తి యవల్చి భార్గవాస్త్రంబు ప్రయో
గించిన నమ్మహనీయసాధనంబు. 13

శా. ఘోరానేకశరాకృతిం బరఁగి సంక్షోభంబు గావించుచుం
దేరుల్ ద్రుంగఁగ వారణంబులు ధరం ద్రెళ్ళంగ నశ్వాళి ను
గ్రైరక్తంబునఁ దేలఁగా భటచయం బత్యంతమూర్ఛాకృతా
కారత్వంబు భజింపఁ గేళి సలిపెం గౌంతేయసైన్యంబునన్. 14

వ. ఇవ్విధంబున భార్గవాస్త్రబాధితం బై యప్పాండవబలంబు వెఱచఱచి మరలి
పఱచిన మనమూఁకలు వెన్నడిం దఱుము నానూతనందనుం డట్లేచి యార్చి
యంటం దాఁకి విశిఖశిఖలు నిగిడించుచుఁ బొగ లేనిమంటపగిదిఁ బ్రదీప్తుం
డయినఁ దదుత్సాహంబున కోటువడి యాసైన్యంబుజనంబులు హాహాకారంబు
లెసంగ దీనదశం బొంది ముకుంద పురందరనందనులం బేర్కొని యాక్రందించి
రట్టియెడ. 15

నను గృష్ణుం గప్పిన నే, ననఘా కెల వరయఁ జాల ♦ నైతి వెకసునన్. 43
క. పదపడి యొకభంగి నతని,మద మడఁచినఁ దొలఁగఁ బాఱె ♦ మానము మాలం
దదనంతరంబ నిన్ను, న్నెదకితి నరనాథ మన యుగ్రనికయములోపల్. 44
క. ఆలోఁ గర్ణునిచేతం, దూలనిచతురంగములను ♦ దొరలను ధరణీ
పాల మన మొనలఁ గానను, వ్రాలినదర్పమున మొఱయుగ్రనికయము గనుఁగొన్. 45
క. అతనిచే నీ విక్కడ, [1]కే తెంచుట వింటి నేమ ♦ మెఱుఁగుమియుఁ ద్రునై
నే తెంచితి నప్పిరుని, చేతులలా వస్తదియ్యసేన నిలుపుటన్. 46
క. మనుజేంద్ర కుశలి వగునినుఁ, గని నామన మూఱడిల్లెఁ ♦ గావున మాకుఁ డం
జనిమొనఁ గొనియెద రాధా,తనయునితల నలను నెఱయ ♦ దర్పము మెఱయన్.
క. ననుఁ జూడుము వేడుకకుం, జను దెంచి భవద్బలంబు ♦ సంశన మందం
దునిమెదఁ గర్ణుని దుర్యో,ధనుకోర్కియు నీమనంబుగ్రతాపంబుఁ దీఱన్. 48
మ. ధనురాచార్యునిచావు నూచి తగ రాగ్రధానందనుం డా సుయో
ధనునిం దమ్ముల వారిసైన్యములనుం ♦ దాఁ గాచువాఁ డై రణం
బునకుం బూనుట నింత సేయ వలదే ♦ భూపాల యేపారి యుం
డునె యాఱం గలదీపమ ట్లతఁడు మంగ్రడుం గాక యే నార్చెదన్. 49
చ. నరవర పంపు మేను బ్రథమనంబున కేఁగిన నూతసూనుఁ డు
ద్ధురత నెదిర్చెనేనిఁ దల ♦ ద్రుంపక తక్కిన విప్రుతోడ ని
ష్పురుసున నిచ్చువాఁడ నని ♦ పల్కిపదంపడి యాక తక్కు దు
ష్పురుషునిఁ జూచుమాడ్కి ననుఁ ♦ జూడుఁడు నీవును వాసుదేవుఁ డున్. 50
వ. భీమసేనునకు సేనాముఖంబునఁ దాన నిలుచుట భరం బయి యుండును నేనునుం దడయుట గర్జంబు గాదు పోయెద ననిన విని యమ్మనుజపతి గర్ణుండు కుశలి యై యుండుట యెఱింగి యతనిబాణంబుల నొచ్చినవాఁ డగుట నలుక గదిరి యక్కిరీటితో ని ట్లనియె. 51

—✿ ధర్మరాజు గర్ణుండు బ్రదికి యున్నవాఁ డని విని యర్జునుని నిందించుట. ✿—

క. అనిలోఁ దెరలుట దొలఁగుట, యనునవి నకుఁ గాక నొచ్చి ♦ నైనను గల [2]నె
ల్లను వెకలఁ జను నే యే న,ట్లును గాకిట వచ్చుటం జుగ్రలుక నై తిఁగనున్.
క. విను కర్ణున కే నోడితి, నన నేటికి నీవు నోడి ♦ తనిలజ మూ ద్రి
తనయులు మున్నే యోడిరి, మనతోఁ గూడంగఁ గంగ[3]మర్దియు నోడెన్. 53
క. కావున మన మింక ననికిం, బోవం బని లేదు విపినభూమికిఁ జని యు
చ్చో వెఱవు దక్కి తపసుల, మై విచ్చలవిడిఁ జరింత ♦ మందఱముఁ దగన్.
క. కాదేని బిరుదు లాడక, సాముల మై వినయ మొప్పఁ ♦ జని కురునాథుం
డేది వనిచినను జేసి ద,యాదృష్టి నతండు మూ మగన ప్పుండఁ దగున్. 5

1. 'యే తెంచుట' అనియే వ్రా. ప్ర. 2. నెల్లను. 3. మర్దనుఁ డోడెన్.

ఆ. కౌంతికడుపునందుఁ గొడుకులఁజాలై నీవు, ద్రోపకుండ వైతి తోఁచినట్టి
పిండ మొదలి వైనఁ బినప దిగంబక, దమ్మోయింక పుట్టి దట్టు లైన. 66

— ✿ { అర్జునుఁడు దన్నుఁ ధర్మజుఁ డాడినపలుకులకుఁ గోపించి యతనితల నఱుక వాలు వెఱికికొనుట. } ✿ —

సీ. అనినఁ గృపాణంబు గొని సవ్యసాచియు, విభు వ్రేయఁదలఁచిన విష్ణుఁ డెఱిఁగి
వాలు గేల నమర్ప వలసినకత మేమి, కౌరవు లియ్యెడ లేరు మనము
ధరణీశ్వరుని సేమ మరయంగ వచ్చితి, మీతనికుశల మిం తెప్పుడంగఁ
గంటిమి సంతోషకాలంబు గాక యిది, క్రోధకాలమె వధ్యకోటి యిచట
ఆ. నేది గాఁగ నలిగి తీవని పలికిన, రోషభంగి యగుకరటాటుదృష్టి
యానరేంద్రునిఁ గాంచి యసురంగ నర్జునుఁ, డచ్యుతారి కిట్లు ననియె నధిప. 67
క. విను మొరులకు గాండీవ మి, మ్మని యన్నిన్నాఁడు పలికె నతనిశిరము గ్ర
క్కునఁ బడఁగ వ్రేయుటకుఁ జేసినవాఁడఁ బ్రతిజ్ఞ నాదుచిత్తములోనన్. 68
తే. ఇట్టికష్టపుఁగేలి కై యిట్లు సేయఁ
బ్రతిన వట్టుట దగదె యిప్పలుకు నీవు
వినఁగ నితఁ డాడ నిమ్మహీవిభుఁడు ధర్మ
వంతుఁ డగుఁ గాక చంపనవలయుఁ గృష్ణ. 69
వ. చంపి పాలితప్రతిజ్ఞుండ నైననాకు నసత్యంబు రాకుండఁ బరిహరించెద దీనికి నీ వేమి సెప్పెదవు సెప్పుము జగత్కృత్యసాకల్యవేదివి నీచెప్పినట్ల చేయంగల వాఁడ ననుటయు నచ్యుతుండు పో పొమ్మెక్కడివాఁడ వని యదల్చి వెండియు ని ట్లనియె. 70
ఆ. నీకు వృద్ధసేవ లేకున్కి యెఱుఁగంగ, నయ్యె రిత్త యిట్టు లడిచి పడుటఁ
బట్టి ధర్మవిధివిభాగజ్ఞులైనవా, రేల చేయఁ జొత్తు రిట్టిదాని. 71
క. చేయంగ వలయువానిం, జేయుట యిట్టివియె కొన్ని చేయ కునికి ధ
ర్మాయత్తచిత్తుఁ డైనా, నాయోగ్యస్థలము లెఱిఁగి నడవంగ వలదే. 72
క. సత్యంబు నహింసయు నను, నత్యుత్తమధర్మయుగళమందు నహింసా
సత్యము గాచుట ధర్మ, మ్మసత్యమున నహింస గావఁ జను నండ్రు బుధుల్. 73
ఆ. కర్మమార్గభంగి గానక యిమ్మెయి, సత్యరక్షణంబు సలుపుపొంటె
భ్రాంత ధర్మపరుఁడు రా జిమ్మహాత్ముఁ జంపఁ దలఁచుట ధర్మపథము గాదు.
క. విను పిన్ననాఁడు నీ వీ, యనుచిత మగు వ్రతము వట్టి తది గాక యు బె
ట్టనృతము సూనృతమును నీ, కనిరెఱుఁగుచందంబు బుధులు గయికొన రెందున్.
వ. అది యెట్లంటేని. 76
ఆ. ప్రాణహాని వచ్చుపట్టున సర్వధ, నాపహారవేళయందు నడవు
సత్యమనృత మండ్రు సత్యంబు సూనృత, మనిపరిగ్రహింతు రార్యజనులు. 77

వ. విను పెద్దయును వినికి లేనివాఁడు కౌశికుం డనునొక్కవిప్రుం డొక్కవిశిష్టగ్రామం
బున కనతిదూరంబున సరిత్సంగమపుణ్యక్షేత్రంబున వసియించి సత్యంబ పలుకు
వాఁడ నని వ్రతంబు పట్టి సత్యవాది యనం బ్రసిద్ధుం డయి తపంబు సేయు
చుండ నొక్కనాఁడు ముచ్చులం గని వెఱచఱచి పఱతెంచినజనులు గొందఱ
ఆయాశ్రమంబుచేరువఁ బొదలం దూఱి రంత వెనుదగిలి వచ్చుముచ్చు
ల త్తపోధనునికడ కేతెంచి యిప్పు డిట వచ్చినవార లెట వోయి రని యడిగిన
నతండు సత్యవిభాగవిధిజ్ఞుండు గామిం జేసి తన కసత్యంబు వాటిల్లు ననుశంక
నీ గుల్మలతాగహనంబు సొచ్చి రని చూపి చెప్పిన నత్తెక్కలికాండ్రు వారలం
జంపి ధనమ్ముఁ గొని రమ్ముని తద్వచనదోషంబున నరకప్రాప్తుం డయ్యె ననునితి
హాసంబు విందుము హింసాకరం బగుసత్యంబు ధర్మంబు గాదు తొలుత వినిన
దానిన పట్టి మూఢుండు పెద్దల నడిగి తెలిసికొనక వర్తించి దుర్గతిం బొందు
నింతవట్టు విచారించి యజాతశత్రుండు వధ్యుం డవుం గాఁ డని నిశ్చయింపు
మనుటయు నర్జునుం డి ట్లనియె. 78

తే. తల్లిదండ్రులమాఁడ్కి హితంబు సెప్పి,నన్ను ననుచితకృత్యంబునకుఁ దొలంగఁ
ద్రోచితివి లోకమున నీకు గోచరంబు, గానిధర్మవిబోధంబు గలదె కృష్ణ. 79

క. జనములు వృథాప్రతిజ్ఞుం, డని నను నిందింప కుండ నగ్రజుఁడు సుఖం
బునికియుఁ గలిగెడునట్లుగ, నను గ్రహముఁ జేసి చేయునది పనుపు దగన్. 80

వ. అనిన నతం డతని కి ట్లనియె. 81

కృష్ణుఁ డర్జునునిఁ బ్రతిజ్ఞాభంగంబు గాకుండ ధర్మజు దూఱు మని చెప్పుట.

చ. అతిశితకర్ణబాణహతి నంగము నొచ్చినదాన నల్గియి
వృతి నిను నొవ్వఁ బల్కు టిది ప్రాభవ మింతియె కాక నీ యెడఁ
మతిఁ బటుకోపముం గలదె మారుతసూనుఁడు నీవుఁ దమ్ములుం
జతురవినీతి నీతనివశంబునఁ గాదె చరింతు రెప్పుడున్. 82

క. కావునఁ బ్రభుత్వసంపద, నీవిభుఁ డాడినది యెల్ల నెగ్గుఁ గొనక నా
చే వినుము నీదుప్రతినకు, నేవిధి సేయ నగు దాని నేర్పడ ననఘా. 83

క. నీ విట్టివాఁడ వని ధర,ణీవిభునిం బలుకు మదియ నీచంపుట సం
భావించి పిదపఁ బ్రణతుఁడ,వై వినయము సేయు చిత్త మలర నతనికిన్. 84

వ. అ ట్లయిన నసత్యదోషంబునకును గురువధపాతకంబునకుం దొలంగి సమాహి
తుండ వగుదు తదనంతరంబ కర్ణుని సమయింపఁ జనుటకు ని మ్మనుజపతియను
మతి వడయుద మనుటయు నప్పలుకుల కభినందించి పురందరనందనుండు ధర్మ
నందను నుద్దేశించి. 85

మ. కవచత్రుంబుల నుజ్జ్వలోద్భటగదాఘాతంబులం గాలఁ గే
లను విద్విట్చతురంగసంఘములు గూలం గేలి సల్పంగఁ జా

లినయాభీముఁడు వల్కఁగాక నను ద్రోహక్లిలాసముగ్రుండ వై
యనిలో నిల్వఁగ లేని నీవిటులు కీడాడంగ నర్హుండ వే. 86

క. నన్నెఱిఁగి యెఱిఁగి యిట్లనఁ, జన్నె నిజిహ్వ వెక్కుసకలము లై పో
కున్నది యే లోకో రణమున, నెన్నఁడు నీ వేమి సేసి తింత యనుటకున్. 87

క. నకులుఁడు సహదేవుండును, బ్రకటభుజాస్ఫురణమున నరాతిబలము నే
లకుఁ గూలకుఁ దెత్తురు నో,రికి వచ్చినయట్లు లాడెదరే యిబ్భంగిన్. 88

సీ. నీవు జూదం బాడఁగా వైరబంధంబు, గౌరవజాతితోఁ గలిగె మనకు
రాజ్యనాశంబు నరణ్యవాసంబును, దాస్యదైన్యంబు నత్యంతదుఃఖ
ములుఁ దెచ్చికొంటి సిగ్గొలఁకుడు నీమనం,బున నించుకేనియు ననికిఁ జాల
కున్న వానికిఁ దాల్మి యొప్పగుఁ గాక ప్రల్లదములు పలికిన లాఘవంబు

తే. సెందుము న్నేమి సేసినఁ జేసి తింక
నైన దుర్బుద్ధితనములు మాని తగిన
పౌరుషము లేము సేయఁగ నూర కుండు
మిడుమ వడువారు నైతురే యింతవట్టు. 89

వ. అని యగ్రజు నప్రియంబులు వలికి యంతరంగంబు సంతాపంబు వొంద నిట్టూ
ర్పు నిగిడించి యంతకము నొఱఁ బెట్టినవాలు వెఱికినం గనుంగొని పద్మనా
భుండు గ్రమ్మఱ నిది యేమి యని యడిగిన నతం డే నిన్నరనాథు నో నాడిన
పలుకులకుఁ బ్రాయశ్చిత్తంబు దలఁద్రెంచుకొనుటయ కా నిశ్చయించితి ననుటయు
నమ్మహాత్ముఁ డాత్మప్రశంస సేయు మది మరణం బని పెద్దలు సెప్పుదు రనుటయు
నీచెప్పినట్ల చేయ కునికికిం గడచిన యధర్మంబును గలదె యట్లు సేయువాఁడన
కాక యని యా ధనంజయుండు ధనుర్ధరుం డై ధర్మనందనున కిట్లనియె. 90

ఆ. హరుఁడు దక్కఁ జాపధరుఁ డొరుఁ డెన నాకుఁ
ద్రిభువనముల లేఁడు దిశలు గెలిచి
తెచ్చి నీకుఁ బ్రీతి నిచ్చితిఁ బెనుపారు
ధనము రాజసూయదక్షిణలకు. 91

వ. దీప్తప్రతాపం బగుసంశప్తకసంచయంబు నడఁగించి కించిదవశిష్టంబుగా నష్టం
బు సేసితిఁ గురుసేన నాచేతం గూలి యెట్లున్నదియో యటుసూడు మని పలికి
మొగంబు బిగువుడిపికొని సవినయంబుగా దండప్రణామంబు సేసి నిలిచి చేతులు
మొగిడ్చి యజాతశత్రున కప్పురుహూతపుత్త్రుం డిట్లనియె. 92

క. నను సుప్రసాదదృష్టిం, గనుంగొను మేనిపుడు గొన్నికాఱులు లఱచితిఁ
మనుజేంద్ర వానిఁ బెడచెవులను బెట్టుము వేఁడుగాఁ దలంపక దయతోన్.

తే. వినుము సత్యంబ పలికెదఁ దనువుఁ బ్రాణ
ములును నీసొమ్ముగా మదిఁ దలఁతు నేను

నాదువృత్తంబు భవదధీనం బనంగ
నేల యనుపుము నను భీముసాటి కధిప. 94

క. ఓపి యాతనిరణభారము వాపెదఁ గౌరవ్యసేన బాహులువఱచి సా
టోపతఁ గర్ణునిఁ దునిమెద, మాపెదఁ గురురాజుదురభిమానము బలమున్. 95

వ. ఎల్లభంగుల నేఁడు రాధేయుం బుత్త్రరహితుం జేసెద గాదేని గొంతియైన నట్టిద
యగుం గాక. 96

చ. అన విని యమ్మహీరమణుఁ డాతని కిట్లను మీకు నాకలం
బున బహుదుఃఖముల్ గలిగె భూరికులంబున క్షత్త్రియుం బొన
ర్చినయవినీతుఁ బాపపరుఁ డేయుఁ దగుం దల ద్రెవ్వ నీమనం
బునఁ గృప పుట్టె నా విని బోయెద నిప్పుడ యేను గానకున్. 97

క. ననుఁ దొఱఁగి నీవు సౌఖ్యం,బున నుండుము సమరభీరు భుజబలహీనున్
జనపతిఁ గాఁ జేకొనుటయొ,ప్పునె కట్టుము పట్ట మనిలపుత్త్రునిఁ బ్రీతిన్. 98

వ. అని పలికి సెజ్జ డిగ్గి వనవాసగమనోన్ముఖుం డయినం గనుంగొని కమలనాభుం
డాభూపతిచరణంబులకుం బ్రణతుం డై యి ట్లనియె. 99

సీ. నరునిప్రతిజ్ఞ భూవర మున్నె యుంగని, యింతియ [1]కా దేను నితఁడు నిప్పు
డాడినమాటలు నంతరంగంబునఁ, బట్టవు పేర్చుకోపమున నీకుఁ
దను నెవ్వఁ డుడిగి యన్యునకు గాండీవ మి,మ్మని ధిక్కరించె నాతని వధింప
బ్రతిన [2]వట్టినవాఁడు భావ్యంబు గానియ,ప్పలుకు లీవు పలికితి పరమధర్మ

ఆ. మైనసత్యనిష్ఠహానిఁ బొందుట కోర్వ, కునికిఁ జూచి యేన యుల్లమునఁ ద
లంచి యిట్లు పలుకఁ బంచితి గురునిఁ గీ, డాడుటయు వధించు టగుటఁ జేసి. 100

క. శరణము వేఁడెద నను భవ,చ్చరణంబులు పట్టికొని నిసర్గదయాని
ర్భరబుద్ధిని గావుము మ,మ్మిరువుర నీతప్పు సైఁపు మెల్లవిధములన్. 101

క. సూతసుతుని మొనసేత్తురు, భూతలమున నివుడు నేఁడు భూనాయక నీ
వాతనికి నలిగినప్పుడ, చూ తెగియెం బూని [3]యేన సుమ్మపలికెదన్. 102

క. విను సత్యం బాడెదఁ బార్థునిచే నేఁ డెల్లభంగిఁ జనుమూంబను క
ర్ణుని దెసఁ జింతయు వంతయు, మను జేశ్వర విడువు వంపు సమ్ముఁ దెలివితోన్.

— ధర్మరాజు గృష్ణునివాక్యంబులం గాంక జేత ప్రసన్నుఁ డగుట. —

వ. అనుటయు ధర్మనందనుండు ససంభ్రమంబుగాఁ గృష్ణు నెత్తి యతండు ప్రాంజలి
యై యుండ నతని కి ట్లనియె. 104

క. ఇది యట్టిద మానంబునఁ, బదిలుండఁగా కేను మున్న పదిరినకతనన్
హృదయము గలఁగిన నాకె,య్యది యును గోపమి వికారి నైతి మహాత్మా. 105

ఆ. ఇట్టినన్ను ననునయించి బోధించితి, కరుణపేర్మిఁ జేసి గారవమున

1. కాదు ని ♦ న్నీతఁ డిప్పు. 2. పట్టినవాని. 3. 'యేను ♦ సుమ్ము' వ్రా. ప్ర.

నజ్ఞు లైనపుష్యుత్ర ♦ నాపద్ప్రయోనిధి, మునుంగ కుండఁ దేర్చి ♦ తనపుమూర్తి.

వ. అనియె నప్పుడు విషణ్ణం బగువదనంబు వాంచి యున్నభూపాలుం జూచి వాసుదేవుండు నీ విట్లు విషణ్ణుండ వగుట గర్జంబుగా దుర్యోధనపతిముఖప్రసాదం బభినందించి యనుమతి వడసి చని రాధేయవధవిహారంబున నిరసికిం బ్రియం బాపాదింతుఁ గాక యింకఁ దడయు నేల యని పల్కి వెండియు. 107

ఉ. ఈతని నొవ్వఁ బల్కుటన ♦ యీదురవస్థకు వచ్చి తక్కటా
ఘాతమహాసి నీనృపతిఁ ♦ జంపిన నెల్లగుబో నివృత్తికిం
బాతకఘోరవృత్తికిని ♦ బాసితి దైవ మనుగ్రహించుటన్
నీ తెలి వాప్తబంధుజనసన్నిర్మితపుణ్యవిపాక మర్జునా. 108

వ. అనిన నతండు గన్నీ రొలుక నచ్యుతపాదంబులపైఁ బడిన నత్యాంశవాగ్రజుండును బాష్పప్లావితముఖుం డగుచు నతనిమీఁద నొఱగె నిట్లిద్దఱు నొండొరులం బట్టికొని యేడ్చి రచ్యుతుం డుడుగ నుడిగి తత్కాలోపగతసముచితపరిజనానీత జలంబుల ముఖప్రక్షాళనంబు సేసికొనిరి తదనంతరంబ ధర్మనందనుండు దమ్మునిం గౌఁగిలించుకొని మూర్ధాఘ్రాణంబు సేసి చిఱునవ్వుతో మనల నింత వఱచునే కర్ణుం డని పలికి మఱియును. 109

ఆ. ఎల్లఁ జూడ సిడము ♦ విల్లు నశ్వంబుల, సూతుఁ దునిమి నన్ను ♦ నాతఁ డలవు
నెఱయ గెలిచె నతని ♦ ని విష్ణు నంపక, యున్న నాఁడు బ్రదికి ♦ యుండఁ దగునె.

చ. అనవుడు నమ్మహీపతికి ♦ నర్జునుఁ డిట్లను నేఁడు కర్ణు నే
ననిఁ బడ వైతు నీయనుగు ♦ లాన తదీయసుహృద్గణంబుతోఁ
విను మటు సేయకే మగిడి ♦ వెల్వెలఁ బాఱెను మానుతోడ వ
త్తునె యిట కృష్ణసారథియుఁ ♦ ~~[illegible]~~ దూలనె మానవిహీనవృత్తి యై. 111

వ. అని గోపాలదేవు నాలోకించి నీమనంబునం గర్ణుండు దెగటాఱె వలయు నని యించుక దలంపుము దాన నే నతని వధియింతు ననిన నమ్మహాత్ముం డట్టిపనికిం జాలుదు వని యుత్సాహదీప్తుం డై పలుకుటయుఁ బార్థుండు నిజరథంబు సవిశేషకల్పితంబు సేయించి రథ్యంబుల జలపానఖాద్య[1]ఖాదనంబులం బ్రబలంబులఁ గావించి పూన్చించి యుగ్రజు పీఠ్యాని గమనోన్ముఖుం డగుటయు నచ్యుతుం డవ్విభు నీక్షించి నీతమ్ముని గారుణ్యార్ద్రకటాక్షంబుల నిరీక్షింపుము దీవన యిచ్చి పనుపు మని చెప్పిన నన్నరవరుండు గిరీటిం దిగిచి బిగియార కౌఁగిటం జేర్చి నీవు కృష్ణుపనుపునం దగుమాట లాడి తత్తెఱంగు నేనునుం దెలిసితి నా యెఱుంగమి నిన్నుం బలికినపలుకులకు నమ్మలింపకుమీ యనుటయు నతండు వికసితవదనుం డగుచుఁ దత్పాదద్వయంబు ఫాలంబు సోఁకం బ్రణతుం డయిన నమ్మానవపతి యెత్తి పునఃపునరాలింగనంబు సేసి కర్ణునిగెలువు

1. ఖాదనంబులం.

విజయ నీకు విజయంబు శాశ్వతం బగుఁ గాక యని దీవించిన యమ్మేటిమగండు నాఁటో
షంబుగా దేవ నిన్ను నొప్పించితిఁ బాపకర్మ మహాద్రోహకము క్తశిలీముఖంబులం
బొలివుచ్చి యిదె వచ్చెద ననుచు నంజలిపుటంబు ఫాలంబునఁ గదియించి
వీడ్కొనియెఁ దదనంతరంబ దామోదరుండును నమ్మరుండును నరదం బెక్కి
యలఘునల్లంబులతో నరిగి శుభప్రసంగంబు లాపనిమిత్తంబులకుం బ్రమోదంబు
నొందిరి పదంపడి రాధేయువధప్రకారచింతాక్రాంతుం డైన గాండీవితనువునం
బ్రస్వేదకణమ్ములు గ్రమ్మినం గనుంగొని కమలనాభుం డతని కిట్లనియె. 112

ఆ. అమరులకు నజయ్యు లగువారిఁ జెండి, గెలిచి తీవ్ర నీకుఁ గల యుదాత్త
దివ్యబాణములు సుదీర్ణధనుర్వేద, కౌశలంబు బలముఁ గలదె యెందు. 113

చ. అమరనదీతనూభవుఁడు నస్త్రగురుండు భవన్మహోగ్రది
వ్యమహిమలో నడంగిరి జయద్రథుఁ డావధి కాద్భుతంబు మ
ర్త్యమునన కాదు లోకముల నన్నిట నీ కెన రెవ్వ రేల చి
త్తమునఁ గలంక యాజమున దర్పము నెక్కుడు నంతకంతకున్. 114

క. బలమును శౌర్యముఁ దేజముఁ, గల డని కౌరవుఁడు నమ్మ కర్ణుని నీతోఁ
దలపెట్టిరి నీబాణం,బుల గూలెను నతఁడు కీర్తిఁ బొందెదు నిన్నున్. 115

క. కురుపతియాశలు మాలఁగ, దురమున రాధాతనూజుఁ దునుమాడి జయ
స్ఫురణంబునఁ గృతకృత్యతఁ, బొరయుము నీవారు మోదమునఁ దేలంగన్.

వ. అని వెండియు. 117

ఉ. కౌరవసైన్య మగ్గలము గాదె కడున్ భవదీయసేన క
వ్వారణకోటు లాతురగవర్గము లారథసంచయంబు లా
వీరభటావళుల్ బహుళవిక్రమకౌతుకి నైపుణీశరా
సారములన్ బడల్పడఁ గ్రుంకెం బలు లిప్పుడు నీకుఁ దోఁపదే. 118

క. కురుసేనలకుం బతి యై, సరిత్సుతుఁడు పదిదినములు సమరము సేసెన్
శరమహిమ నతఁడు నీచేఁ, బరిరథితుఁ డైనసైన్యపాలు మిగిలెనే. 119

చ. అతని శిఖండిబాణముల కగ్గిర సేసితి ద్రోణునిం జమూ
పతియగుఁ జేసెఁ గౌరవనృపాలకుఁ డగ్గురుఁడున్ భవచ్చమూ
పతి నడఁగించెనే దివసపంచక మిమ్ముఁ బోరి తావకా
ప్రతిహతబాహుశక్తి యిరువాఁగును జూడదె పాండవోత్తమా. 120

క. భీమునిరథవిహరణ ముద్దామం బగు టెల్ల నీసుదర్పంబునఁ గా
దే మాఱు లేనిభవద, స్త్రామేయబలంబు దెలియ సంతసము నాకున్. 121

వ. కృపాశ్వత్థామకృతవర్మకర్ణశల్యులు నీచేతం బోయెడువారు కృపాశ్వత్థామల
జెనం గృప సేసి తేనియుం జంపక గెలిచి విడుము చుట్టం బని యరవాయి

గొనుట కర్ణంబు గాదు కృతవర్మను సమయింపుము శల్యుండు మేనమామ యై
నను బగవారిం గూడి పరాక్రమించుచున్నవాఁడు గావున నతని వధియించుట
పాపం బని తలంప వలవదు కర్ణుండు జతుగృహదాహంబును గపటద్యూతోత్సా
హంబును లోనుగాఁ గలదుర్యోధనుదుర్నయంబులకు మూలం బట్లుఁ గాక జూదం
బునప్పు డాసభలోన ద్రౌపది నుద్దేశించి యప్పాపాత్ముండు. 122

క. లే రిచట మగలు నీకును, వీరలు జూదమున నోడి విడిచిరి నిన్నున్
వారిజలోచన నీపైఁ, గూరిమి గలమగని వెదకికొను మెఱుఁ ననఁడే. 123

తే. ఏను సంధికిఁ బోయినఁ దాను ధార్తరాష్ట్రమానసములఁ బగ రాఁజఁ బెట్టి
నన్నుఁ బట్టింపఁ జూడఁడె యెన్నఁడైన, నాఁడికారణ మతఁడ మీకయ్యాపదలకు.

చ. వినుము సుభద్రపట్టి బలుకవిల్ మును వంచన వాఁడు డాసి త్రుం
చిన మఱి కాదె యందఱును జేరి వధించుట యీ పరాభవం
బనలముపోలె నున్నది యహర్నిశముం బరితాపకారి యై
మనమున నస్త్రవృష్టి నది మాన్పుము బంధులు మోద మందఁగన్. 125

క. ఆ సభ నాదుష్టాత్ముఁడు, సేసినదుర్నయము సూచి చిత్తమునఁ గడుఁ
[1]నోసినబంధులు వానిని, గాసిగ గ్రద్దగమి దోలువఁ గనుఁగొన వలదే. 126

వ. వాఁడు వడినం దక్కటిరాజులుం గౌరవులు నీకు మొనకట్టరని చెప్పి యిట్లు సెప్పు
చు సమరస్థలంబున కనతిదూరంబుగాఁ జని యత్తెత్తిచూచి కర్ణుండు సంగరంబు
సేయుసంరంభం బుగ్గడించి యగ్గాండీవికిం జూపి పుండరీకాక్షుండు. 127

క. కేతనము రథముఁ దురగవ్రాతముఁ బొడిచేసి నిశితశరంబులఁ గర్ణున్
వే తునిమినఁ గని శల్యుఁడు, వాతెఱ యెండంగఁ బొఱ్ఱవలదె కిరీటీ. 128

వ. పూనిక నెఱపి శోకం బుజ్జగించి లోకంబు సంస్తుతింప సుఖవి గమ్మనినం బ్రము
దితహృదయుండై. 129

శా. నీతోడ్పాటున నేఁ ద్రివిష్టపముల న్నెల్లంగ నూఁకింతు నా
చేతం గర్ణుఁడు రూపుమాలి చను మెచ్చింతుఁ గా నినుం జూడుమీ
దైతేయాంతక యంచు శేషనిభహస్తం బుద్ధతిం [2]జాఁచి ని
ర్ధూతారాతిబలుండు పుచ్చికొని యొక్కన్ దుర్దాంతకోదండమున్. 130

అర్జునుఁడు కృష్ణునివాక్యంబులచేఁ గర్ణువధ కుత్సహించుట.

వ. ఇట్లు గాండీవం బెత్తి యెక్కు వెట్టి యర్జునుండు నేఁడు నాబాణంబులు బాణాస
నంబును నరదంబునుం జూచి సుయోధనుండు శకునియుడ్డసాళ్గను బలకయు బ్రమ్మం
డపంబును దలంపవలయుఁ దననమ్మినబలం బైనకర్ణుండు నే నేయుతూపులతాఁకున
రూ పడంగినం గని యవ్వెంగలి దాను విదురుబుద్ధి వినమికి వగం బొంద వలయు
ధృతరాష్ట్రుండు దనకుం గార్యదర్శనంబు లేమి యుగ్గడించి తన్ను నిందించికొన

1. మోసిన; క్రోసిన. 2. జాచి.

వలయు నతండు గొడుకులఁజెనను వారు రాజ్యంబుఁజెనను విగతాసులు గావలయు నని పలికి మఱియును. 131

ఆ. రాజరాజుఁ జూసి రాజ్యసంపద ధర్మ,తనయుఁ జేరు పెంపు దారు దెలియఁ
గాంచి సాత్యకియును గవలును భీముండు, గారవించువారు గాక నన్ను. 132

క. సురగరుడోరగవిద్యా,ధరాదిభూతములు సూతతనయుని నేఁ డేఁ
జౌరి వృచ్చిన ననుఁ బొగడుచు, నరుఁ గుంగ గా కునికపట్ల కంబుజనాభా. 133

వ. అని యిట్లు సల్లాపంబు సేయుచుం గృష్ణార్జునులు నిజసేనఁ జేరి రంతకు మున్న యిరువాఁగునం జేయం గలదొరలు దలంపడినం బోరు ఘోరంబయ్యె నందు. 134

సీ. కర్ణసూనులలో నొకం డుత్తమౌజుని,చేతఁ జచ్చుటయు శోకాతురుండుఁ
గ్రోధదీప్తుండు నగుచుఁ గర్ణుఁ డాతని,తురగ కేతనములఁ దునుమ నాతఁ
డడిదంబు సేకొని యరదంబు డిగి కృపా,చార్యురథ్యంబులఁ జంపి భీమ
వైరితే రెక్కె నాశారద్వతుం డట్లు, విరథుఁ డయ్యును బలువిడిఁ గడంగి

ఆ. నతఁడు పాదచారి యని యాశిఖండి య,చ్చిప్పు సేయఁ డయ్యె వేగ మొద్ది
ద్రౌణి యతనిఁ దనరథంబుపై నిడికొని, యనికిఁ దొలఁగిచని యెమనుజనాథ. 135

వ. అట్టియెడ. 136

చ. అనిలసుతుండు దీవ్రవిశిఖంబులు పర్వఁగ నేచి యంబరం
బునడుమఁ జేజరిల్లురవిఁ బోలెనువేఁడిమి కోహటించి నీ
మొన దెరలంగ నారథికముఖ్యుఁడు పార్థుఁ దలంచి సారథిం
గనుఁగొని మానసంబు దలఁకంగ రణోగ్రత దక్కి యిట్లనున్. 137

క. నరుఁ డన్నపర్తనము తెలుఁ, గరయుట కై మదిఁ గలంగ నట చనినాఁ డ
న్నరపతిమూర్ధ గని దు, స్తరశోకం బడరి తానుఁ దనదవస్థః డగుఁగా. 138

తే. అయ్యిరువురకు నొకటి యైనట్టిదైన, మనము కౌరవసంఘంబు మగ్గఁ జేసి
గెలుపుగొంటిమ యేనియుఁ ఫలముదాన, నేమిగల దనువగఁజిత్త మెరియఁజొచ్చె.

—: భీముఁ డర్జునురాకఁ గోరి విశోకునితో విచారించుట. :—

క. వినను నిప్పటిదుఃఖము, మానింపఁగ మనకు నొండుకమం దెయ్యది యీ
సేనల దొరలను గౌరవ,భూనాథుని సమయఁ జూచి పోవుట దక్కన్. 140

వ. అని పలికి యవ్విశోకునకు మనదిక్కు నిడంబులు సూపి యవి యెవ్వా రెవ్వారి చిహ్నంబు లేర్పడం జూచుకొనుము మనశరంబులకొలఁది యెట్లున్న దరయు మనవుడు నతండు నీ రెవ్వరైన రేమి నీ వలిగినఁ బతక పాటక నిలువం జాలువాఁ డిం దెవ్వం డస్త్రశస్త్రంబులసంపద యరుగ వలదు నేఁడు దెచ్చినవానిలోన నాతెప్పుమ్రేఁగుపడి పూని వచ్చుబండి యొక్కటి ఖుంచుకయు వెలితి గాక యున్న యది గాక యున్న నేమి భవద్బాహుదండంబునకు మూలధనం బైనగదాదండం బెల్లపనికిఁ జాలునని చెప్పినఁబవమానసూతి యాసూతుచే సేతనప్పళించి.

ఉ. వేడుకఁ జూడు మేను బటుశౌర్యవిక్రమకౌతుకలీలఁ బేర్చి చెం
డాడెద వైరులన్ విదురుఁ డప్పుడు సెప్పఁడె జూద మిట్లు గా
నాడెను రాజరాజు కట యాప్రతినల్ గడతేర్పఁ గాక బొం
కాడునె ధర్మజావరజుఁ డంచుఁ దమాప్తులు వంతఁ బొందఁగన్. 142

వ. అని వెండియు. 143

ఉ. ఉత్తమకర్మ మిట్టి దని యొక్కరుఁడుం దగఁ జెప్ప [1]లేఁడ నా
కిత్తఱి నేన పోలుతెఱఁ గెల్లను జేసెద నట్లుఁ గాక నా
చిత్తము మార్గవర్తియుఁగ శిక్షక మయ్యెడు దైవ మంచు న
త్యుత్తి భవద్బలంబుపయి నెల్లను జూపదరించె నేపునన్. 144

వ. ఇట్లు గలయం గనుంగొని యద్దిక్కుఁ గలగుండు గొనుట యెఱింగి విశోకునితోఁ గౌరవసైన్యంబు మనము దఱుముకయు తాన కలంగెఁ గెలనం గవ్వడి గదిసెనో కాక యనుటయు వాఁడు నిపుణంబుగా నిరూపించి మోదంబునం బొదలుచు. 145

క. నరుఁ డదె కంటే కౌరవ, కరిసేనం గవిసెఁ గేతుకపిరుచు లంబో
ధరబృందముపైఁ గలయం, బరఁగుతటిల్లతలఁ దలఁపఁ బట్టయి నిగుడన్. 146

క. హరిమేనికాంతియును నరు, కిరీటరత్నాంశువులును గిటిగొన రథర
థ్యారుచులు బెరసి విచిత్ర, స్ఫురణంబునఁ దేజరిల్లెఁ జూడు కుమారా. 147

వ. అనిన విని యంతరంగంబు సంతోషమయంబుగా నంగంబుపొంగ నేర్పడ నాలోకించి విశోకునకు వృకోదరుం డిట్లనియె. 148

తే. వరపుడుల నూర్వురను మేలిహవాజు లిరువ, దింటి నూళులు పదునాల్గు నిత్తు నీకుఁ
బనదనము నీవు నాకు భీభత్సు రాక, సూపి ముద మొనరించితి సూతవర్య. 149

వ. అనియె నప్పుడు వారణఘటావిదారణంబు సేసి వాసవి వాసుదేవుతో మన తేరు భీమసేనుఁ జేరం బోవ నిమ్మనుటయు. 150

క. అతఁడు హరులఁ దఱుముఁగ ను, ద్ధతిఁ జను నెడ మనబలంబు దర్పమహోగ్రా
కృతిఁ బొదివినఁ జతురంగ, ప్రతతుల నన్నరుఁడు నేలపాలుగఁ జేసెన్. 151

ఆ. మందరంబుచేత మథిత మై తిరుగుసా, గరముసులివు గెలిచె ధరణినాథ
పార్థుఁ డురవణింప బలువడిఁ [2]గలఁగెడు, కౌరవేంద్రసేన[3]కలకలంబు. 152

వ. కేతుచామరాతపత్రభూషణశకలంబుల నాశౌర్యభూషణుండు రణక్షోణికి విభూషణం బాచరించె నట్లు కర్ణవధంబునకు వేగిరపడి తఱుము నుఱుక మన మొన వెండియు నొండొండ వయిం గ్రమ్మిన నమ్మేటిమగండు. 153

క. పేరు గలరథికముఖ్యుల, సారథిరథరథ్యకేతుసహితంబుగ దు
ర్వారవిశిఖ[4]విస్ఫురణవి, హారంబున శతచతుష్టయము పొడి చేసెన్. 154

1. రై రి; వేళ 2. గడఁగెడు. 3. కళవళంబు. 4. 'విస్తరణ' అనియే. వ్రా. ప్ర.

వ. అవ్వేఁడిమికి వెఱచఱచి యచ్చటిమూఁక విచ్చుటయుఁ గర్ణుముందటిమోహారం
బుత్సాహతీవ్రం బయి యారక్షించినం గని యన్నరుం డురగనికరంబునకుఁ
గవియుగరుడుఁ డనిశైవడినద్దెస కడరెన ట్లడరుట యాలోకించి తనకట్టెదుటి మొన
బెట్టు దాఁకి. 155

తే. వాయుసత్త్వుండు వాయుజవప్రదీప్తతనుఁడు వాయుతనూజుఁ డుగ్రప్రవృత్తి
నేచి పాపోసమల్లాన మెసఁగ మెసఁగఁ, గనువుగొట్టె వాలమ్ములఁ గౌరవేంద్ర.

వ. అవ్విధ నాటోపంబు సూచి కురుభూపతి ప్రధానసైనికులకుం జూపి యితండు సమ
సిన నక్కడ సకలంబు సమయు మీ రొక్కుమ్మడిం బొదివి పొరివుచ్చుం డనిన
వారును వారణాదిచతురంగంబులయుగ్గలిక మెఱయ నతనిం జుట్టుముట్టి యస్త్ర
శస్త్రంబులం బొదువుటయు నతండు. 157

ఆ. వాని నెల్లఁ ద్రుంచి వలఁ బ్రచ్చికొని లీల, నిగుడుచోఁ బరిపోలె వెగడువడక
తఱిమి రక్తనదులు వఱపె మస్తకకూర్మ, హస్తభుజగతతులు నతిశయిల్ల. 158

క. కురువిభుఁడు సూచి శకునిం, బురికొల్పిన నాతఁ డుగ్రముగ మూఁకొని పే
రురవుగ నారాచంబులు, గురిసినఁ బవనజుఁడు సరకుగొన కారథికున్. 159

క. బలునారసమున నేసిన, నలఘులఘుత మెఱయ నాతఁ డది యిరుమూఁడ
మ్ములఁ దునియలు సేయుడు నతఁ, డలిగి యతని ధనువు దునిమె నల్లన నగుచున్

ఉ. ఒండొకవిల్లు పుచ్చికొని యుజ్జ్వలషోడశభల్లముల్ సమా
ద్దండత నేసి నీమఱఁది తత్తను వాడఁగఁ జావ కేతువుల్
ఖండితమై పడంగఁ దురగంబులు నొవ్వఁగ సూతుమేనఁ బెన్
గండలు నెత్తురుల్ దొరఁగఁ గౌరవపుంగవుఁ డిచ్చ మెచ్చఁగన్. 161

తే. అలిగి బహునాలుక యుఁబోని యతులశక్తి, వాయుపుత్త్రుఁ డారథికుపైఁ వైచె నతఁడు
వెరవుమైఁ బట్టి దాన నవ్వీరుబాహు, వుచ్చిపోవైవ మనమున నుబ్బి యార్చె.

శకుని భీమసేనుం దలఁపడి మూర్ఛితుం డై తన రథంబుమీఁదఁ గూలుట.

చ. అనిలజుఁ డట్లు పెల్లెసఁగు నార్పులు సైఁపక మేటివిల్లు వే
కొని కనుదోయి గెంపుగ నకుంఠితవిక్రమ మొప్పఁ ద్రుంచె నా
తని ఘనకార్ముకంబు నిశితప్రదరంబులు మేన నించె నిం
చిన నతఁ డుర్విఁ గూలెఁ గురుసేనకు బెగ్గల మగ్గలంబుగన్. 163

తే. కూలి మూర్ఛ మునింగినఁ గురువిభుండు
దన రథంబుపై నిడికొని యనికిఁ దొలఁగఁ
బోవుటయుఁ జూచి తమతమపోరు మాని 164
దొరలు దెరలిన మూఁకలు మరలి పఱచె.

వ. ఇట్లు వెఱచఱచి యవిసినకలంబుజనంబులు దీవి సేరినయట్లు కర్ణుం జేరి కాలు
దన్ని నిలిచె నన విని ధృతరాష్ట్రుండు సంజయున కి ట్లనియె. 165

తే. అట్టియెడఁ గృతవర్మ ద్రోణాత్మజులుఁ
గృపుఁడు నృపతియుఁ గర్ణుండుఁ । గినియఁ జాల
రయిరి కిర్మీరవైరి కయ్యంబుకడఁక
యిట్టు లుండునె పదపడి । యెట్టు లయ్యె. 166

వ. అనిన సంజయుం డమ్మహీపతి కి ట్లనియె నవ్విధంబున కరూశ పాంచాలచేదిసైన్యంబులఁ దఱుముటయుం గని కర్ణుండు గడంగిన మానమూఁకలం బురికొని పవనతనయుతోడం బోరె నప్పాండవసేనాసముదయంబు రభసంబున నారాధేయుం బొదివిన.

క. అతఁడు వివిధోగ్రవిశిఖప్రతతులు నిగిడించి ఘోరరభంగి నుదారో
ద్ధతి నూపినఁ జెదపడి త, చ్చతురంగంబులును గలఁగె । జగతీనాథా. 168

చ. కనుఁగొని భీమసేనుఁడు శిఖండియు సైన్యవిభుండు ద్రౌపదీ
తనయులుఁ గేశవానుజుఁడు । దాఁకిన నంగతి కన్నిరూపులై
తనువులు సించుచున్ హయవిశాలము నొంచుచుఁ గేతుదండఖం
డన మొనరించుచుం బెనఁగె । దయ్యర్కపుత్త్రకతండు గంమునన్. 169

క. నకులసహదేవులును వా, రికిఁ దోడ్పడి నిశితశరపరీతునిఁ జేయం
బ్రకటితబలశౌర్యుఁడు సూ, తకులోద్వహుఁ డేచి వారిఁ । దలఁకం జేసెన్. 170

క. పెక్కండ్రతోడఁ గర్ణుం, డొక్కఁడ పోరాడి మొక్కవుకుక్కన వారిం
జిక్కువడం జేయుట గడు, నక్కజమై యుండెఁ గౌరవాధిప చూడన్. 171

వ. ఇవ్విధంబున నద్దెసఁ జేయుం గలముగల వెగ డందించిన బోక పొదువుపాంచాల చేదిమాత్స్యాదివర్గంబులపై సతం డనర్గళప్రసారంబు లగుశరాసారంబులు నిగిడించినం గరిరథఘోటకభటావయవఖండంబులును వివిధాస్త్రశస్త్రశకలంబులును జామరచ్ఛత్త్రకేతుభూషణభాగంబులును భూభాగంబునం దొరఁగం బెరిఁగి నెత్తురుటేఱులు వాఱ మఱియుం బాండవయోధవరులు వరుసం బోరి పోరి యంతకంతకు నివ్వటిల్లునాకర్ణుక్రొవ్వున నివ్వెఱపడిన నవ్వీరుండు గోవులం దోలు కోల్పులికై పడిఁ గౌంతేయబలంబులం బఱవఁ బాంచాలురు వెండియు దండితనంబున నతనిం దలఁపడిన నాతండు పంచవింశతిరథికులం దునిమి వైవస్వతుచందంబునం జేర్చినం దూర్యరవంబులు సెలంగం దత్పుత్త్రులును దుర్యోధనకృపదుశ్శాసనులు నశ్వత్థామశకునికృతవర్మలుం బైకొని యా ధర్మనందను సైన్యంబు సమయింప నది విచ్చిన నెఱం గిచ్చి పోనీక నిలిపి భీమనకులసహదేవ ధృష్టద్యుమ్న శిఖండి ద్రౌపదేయులు గడంగి కౌరవసైనికులం గనుపు గొట్టం దొడంగినం బోరు ఘోరం బయ్యె నిత్తెఱంగున రెండుదెఱంగులమూఁకలు దెగటాఱు చుండ గాండీవి దమమోహారంబున నుత్సాహం బెసంగ నొక్కవలన మనమొనల నెత్తుటం దోఁచుచుం గదిసి దలయెత్తిచూచి శౌరినుద్దేశించి.

సీ. కర్ణుని కేతువు గ్రాలెడుఁ జూచితే, భీమాదు లైన యుద్ధామరథిక
జనులు వెక్కండ్రతోనని సేయుచున్నవాఁ, డితని ప్రాపున గురుసుతుఁడుఁ గృపుఁడు
గృతవర్మయును గురుపతి సురక్షితుఁ జేసి, కొని వీఁక బాంచాలకోటి బడలు
వఱిచెద రురవడిఁ దఱిమి యా రాధేయుఁ, గీటడఁగింతము ఘోటకములఁ

తే. జటులరయమునఁ బోని న్యస్తిగపలుకుటయును, శౌరి యాస్త్రంబు సేయుఁ గశల్యుఁడమ్మ
హోగ్రరథవేగమును నరునుజ్జ్వలంపు, జేపుఁ గని సూతపుత్త్రుతోనిట్టు లనియె.

క. కేతనకపిభయదం బై, తోఁ తేరఁగఁ జక్రధరచతురసారథ్య
ద్యోతితవల్గనచారు, శ్వేతహయులు మెఱయ వచ్చు విజయునిఁ గంటే. 174

వ. అని మఱియును. 175

సీ. నవ్వెడుతలలను గ్రొవ్వారుచేతుల, బిరుదులు వెట్టినచరణములను
వాలులు తెఱచినవాజిమస్తకముల, గిరిశృంగములఁ బోనికరిశిరముల
నవయువభేదంబు లడఁగెననట్లుగఁ, దుమును లైనబహుగాత్రసముదయముల
భయదంబు లై మహిఁ బడునిమానములట్లు, యఱవఱ లైనట్టియరదములను

తే. నేలఁ గప్పుచుఁ దనబాణజాల మడర, నెవ్వ రడ్డము సొచ్చిన నించుకయును
దవులఁబడక సముద్ధతిఁ దివిరి మనలఁ, జేరి చూచుచుఁ బార్థుఁ డీదిక్కుఁ గవిసె.

క. తో డై డాపట వలపటఁ, గూడి తఱుమువారు లేరు కోపంబున నీ
తోడిబవరమున కడరెడుఁ, గ్రీడి మనతలంపు గూడె గెలువుము గడఁకన్.

ఆ. పాయ వడియె సేన బరవన మలరంగ, మార్కొనంగ మేటిమగఁ డొకండుఁ
గలుగ నోపఁ డేపు దలకొన మనమ యిబ్బలియుఁ దలఁపడంగవలయుఁ గర్ణ.

వ. అనిన విని కర్ణుండు గవ్వడిబాహాబలంబును శౌర్యసారంబును దపఃప్రభావంబును ముక్కంటితోడ నెక్కటి పోరుటయును బాశుపతాదిదివ్యాస్త్రంబులు వడయుటయును బురందరప్రముఖబృందారకులకు నజయ్యు లగుకాలకేయుల నిర్జించుటయు విరాటుపసులం బట్టించుకొనుటయు లోనుగాఁ గలవిశేషంబు లుగ్గడించి కృష్ణుమాహాత్మ్యంబు వొగడి యిట్టివారల నే నొక్కరుండన మార్కొని మదం బడఁగించెద మద్రనాయక మన తేరు వారియరదంబునకు సమ్ముఖంబుగాఁ జన నిమ్మనిన నతం డట్ల చేయఁ గనుంగొని కురుపతి పురికొలుపఁ గృప కృతవర్మ గురుపుత్త్ర గాంధారవిభులును గొందఱు కుమారులును విక్రమాటోపంబు దీపింప నయ్యంగరాజుం గడచి యడరి యా ఫల్గును బొదివిన నమ్మహాభుజుండు హరిణకులంబు గనినసింగంబువిధమున విజృంభించి యా రథికులపైఁ గలయ వివిధవిశిఖంబులు నిగిడించి ధనువులు దునిమియు ఘోటకంబులఁ గూల్చియు సారథుల సమయించియు దత్సేనాతురంగంబుల బడలువఱిచియు నబ్బలు మగలం దెరల్చి యుత్తరించి కెలనన దురంబు సేయునమ్మరుత్తనయుం జేరం

జని బహువిరోధిజనపయోధిమగ్నుం డగుచున్నయతని నుద్ధరించి సంప్రీతుం డగునతనికి నగ్రజాతుశీలం బెఱింగించి సంతోషసాగరంబునం దేల్చి నీ విక డప్పి దూర్పకొ మ్మని పలికి రాధేయరభసోత్సాహసహితం బగునీబలంబు మీఁదం గవిసిన. 179

కురుకుమారులు పదుగు రర్జునుం దాఁకి మృతు లగుట.

చ. తొడరి భవత్తనూజులు పదుండ్రు సముద్భటసింహనాదులై
వడిఁ దనుఁ జుట్టి ముట్టుటయు వారలసూతహయధ్వజంబులం
బొడి పొడి సేసి యాతఁడు రిపుల్ వెగడంద వెడందతూపులన్
మెడలు దెగంగ నేసి రణమేదినికిన్ బలి సేసె నత్తలల్. 180

వ. అట్టియెడ. 181

తే. నవతికౌరవరథికులు గవిసి కడిమిఁ
బొదువుటయు నన్నిశరముల భూరిరయము
మెఱయ నందఱఁ దెగటార్చి తఱుము నతని
దాఁకె వేయుమున్నూఱుసంశప్తకావళులు. 182

వ. ఇట్లు దాఁకినయాభీరాదిమ్లేచ్ఛనికరంబుల నతం డనేకవిధవిశిఖంబుల విరియిం పం బైపైఁ గరితురగసుభటరథసమూహమ్ములు, గ్రమ్మినం గని కడంగినవడ ముడితోడ్పాటునం జేడ్పడియు నవి వోక పొదివి పెనంగిన గద గొని యరదంబు డిగ్గి యగ్గలికనప్పవనతనయుండు దారుణరణవిహారంబున నెఱయ మెఱయుం దఱి చుగా మెఱుంగువాలంపగములు గాండీవి గుప్పింప నప్పు డమ్ముఖంబు చతురంగం బులయుం దొక్కఁడేనియు రక్తంబునం దోఁగని యట్టిది లేకయుండెనట్లు గార్చిచ్చు వోదివినకాననంబుచందం బయి యాసైన్యంబు మాపటి విఱిగి కర్ణ కర్ణ కావు కావు మను నెలుంగులతో నతని వెనుక కొదిఁగిన నీకొడుకు లబ్బలుమగని బలసి నిలువ నావీరుండు దీనికై వడి సమరార్ణవంబున మునుంగనీక యమోఘహారంబునుద్ధరించి మార్వోఁ దాటించి కిరీటిదెసకు నడరె నంతకు మున్న యరదం బెక్కి యంపలతన యుం డాధనంజయుని గూడుకొనిన నయ్యిరువురకుం దలకడచి పాంచాలు రా నూతనందనుం దలఁపడుటయు. 183

తే. ద్రౌపదీనందనులును సాత్యకియు లోను
గాఁగఁ బాండవసైనికోత్కరము గవిసి
కూడికొనియెఁ బాంచాలురఁ గురువరేణ్యు
యందఱకు నన్నిరూపులై యతఁడు వెనఁగె. 184

వ. అప్పుడు. 185

సీ. జనమేజయునినూతుఁ దునిమి రథ్యంబుల, నో నేసి భీమపుత్రసూజ నకుల
సుతులచాపములు ఖండితములు నేసి ధృష్టద్యుమ్నుమూపుల నమయఁజూచి

మెయి వంచి సాత్యకిపాయకపాలఁ గూల్చి కేకయకుమారునిజముష్టికడకు ననుపఁ
దజ్జనకుం డల్గి తలిస్ను నొప్పించి[1] ప్రసనుసఁ బాఁ జూడఁ దెలఁగి చంపు

తే. టయును బుత్రశోకంబుఁ గెక్కయును మనంబు
నందుఁ బిరిగొన రాధేయుఁ డతని నఱకె
శినివరుం డొంటివాజులఁ దనరథమునఁ
బూన్చికొని వచ్చి తత్పుత్రుఁ జూడివె నధిప. 186

వ. ఇట్లు సూతుపౌత్త్రుం డగుసుషేణుం బొడిచి శినిపౌత్త్రుండు. 187

చ. హయములఁ బంపి పుష్పనిశితాస్త్రములం దెగటార్పఁ జూచి తం
డ్రి యమునిచందమై [2] తెగితరె శినివీరుఁ డయంబు నేయుచు
న్భయదమహోగ్రకేతు నిగుడ నారసముల్ పదుమూఁడు శిలీముఖ
త్రయమును ద్రుంచి మునుఁ బ్రసకరత్రితయంబు శిఖండి గ్రుచ్చెనన్. 188

తే. కనలి యా సూతపుత్త్రుఁ డాతనిసితంబు
ధనువుఁ దునుమాడి పార్శ్వతలవయిఁ డగును
దేవుఁ దండ్రులు కనుఁగొనం గా వధించి
యేసె సుతసోముఁ డడరిన నేవు దఱుఁగ. 189

వ. వెండియుఁ బాంచాలరథికసంఘంబులు రాధేయుమీఁద నురవణింప సమీరణ
సుతసహాయుం డగుసవ్యసాచి వానిం గడచి యక్కర్ణునరదంబున కడరెనట్టియెడ
నుత్తమౌజుండును జనమేజయుండును యుధామన్యుండును శిఖండియు ధృష్టద్యు
మ్నుండును సతనిం దలమిగిలి యబ్బలుమగనిం బొడిచి యింద్రియంబులు దృఢా
త్మునిం గలంపం జాలనిచందంబున నాసూతనందనుఁ [3] దెరల్పం జాలరైరి వారల
కేతుచ్ఛత్త్రసూతతురగధనుస్తూణీరంబులు రేణువులు సేసి బహుబాణంబులఁ
దనువులు నొవ్వనేసి సింహనాదంబు సేసినయయ్యంగపతిపై సునంగతులై ద్రౌపది
కొడుకులు గవిసిరి వారిం గూడికొని శినివరుం డా సేనాపతి వారి నేయుసాయకం
బులు ద్రుంచి యాతనికిం దోడ్పడుటకుం గడంగినకౌరవపతియంగంబున నెనిమిది
సునిశితవిశిఖంబులు గ్రుచ్చి పేర్చిన. 190

క. అలిగినయన్నరనాథుని, కలఁకుల వెనఁ దఱిమి కర్ణకృపకృతవర్మల్
బలుతూపుల నేయఁగ నన్నలువుర స్రుక్కించె నతఁడు నారాచములన్. 191

తే. దొరలఁ గడచి బలంబు లుద్ధురత నిగుడ
వారిమొనలు సెదిర్చిన ఘోరతుముల
సంగరం బయ్యె నయ్యవసరమునందుఁ
దాఁకె దుశ్శాసనుఁడు వాయుతనయుతోడ. 192

---

1, 'స్వదేవుని దాఁ జూడఁ గా వధించు' వ్రా. ప్ర. 2. 'తెగితటే' అ. ప్ర. 3. గదల్ప
లేకైరి.

దుశ్శాసనుఁడు భీమసేనునితోఁ బోరి చచ్చుటం

తే. సారథులయుబ్బ వాజులచటులతయును, మెఱయునొప్పారు తేరుల | గమనదంబొలిచి
రపుడు గయ్యంపువేడుక | నాతఁడును న,తండుఁ జూపఱకున్నుల్లసంబు వగుచు.

క. ఒండొరులమీఁద నుజ్జ్వల,కాండము లడరించు చట్లు | గనుఁగొని యొక భీ
ముండు ప్రమోదభరితచి,త్తుం డయి తగ నిట్టు లనియె | దుశ్శాసనుతోన్. 194

ఉ. ఆసభలోనఁ గొన్నఋణ | మంతయు నీఁగఁగఁ గంట వడ్డితో
బాస కొకింతయుం దొలఁగఁ | బాఱకు తీర్చెద నిప్డు నేఁడు నా
చేసినపుణ్య మెవ్వరును | జేయరు నిన్నిటు సేర దెచ్చుటం
జేసి విధాత నాకుఁ గృప | సేయుట గానఁగ వచ్చెఁ దుర్మదా. 195

వ. అనిన విని యతఁ డితని కిట్లనియె. 196

సీ. ఎఱుఁగుదుమఱచితె నేలక్కయింటఁ జి,చ్చిడి మిమ్ముఁ బఱచిన | యిట్టి పను లవియుఁ
[1]గాకయు నమ్మియు | గాంధారరాజు మీ,యన్నతో వెడజూద | [2]మాడి రాజ్య
లక్ష్మిఁ జేకొని కాననలకుఁ బోవ నడచితి, మందుఁ బెక్కాపద | లనుభవించి
యజ్ఞాతవాసార్థ | మవ్విరాటునిప్రోలి, కరిగి యత్యంతదైన్యంబు నొంది

ఆ. యట్లు మీర లునికి | యప్రసిద్ధమె యివి, యేల రిత్తమాట | లేటు పోటు
తలకువచ్చియును | దరహాసమునఁ గెంపు, గదురఁ బవనసుతుఁడు | గడఁగి డాసి.

క. భల్లములు మూఁట సిడమును, విల్లు నఱికి సూతకంఠవిదళనమున శో
భిల్లి నిటలమునఁ బటుద,ర్పోల్లసితుం డగుచు నాటె | నొకనారసమున్. 198

వ. దాన బీఱువోవక దుశ్శాసనుండు. 199

క. తురగములఁ దాన నడపుచు, వెరవు రయము నెఱయ నొంపు | విలుఁ గొని గాఢ
స్ఫురణమున భీముతనువునఁ, బరఁగించె మెఱుంగు లడరఁ | బండ్రెండమ్ముల్. 200

క. తోడన కోదండము దును, మాడెను సూతుమెయి గ్రుచ్చె | నాఱమ్ములు సం
క్రీడయపోలెను మువ్వది, యాడించెను మఱియుఁ దూపు | లనిలజుమేనన్. 201

మ. ధను వొం డుగ్రత నెత్తి యేఁబదిశితా|స్త్రంబుల్ మరుత్సూనుఁ డా
తనిగాత్రంబున గ్రుచ్చినం గినుకమై | ధైర్యంబు శౌర్యంబు నొ
ప్ప నతం డుజ్జ్వలభల్లయుగ్మయుగళ|స్ఫారాహతిన్ వాజులం
దునిమెం జూపఱు పిచ్చలింప విలస|ద్దోర్గర్వదుర్వారుఁ డై. 202

వ. ఇట్లు విరథుం డై వృకోదరుండు మెయి వెంచి. 203

మ. గద లీలం గొని తేరు డిగ్గి మెఱుఁగుల్ | గ్రమ్మంగ సారించి యు
న్మదయానంబునఁ గిట్టి ఘోటకములన్ | మ్రందించి బాహాబలం
బు దలిర్పన్ భవదీయసూనునరదం|బుం ద్రెళ్ళఁ ద్రోవంగ బె
ట్టిదపుందోమర మెత్తి కోం చతఁడు గాఁ|డెన్ నేలకున్ గ్రుచ్చనన్. 204

1. గ. గాక యే మమ్మియుఁ. 2. జ. మాడి రాజ్య.

వ. అట్లు దాఁటి పెట్టు వైచిన యత్తోమరం బురం బాడ నేచి యక్కీచకారాతి పను
మూఁడువత్సరంబులు దమపడినపాట్లును బ్రతినచందంబును డెందమున నావహిల్ల
నుద్దండగదాదండంబున దుశ్శాసను వైవ నతండు నెత్తురు గారఁగ ధరణిం బడిన
బెబ్బులి లేఁగోదమం బాఁడుపోలికం బొదివి కుడ ద్రొక్కి యెక్కుడుమనంబున
నక్కుమారునితో ని ట్లనియె. 205

క. మును సభఁ బలికినదానం, దని వోఁటక యిప్పటికి వ్రేపడకి వచ్చితి[1]యే
మనియెద దనియవు నీమాటలు, వినుటకు నాకికను సాల వేడ్కపడియెడున్. 206

వ. అని యమ్మహాబలసందసింహంబు మహోగ్రలోచనప్రభలు నిగుడ మనబలంబులం
జూచిన. 207

క. నిగుడుదవాగ్నిజ్వాలల, వెగడందినమృగకులంబు విధమున నతిభీ
తి గదిరి నలుగడ విచ్చిన, జగతీశ్వర యతఁడు మెఱసెఁ జక్కనిబయలన్ 208

వ. అప్పుడు నీయందుఁ జేయుంగలసైనికులు సూచి తత్తేజోవిశేషంబునం జూడ్కులు
మిఱుమిట్లు గొన వెఱచఱచి యంతంత తిచ్చవడి యుండ. 209

శా. లీలం గేల నమర్చి మత్తగజకేళీసుందరోల్లాస మా
ఖీలత్వం బలరింపఁ ద్రిప్పఁ జదలం బృథ్వీస్థలిన్ వైచు ముం
గాలం ద్రొచు మొగంబు వ్రేయు దెస లుగ్రస్ఫూర్తి వీక్షించు మోఁ
కాలూఁదుం బయిఁ గ్రమ్మఱంగ మెడ [2]చిక్కం ద్రొక్కి నిల్చున్ నగున్. 210

వ. ఇవ్విధంబున ఘోరవిహారంబు సలిపి భీమవిక్రముం డగునాభీమసేనుండయ్యవ
రాజనాననం బాలోకించి. 211

క. ఏ నురము వ్రచ్చి నెత్తురు, జేనియ [3]యిదె ద్రావెదం గదిసి నన్నుఁ గడిమిన్
మానుప దిక్కు గలిగిన, న్రాని [4]మ్మెలుఁగింపు మీ మొనం గలవారిన్. 212

వ. అని పెలుచం బలికి కుఠారంబు వెఱికి యతని మొగంబుమీఁద జళిపించి. 213

భీమసేనుఁడు దుస్ససేనునియురంబు వ్రచ్చి రక్తపానంబు సేయుట.

మ. నరసింహుం డసురేంద్రు వ్రచ్చుకరణిన్ రౌద్రం బుదగ్రంబు గా
నురమత్యుగ్రతఁ జీరి క్రమ్మురుధిరమ్ముల్లాసి యై దోయిట
న్వార వారం గొని త్రావు మెచ్చుఁ జవికిన్ మేనున్ మొగంబున్ భయం
కరరేఖం బొరయంగఁ జల్లికొను నక్కౌరవ్యుఁ జూచుం బొరిన్. 214

వ. ఇట్లు దారుణభంగిం బ్రతిజ్ఞాకరణపూరణం బాచరించి. 215

తే. తల్లిచన్నులపాలును ద్రావ నెట్టు, లానవే పలు తెఱఁగులఁ దేనియలును
ఖండశర్కరతోడిదుగ్ధంబు లనుభ,వింపఁ బడవే యవియును నింత యింపు గావు.

చ. అని యెలుఁగెత్తి పల్కు నలినాను మహోద్ధతిఁ ద్రుళ్లు నార్చుఁ జె
ల్చున భుజ మప్పళించుఁ దమసైనికులన్ మనవారు రక్కసుం

1. జ. వే, మనియెద వను. 2. క. నక్కం ద్రొక్కు. 3. క. వలెఁ ద్రావెదం. 4. క. మ్మెఱిఁగింపు.

డని వెఱఁ గందువారు గళితాయుధు లయ్యెడువారు భీతి మూ
ర్ఛను బడువారు నై రణవిరామముఁ బొంద మదోత్కటాకృతిన్. 217

వ. పదంపడి. 218

మ. గద చేతం గొని యంత్యకాలయమరేఖం బేర్చి రక్తంబు చా
య దలిర్పం దను వుగ్రసుందరముగా § నవ్వీరుఁ డేతెంచి యు
న్మదమాతంగములీల దోఁప మనసేనం బొల్పుఱం దోలి వే
పొదివెం గ్రమ్మఱ దుస్ససేను వికటస్ఫూర్తిస్ఫురన్మూర్తి యై. 219

వ. చలంబు నెఱయ నతనికాలు నేల నమర్చి మొగంబు గనుంగొనుచు నక్కిమ్మీర
వైరి యి ట్లనియె. 220

క. ఏమిర పసు లని యార్చ్వవు, నీమాటలు నిలువఁబడియెనే పసరము మి
మ్మేము మగుడ నిదె యార్చెద, మీమాటకు మాఱు పల్కు § రెవ్వరుఁ గంటే.

ఉ. కొట్టన యల్గినం దగునె § నీళ్లను ద్రోచుటయున్ విషాన్నముం
బెట్టుటయున్ మహాభుజగభీషణదంష్ట్రలపాలు సేతయుం
జుట్టలుఁ బెద్దలుం జెలులుఁ § జూడ సభన్ నెఱి మాలి యమ్మెయిం
దిట్టిన కొర్పు లెందుఁ గలదే విను గెల్వరె జూద మెవ్వరున్. 222

క. అని పలికి క్రమ్మఱఁగ మన, మున మీఁదన్ భ్రమరివాఱి § ముద్గరలలితం
బునఁ గేలుమోఱయఁ జని తన, కన[1]లడఁగక దుస్ససేనుఁ గనుఁగొని పలుకున్.

ఉ. పైఁ బడి పోయెఁ గాక ధృతరాష్ట్రుఁడు గన్నది యేమి యా సభం
దా వల దన్నఁ గీడు మగనా పతి లేఁ డనఁబడ్డ కాంత నేఁ
డీవు గనుంగొనంగఁ బతియే డైఱ నొప్పఁ బతుల్ విజృంభిత
శ్రీ విలసిల్లు కామినులు § నేప్పుః రి ట్లపతిత్వదీనతన్. 224

క. విను మేము జేయఁ బూనిన, పనులం దొకటి గడ తేఱెఁ § బాపాత్ము సుయో
ధనుఁ బోరిఁ గొని తలఁ దన్నెదు, నను రెండవపనియుఁ దీర్పు నరిగెద నెలమిన్. 225

చ. అని మెలఁ గెత్తి చెప్పి యతఁ § డాతని గీటడఁగించి యార్చెఁ గ
ర్ణునకును లోను గా మనవరూధినియోధులకున్ మహాభయం
బున మనముల్ గలంగఁబడి § పోఁకిన నూల్కొన నీని జిచ్చపా
టున సకలాంగకంబులు గరంబున్ శిథిలంబులు గా మహోగ్రుఁ డై. 226

క. జనపతియుఁ గృపప్రముఖులుఁ, గనుఁగొన ని ట్లనిలసుతుఁ డుగ్రరక్త మొడల్ గై
కొనినట్లు పేర్చి దుశ్శాసనుఁ జంపుటఁ జూచి రోషసంరంభమునన్. 227

వ. నీకొడుకులు కవచియు నిషంగియుఁ బాశియు దండధారుండును ధనుర్గ్రాహుం
డును నలోలుపుండును సహుండును షండుండును వాతవేగుండును సువర్చసుం
డును గూడి కవిసి వివిధవిశిఖంబుల నతనిం బొదివిన నంతకు మున్న దుశ్శాసన

1. క. అడఁరగ,

రక్తపానకౌతుకాధీనమానసుండైన యా భీమసేనుపై నెవ్వరు గడంగుదురో యని కన్నిడి యుండి యతం డప్రతిహతంబుగాఁ బ్రతిన దీర్చుటకు [1]ఫల్గునుండు ప్రీతచిత్తుండై యుండె నంత భీముండు భల్లదశకంబున నక్కుమారదశకంబుశిరంబులు దునుమాడె [2]నట్టిభీమునియాటోపంబున కోటఱి నీసైన్యంబు సమరవిముఖం బయ్యె నానూతనందనుండు భీతుండై వదనంబు వెలవెలఁ బాఱ నూరకుండె నప్పుడు శల్యుం డతని నాలోకించి యిట్లనియె. 228

తే. ఉగ్రుఁడై దుస్ససేనునిఁ దయురము వ్రచ్చి
రుధిర ముగ్రతఁ ద్రావుకగు త్తనూజుఁ
జూచి చేడ్పడి చెయ్వెదఁ జూచితే సు
యోధనుని నీవు నట్టైన నొప్పు నెట్లు. 229

క. బలియుఁ డగురాజునకు గాల్, నిలువక తెరలంగ వీర నీప్రాపున శ
త్రులఁ దాఁకఁదలంచి కృపాదులు నిలిచిరి కూర్చుకొను మున్నతుల ధైర్యమునన్. 230

చ. కడువెగడంది యున్న నినుఁ గన్గొని [3]వీఁడె యుదారధైర్య మే
ర్పడ వృషసేనుఁ డొక్కరుఁడుఁ బాండుతనూజుల మార్కొనంగఁ బో
రెడు నరు నీవు దాఁక వలదే రణభారము నీభుజంబునం
దిడియె సమస్తముం గురునరేంద్రుఁడు దాసిఁ దలంపు మిత్తఱిన్. 231

వ. అనిన విని యతండు సమరోన్ముఖుం డయ్యె వృషసేనుండు భీమసేనుపై నురవణింప నకులుం డడ్డపడి యక్కుమారునిసిడంబును గొడుగును గోదండంబును ఖండించిన

చ. అలిగి యతండు వేఱొకశరాసన మెత్తి రథమ్ము ఘోటక
మ్ములు నిలఁ గూల నేయఁ బొలివోవనిధైర్యము పేర్మి వాలునుం
బలకయుఁ గొంచు మాద్రితొలుపట్టి ధరిత్రికి దాఁటి బెట్టుగో
ల్తలఁ జని తత్సహాయభటదారుణకేలి యొనర్చి పేర్చినన్. 233

ఆ. కర్ణసుతుఁడు వలకఖండించి కృష్ణసర్పంబుఁ బోనిపటుకృపాణ ముఱక
నఱకి నారసములు నాటించె నయ్యర్జునానుజన్ముమేన నల్లనగుచు. 234

వ. అప్పుడు ధృష్టద్యుమ్నుండును యుధామన్యుండును నుత్తమౌజుండును శిఖండియు జనమేజయుండును సాత్యకియు ద్రౌపదేయులును రౌద్రంబు శోభిల్ల రుద్రుల కైవడి వృషసేనువయిం గవిసినఁ గృతవర్మకృపద్రోణి దుర్యోధనులును శకునియుఁ దత్సోదరులు గొందఱును గ్రందం దఱిమి దుర్వారవిశిఖవర్షంబుల వారలం గప్పినం గని గజసాధను లగుకళింగు లురవణించి. 235

క. కృతవర్మ సిక్కువడ భూపతి నేడ్పడ శకుని వెగడుపడఁ దదవరజ
ద్వితయము ధరఁ బడఁ దీవ్రో, [4]ద్ధతిఁ బోరిరి చాపటంకృతంబులు సెలఁగన్. 236

1. క. గ. ఙ. ప్రీతచిత్తుం డవో ఫల్గునుండు భల్లదశకంబున. 2. క. గ. చ. నాభీమార్జునుల యాటోపంబున. 3. గ. వెండి అ. 4. ద్ధతి...టంకృతులు సెలఁగంగన్.

వ. ఇత్తెఱంగునం బోరినం గనలి కడంగి. 237

క. ఆ మువ్వురుఁ జలమున న, ద్దామద్వీపసహితచిత్రరథకేతనంబున సం
గ్రామతలము రక్తాక్తం, బై మెఱయ బలాధిపత్రయమునుఁ బోరిఁగొనిరన్. 238

క. తక్కటిరథికజనులు పేర్కొన నయ్యుభయబలంబు నొదిఁగించియునుం
జిక్కువఱచియుం గనిమిషు, లెక్కుడుపడ మెచ్చ మెఱసిరి శ్రీపురనాథా. 239

వ. మెఱసినం జూచి. 240

ఆ. అరద మెక్కి తఱిమి యనిలతనూజుఁ డు, వ్వీరుతోన పాండవేయసేనఁ
జేయఁ గలుగుదొరలు శితశరాసారంబు, లడర వారిమీఁద నడరుటయును.

వ. రణంబు దారుణం బయ్యె నందు. 242

సీ. కర్ణునియగ్రభాగంబునఁ గరిఘటల్, దునుమాడునకులనందనునిఁ గిట్టి
వృషసేనుఁ డమ్ములవాల్లి పైఁ బరగించి, శితభల్లమున నాతుశిరము ద్రుంపఁ
గనుఁగొని యక్కర్ణతనయునిమీఁదఁ బార్థాదులు గవిసిన నతఁడు పార్థ
ననిలజు మూఁడుమూఁ డమ్ముల నొప్పించి, యా శతానీకుని నట్లచేసి

తే. నకులుతనువున బాణసప్తకము సొనిపి, శార్ఙ్గధరుమేనఁ బంద్రెండుసాయకములు
వఱపి పేర్చినఁ గౌరవప్రతతి మెచ్చి, పార్థుఁ డేడిటి యూహించి భయముఁ బొందె.

చ. కెలఁకులయోధులం గడచి క్రీడి వడిన్ వృషసేనుమీఁద న
మ్ములు నిగిడింప నా రథికముఖ్యుఁడు మూఁపున నక్కుమారుఁ డే
పఱఁగ వాఁడితూపులు రయంబుమెయిం బది బెట్టు గ్రుచ్చి య
గ్గలిక ముకుందు నేసె నవకాండములన్ దివి ముట్ట నార్చుచున్. 244

వ. ఇట్లు విజృంభించిన. 245

—•• అర్జునుఁడు వృషసేనుని మృతిఁబొందించుట. ••—

మ. భ్రుకుటిస్ఫూర్జితఫాలభాగుఁ డగుచుం బొంగారి యాసూతపు
త్రకకోదండము బాహుదండములుఁ జిత్రస్ఫూర్తిఁ దున్మాడి మ
స్తక ముగ్రోద్ధతిఁ గ్రూరభల్లవిలసద్ధారాహతిం ద్రుంచె బా
ణకళాదుర్దముఁ డన్నరుండు పతియు న్రాధేయుఁడుం జూడఁగన్. 246

వ. ఇవ్విధంబున వృషసేను సమయించుటం జూచి కర్ణుండు శోకవ్యాకులచిత్తుండై కన్నీరొలుకం గోపాటోపంబున నుద్భటుం డగుచు నమ్మహారథుని తేరికి సమ్ముఖంబుగాఁ దనయరదంబు వఱపించి యర్జున యర్జున యని యాహ్వానంబు సేసిన నతండును సవిశేషోత్సాహంబునం బొదలి యడరె నట్టియెడ దురంబు దక్కి యిరువాఁగునుం బరమకౌతుకంబునం గనుంగొను చుండ నయ్యిరువురు రామసన్నిభంబులు నాదిత్యసంకాశంబులుఁ ద్రినయనప్రతిమంబులు నగు నాకారంబుల నుల్లసిల్లిరి వారలయొక్కటికయ్యం బాలోకించు కుతూహలంబున సురపితృవిద్యాధరసంయమిసంఘంబులును శచీపతిప్రజాపతిపశుపతులును లోను

గా ననేకదివ్యులు లేతెంచి నభోభాగంబున నిలిచి రప్పుడు బ్రహ్మ రుద్రున
కి ట్లనియె. 247

— కర్ణార్జునులద్వంద్వయుద్ధకాలమున బ్రహ్మరుద్రేంద్రుల ప్రశ్నోత్తరములు —

క. ఇరువురు నతిరథులు సమస్థానులు విక్రాంతిపరులు శూరులు వీరిం
దొరుదుఱతోఁ బెనఁగఁగ నీశ్వర మఱి జగమునకుపరాదె సమరం బనఘా. 248

క. అన విని యాదేవుం డబ్జజభవున కిట్లను నరనారోత్తము లీ
ఘనభుజులు వీరికణ మొట్లును జెల్లుం దప్ప నప్పలుకు విజయ మింకన్. 249

వ. అని యిట్లు మహాత్ములు సల్లాపంబులు సేయ నాకర్ణించి పాకశాసనుండు సప్ర
ణయంబుగా బ్రహ్మ కి ట్లనియె. 250

చ. తపము సుదాత్తశౌర్యము సుభద్రబలంబును గల్గుకిరీటి
య్యూవువెర వెక్కుడై గెలుచునట్లుగ నీవు దలంపవే పురా
ణపురుషు లైనకృష్ణులు రణంబున శాత్రవు లాక్రమించుటం
గుపితమనస్కు లైన నిల్వక బ్రదు కెమ్మెయిఁ గల్గనేర్చునే. 251

వ. నరనారాయణులకు నెందును జయంబు ధ్రువంబని తొల్లియుం జెప్పితి రమ్మహా
త్ములు జయించుట లోకహితంబు గర్ణుండు ద్రోణభీష్మప్రాప్తం బైనపుణ్యలోకంబు
వడయుఁ గిరీటి చిరకాలం బిడుములం బడినవాఁడు గావున రాజ్యసుఖంబు
లనుభవించుం గాక యనిన నప్పరమేష్ఠి వీరల జయాపజయంబులు నిశ్చయించి
పలుక నేల యనుటయు నీశానుం డతని నాలోకించి నిశ్చయించుట మేల కాక
యె గ్గేమి నిశ్చయింత మని కలిసికొని యతండును నానును వాసవువలను విలో
కించి కృష్ణార్జునుల నుద్దేశించి. 252

తే. మహితమును లగువీ రెండు మూఁకలేక, మెలఁగువారయి కాదె జన్మించినారు
వినుము నీచెప్పినట్టుల వీరి నోరులు, ధిక్కరించుట లోకహితంబుగాదు. 253

వ. వీరికి జయంబు ధ్రువం బని పలికి యంత నిలువక వీరి జయంబు ధ్రువం బయ్యెడు
మనవుకు నయ్యమరవిభుండు సురమునిప్రభృతులం గలయం గనుంగొని దేవ
దేవు లిరువురు నేకమతంబుగా నిశ్చయించిన లోకహితం బగునానతి యాక
ర్ణించితి రే మీచిత్తంబు లిత్తెఱంగున కనుకూలంబులు గావలయు ననిన నందఱు
నది యట్టిద కాక యొం డగునే యని రనిమిషులును గుసుమవర్షంబులు గురియిం
చుచు దివ్యదుందుభిధ్వానంబులు సెలంగించి రయ్యవసరంబున సకలభూతంబు
లును విస్మయోత్ఫుల్లనయనంబు లగుచు నమ్మహాద్వంద్వయుద్ధంబు వీక్షించు
వేడుక నొండుతలంపులు దక్కి యుండె నట్లు దార్కొనిన మహనీయరథంబులు
రెంటియందును సన్నాహసముజ్జ్వలు లై యొప్పువాసుదేవార్జునులును గర్ణశల్యు
లును దమతమశంఖంబు లొత్తి రప్పుడు. 254

తే. రెండుసేనలశంఖభేరీముఖంబు, లైనబహుతూర్యములపటుధ్వాన మడరి

నింగి [1]వ్రాంగారె నత్యంతనిశ్చలంబు, లయ్యె సైనికనికరంబు లద్భుతముగ.

సీ. కపికేతనము హస్తికక్ష్యయు నమ్మహో,బలు లిద్దఱును దపోబలముగలవ
గన్నవి యై బుద్ధి గల్గి శోభిల్లు సుకృతశ్రీ యుప్పొంగ కపి దెమలంగి హస్తి
కక్ష్యపై నదరినఁ గయ్యమా రెంటికిఁ, గలిగె నం తాహస్తికక్ష్య దెరలె
నంబుజాక్షుండు మద్రాధినాథుండును, ద్రుక్కులపాంబునఁ దేజరిల్లె

తే. రజ్జునుండును గర్ణుఁడుఁ దర్జనంబు,లైనచూపు లొండొరులఁ బూనినయులఁ
బఱపి రాకృష్ణపార్థులఁ బలుపు శల్య,కర్ణచిత్తబాష్పల్యములఁ గానవచ్చె 256

వ. అట్టియెడ నాసూతనందనుండు మద్రపతి నాలోకించి. 257

తే. అర్జునుఁడు నన్ను నోర్చినఁ యట్టులైన, నెట్లు సేయుము యనుడు మద్రేశుఁ డేను
కృష్ణు లిద్దఱ నొక్కటఁ గిట్టి తీవ్ర,బహుళశరజాలముల పాలుపఱుతు ననియె.

ఆ. అట్లు సవ్యసాచి యడిగిన మురవైరి, నగుచు నిను దా గూల్చినను ధరిత్రి
వఱియ లైన మేరు వొఱిగినఁ గర్ణుచే, నీవు గోలుపోవు వేళ గలుగు. 259

వ. అని వెండియు. 260

ఉ. [2]అట్టిద లోకపర్యవస మా దురవస్థకు స్రుక్కనేర్తునే
కిట్టుదుఁ గర్ణశల్యు లనుకీటములం గరతాడనంబులం
బెట్టుదుఁ నేలఁ గౌరవులఁ బీనుఁగుపెంటలు గాఁగ ధర్మజుం
గట్టుదు బట్టమన్న నగి గాండివి యద్దనుజారి కిట్లనున్. 261

ఉ. నవ్వుల కంటెఁ గాక యని నాకు నశక్యమె కర్ణశల్యులం
గ్రొవ్వడఁగించు టే ద్రుపదుకూఁతురు గొల్వునఁ బడ్డపాటునన్
నెవ్వగఁ బొందుచున్ సమయనిష్ఠ నడంగితిఁ గాని యింక నా
మువ్వురుఁ బూని వచ్చినను ముట్టెదఁ గర్ణుని నేలఁ బెట్టెదన్. 262

మ. అరదంబున్ సిడమున్ హయవ్రజము శల్యాంగంబులుం జాపముం
గరకాండంబులుఁ బెక్కుభల్లముల నుగ్రస్ఫూర్తిఁ దునుమాడి ని
ష్ఠురభల్లం బొకటన్ సుయోధనునిచూడ్కుల్ నీఱుగా నిర్దయు
ద్ధురగర్వోన్నతమైనకర్ణుతలఁ ద్రుంపం జూడుమీ వేడుకన్. 263

ఆ. కర్ణమద్రపతులకాంతల విధవలఁ, జేయువాఁడ నీవు చెన్ను మిగిలి
నగుచు నేఁడు ద్రుపదనందనవీనుల, ధర్మసుతుని చెవులఁ దనువు నినుపు. 264

క. సంతసపువార్త వుచ్చుము, కుంతికి నేఁ దంతి దరువుఁ గూల్చినక్రియ దు
ర్దాంతగతిఁ గర్ణుఁ గూల్చుట, యంతయుఁ గన్నారఁ జూచి యచ్యుత యెలమిన్.

వ. అని పలికె నా సమయంబున నుభయసైన్యంబులం జనంబులకు నంబరంబున నున్న దివ్యసమూహంబులు నందు గీతనృత్తంబుల నుల్లసిల్లునప్సరోగణంబులుం గానవైన సమ్మదంబున వారు ననిమిషులై యుండిరి రప్పుడేకనిశ్చయము లగుకర్ణుం

1. గ. వ్రాంగారె 2. 'ఇట్టిద లోకపర్యవస మే దురవస్థకు' నని యుండును అని తోఁచెడిని.

డును దుర్యోధనుండును నశ్వత్థామయునం బోరయుక్త దురంబుమీఁదిభారంబునం బొలిచి రిపుమాగసైనికులు గిరిచేఁ గప్పినకు బలిముఖంబు గాఁ దల మిగులఁ దగ దనుబుద్ధిన భయంబునను దద్భవంబులం గెంటిని బలిసి నిలిచి రమ్మహావీరులు ధనుర్ద్యుతులను బాణప్రభలను దీవ్రతేజంబులను బ్రదీప్తప్రలేకల్పాంతసూర్యులచందం బగుచు నొండొరుల నొడ్డుకొనంకలఁ జేర్చి రయ్యవసరంబున నశ్వత్థామ . కురుపతిఁ జేరం జని కరంబు నేఁతం దెమల్చి సాంత్వన[1]స్వరంబున ని ట్లనియె 266

అశ్వత్థామ దుర్యోధనునకు హితోపదేశంబు సేయుట.

చ. కలన గురుండు భీష్ముఁడును గాండివిచేఁ బడి రంగరాజు వా
రల కధికుండె యాతని దుశ్శరంబున నోర్వఁ గలండె పూని యే
వల దని బుద్ధి సెప్పిన నవశ్యము నాతఁడు నిల్చు నీతనిన్
నిలుపుము నీవు ధర్మసుతుననిం దగుమాటలఁ దేర్పఁ జొప్పడున్. 267

వ. తెలిపిన దామోదరుండునుం దెలివి నొందు 268

క. భీముఁడుఁ గవలును ధర్మజు, చే మరలెదువార లేను జెప్పెడివలుకుల్
భూమీశ కురుకులమునకు, నీ మొనరాజులకుఁ బ్రజకుహిత మూహింపన్. 269

చ. వలవదు నన్నునుం గృపు నవధ్యులఁగాఁ గొని క్రీడి గెల్వ శ
క్తు లని తలంప భీష్ముఁడును ద్రోణుఁడు లోక మెఱుంగఁగా నవ
ధ్యుల హరికల్మి నారథికుదోర్బలలీల నడంగి [2]పోరి య
చ్చలమొ ఫలంబొ [3]యింక యిన సంధి యొనర్చుట మేలు వారితోన్. 270

చ. హరి సనుదెంచినప్డు మన మమ్మెయిఁ బల్కితి మింక సంధికి
న్నెర వగు వేళ గల్గు నని నీవు దలంపకు మాంబికేయు భూ
వరుఁడుగఁ జేయు ధర్మజుఁ డవశ్యముఁ బాండునృపాలుపాల యే
పురకు నమర్చుఁ గాని చనత్రు వెలిమెచ్చును నోల్లఁ డేమియున్. 271

తే. పాండవులయట్ల రాధాసుతుండు నాదు
పలుకులకు నియ్యకొను నీవు బ్రదుకు తెరువు
వట్టు బ్రదికిన నెల్లభోగములుఁ గలుగు
నీను మానుము చచ్చిన నేమి గలదు. 272

క. వెడతలఁపు లుడిగి సంధికి, నొడఁబడు మింక లెస్స దీని కొడఁబడమి గడుం
జెడు తెరు విప్పటి[4]పదనున్, గడవఁబడుట ద్రాటఁ దప్పకరణీయ చుమీ. 273

చ. అన విని యమ్మహీరమణుఁ డాతని కి ట్లను నిప్డు దున్ననే
నునిపని దీర్చి మారుతతనూభవుఁ డాడినమాట యేర్పడ
న్వినియును సంధి సేయుటకు నీ వభిలాషము సేఁత యొప్పునే

1. క. పూర్వంబున. 2. క. పోవరే చలమో. 3. గ. యింతయు సు. 4. జ. వదనం, గడవఁబడుట.

పెనఁకువ కర్ణుఁ డే యుగము బేలవె మానుము ద్రోణనందనా. 274

శా. శ్రాంతిం బొందినవాఁడు పార్థుఁ డపరిశ్రాంతుండు గర్ణుండు దు
ర్దాంతోదగ్రత నేఁడు గీటడఁచు నీకతం డాతనిన్ సహ్యుల నో
త్యాంతంబున్ శిశిరత్వ మొందినను గోత్రాభుల్ వడం గాఁచునం
గుంతీసూనునిచేతఁ గర్ణున కనిం గోల్పాటు వాటిల్లునే. 275

వ. అని పలికి యజ్జనపతి తనసైనికుల నాలోకించి సమరసముత్సాహయోగణంబు లగుభాషణంబుల మొఖరుం డగుటయు నఖిలతూర్యంబు లొండొండ మ్రోసెఁ బాండవబలంబునను భేరీపణవాదులరణనంబులు నిగిడె నప్పుడు కర్ణుండును నర్జునుండును. 276

క. కరి కరి గిరి గిరి నంభో,ధర మంభోధరముఁ బెలుచఁ దాఁకిన క్రియఁ దాఁ
కిరి కడఁగి గగనతటియును, ధరణియు మ్రోయుచు నడంకె ధరణీనాథా. 277

క. మెఱయు వెలిమావులును గడు, మెఱుఁగారెడు రథములును మింటను మంటల్
వఱపెడు వాలమ్ములుఁ జూ,పఱ నొత్తోలు తాఁకు వెఱఁగుపడఁ జేసె నృపా. 278

వ. ఇవ్విధంబున నవ్వీరోత్తము లుదాత్తభంగిం దలఁపడి పెనంగం దొడంగిన నుభయసేనలవారలు నార్పులు నింగి ముట్టఁ జెలంగి రట్టియెడ. 279

మ. భరితోత్సాహతఁ బేర్చి దీప్తు లడరన్ భల్లమ్ము లొక్కుమ్మడిం
బరఁగం జేయుము కర్ణగాత్రములలోఁ బార్థుండ వే త్రుంపు మి
క్కురుభూపాలకు రాజ్యకాంక్ష [1]దొరయే కోదండపాండిత్యవి
స్ఫురణం గర్ణుఁడు నీకు నీబలువు నేఁడుం జూపు మత్యుగ్రతన్. 280

వ. అని పాంచాలురు పార్థజయార్థసంభాషణంబులు సేసిరి కౌరవులును గర్ణు డగ్గఱి.

చ. కడఁగుము నీదుబాణములఁ గవ్వడి గూలినఁ జాలు నంతతోఁ
జెడుదురు పాండవుల్ రణము సేయు మదగ్రత మెల్లఁ దక్క వే
రడవుల కేఁగి సాధువును లై చరియింతురు కౌరవేంద్రుఁ డీ
పుడమి సమస్తముం బొగడు పొంపిరివోవఁగ నేలు లీలతోన్. 282

వ. అని తఱిమిరి ప్రొద్దునుం జాల వ్రాలెఁ గాలాంతకప్రతిము లగునప్పార్థకర్ణు లన్యోన్యజయార్థులై పెనంగునప్పుడు. 288

కర్ణార్జును లొండొరులమీఁద దివ్యబాణంబు లేయఁ బూనుట.

సీ. కర్ణుండు పవిచండకాండంబు లర్జును,తనువునఁ జొనుప నర్జునుఁడు దీప్త
ఘనబాణములు పదునెనిమిది కర్ణుమైఁ, బరఁగింప నయ్యంగపతి దశోగ్ర
చక్రమార్గణముల నరభసంబున నొంచె, నప్పుడు నాతండు నట్టి వన్నె
శరములు రాధేయు నురమున నాటించె, నతఁడు దొమ్మిదివాలు లటమ్ము లతని

తే. వక్షమున గ్రుచ్చి సాయకద్వయము శౌరి, మేన నిగిడింపబీభత్సుఁ డేను మెఱుఁగుఁ

1. జ. దొరయుం. 2. గ. నురము నాడించిన.

దూవు లా సూతపుత్త్రు సైత్తుట పూనుమంగ, నేసె బాణాసనోల్లాసమెసక మెసఁగ.

చ. అలిగి కడంగి సూతసుతుఁ డుద్ధతిఁ బార్థునిపైఁ దీవ్రబాణపం
క్తులఁ బొదువం బరాక్రమసమగ్రసమాహృతి నవ్విజయుండు విస్మిత
వ్యాలసి ముఖాంబుజంబునను నొప్పుగఁ దద్రథరథ్య కేతుసూ
తులను దదీయగాత్రమును దూపుల నెల్లి మునుంగఁ జేసినన్. 285

క. ఆతఁడును దురగసారథి, కేతుయుతంబుగ నాఁగ ముంచెఁ గ్రీడయపోలెన్
శాతశరవృష్టి నన్నరు, నీ తెఱఁగున మఱియుఁ బెనఁగి [1]రిద్దఱుఁ గడఁకన్ 286

శా. ఆ యుగ్రాహవకేలి నిట్లు నిపుణుం డై యొప్పు నప్పార్థుఁ డా
గ్నేయాస్త్రం బరిఁ బోసి దారుణమహోగ్రజ్వాలికల్ భీషణ
స్ఫాయద్భంగి నభస్స్థలిన్ నిగుడ దర్పస్ఫూర్తి శోభిల్ల రా
ధేయాంగోద్దహనాభిలాష మెసఁగన్ దీపింప బెట్టేసినన్. 287

ఉ. అంతకకోపవహ్ని విపులాకృతి గైకొని వచ్చినట్లు మి
న్నంతయుఁ దాన యై కవియు నవ్విశిఖంబు మనంబులోన నా
వంతయు శంక లేక సముదగ్రత వారుణమార్గణావళిన్
శాంతముఁ జేసె విక్రమవిశాలుఁడు కర్ణుఁడు మూఁకు నుబ్బఁగన్. 288

ఆ. ఫల్గునుండు మేఘబాణ మేసిన భూనభోంతరంబు సంభృతాంధకార
మయ్యె సూతసూనుఁ డనిలాస్త్ర మేయును, నాతపంబు విరిసె నాక్షణంబ.

ఉ. అర్జునుఁ డైంద్రబాణము సమంచితభక్తి [2]ధరించి మంత్రవి
స్ఫూర్జితగాండివుం డయి రిపుప్రకరంబులు సంచలింప న
త్యూర్జితశక్తి నేయుడు మహోగ్రబహుప్రదరప్రకారతా
దుర్జయలీల నిర్మథనదోహలి యై యది కర్ణుఁ గిట్టినన్. 290

క. అతఁ డభిమంత్రితబాణ, ప్రతతిఁ దదుద్రేక మడఁచి పార్థునిమేనన్
శితశరములు నినిచిన మారుతిపుత్త్రుఁడు గనలి యన్నరున కిట్లనియెన్. 291

ఉ. సూతసుతుండు నీయెదుర సుక్కక నిల్చుట కాక నీశర
వ్రాతము నిల్వరించి యనివారణ నొంపఁ దొడంగె ఖాండవం
బేతెఱి నొంది కాల్చితి మహేంద్రుఁడు నివ్వెఱఁ గంది యుండఁగా
నాతెఱి వాత్మ సొల్కలిపి యుగ్గలికం దెగటార్పు మీతనిన్. 292

చ. తెగి మన కగ్గమై యరుగుదెంచినవాఁ డితఁ [3]డల్కి యింక నొం
దుగడకుఁ బోవకుండఁగ గదన్ వెనుదగ్గఱి యేఁ గపాలముం
బగులుతునో గదానిహతిఁ బార్థ భవత్ప్రకటప్రతిజ్ఞకై
తగ దని మాన్చెదేని నిశితప్రదరంబులఁ ద్రుంపు కంఠమున్. 293

వ. అని పలికిన నప్పుడు. 294

---

1. గ. రిద్దఱును దగన్. 2. క. దలంచి. 3. చ. డన్కి.

సీ. పుండరీకాక్షుండు గాండీవితో నీకు దివ్యబాణములు రాధేయుచేతఁ
దూలపోవుటయు బలాదూపుల పాతండు నిను నొంచి యిట్లు పేర్చినవిధంబు
నుత్సాహ మొదలి నీ ధ్వనికియుఁ గని కుక్కు సంతతి యూర్జ్వఁ బాణజాలకోటి
పిఱుసని పోవంగ నెఱుఁగవో మొఱఁగిరయ్యఁ జగఁ జేయునది లేక వెగడువడితొ
తే. చక్రమిచ్చెద నితనిమస్తకము దునుము, మనిన నగుచుఁ గిరీటి బ్రహ్మాస్త్రమధిక
నిష్ఠమై నేయ నది బహుళనిష్ఠురప్రదీప్తకీలమూర్తిఁ గర్ణునికెదురు నడచె. 295
క. ఆ రథికుఁడు దలఁకక నియ్యు, మూర్ధప్రోథభావుఁ డగుచుఁ దపస్త్రీ
దారతరబలమునన త,ద్దారుణసంరంభ ముడిపె ధరణీనాథా. 295
తే. ఉడిపి తోడన కవ్వడిరయొడలఁ గృష్ణు
మేన మూఁడుమూఁ డడరించె మెఱుఁగుఁదూపు
లన్నరుఁడు గర్ణుతనువు శల్యాంగకములుఁ
జించెఁ దొమ్మిదితొమ్మిది శితశరముల. 297
ఆ. మొనసి క్రీడి మఱియు మూఁడు నేనిమిదియు, రెండునాల్గు పదియుఁ జంటమార్గ
ణములు గ్రుచ్చె సూతనందనుమై నతఁ, డుఱక యుతనిమార్వి యూడ నేసె.
వ. ఏసి మఱియు శితశరంబులం బొదువం బొలి వోవక పార్థుం డాగుణంబు సమా
హితంబు సేసి పెల్లేసినరయంబున రాధేయుం డతనిశింజిని శిథిలంబు గాద కాక
యని తలంచె నాధనంజయుం డతనివింటినారి వికలంబుఁగా జేసి. 299
క. చిఱునగవుతోడ మైమఱు, వఱువుల్లుగఁ జేసి యతనిశయంగము దోఁగం
బఱపె రుధిరంబు బెడిదపు,మెఱుఁగువెడఁదయుంపగమి నమిత్రులుదలఁకన్. 300
చ. తెరలక కర్ణుఁ డవ్విజయుఁ దీవ్రశరత్రయవిద్ధుఁ జేసి మం
దరధరు నత్రపంచకనితాంతహతిం గను నొంచె నాశరో
త్కరము వరప్రభావకలితం బగుటన్ మగుడంగ వచ్చె ని
ష్ఠురరథసం బెలర్ప మధుసూదనుఁ గ్రమ్మఱ నేసె నాతఁడున్. 301
క. అలఘుపటుభల్లపంచక,ముల రెంటం గ్రీడి చిత్రముగ నయ్యాత్ర
మ్ములు మూఁడుమూఁడుశకల,మ్ములుగాఁదునుమాడె జనులు పొగడ నరేంద్రా.
క. కర్ణునిమొయి నాలోనన, కర్ణాంతాకృష్టచండకాండము లధికో
దీర్ణక్రోధంబున న,ధ్వర్ణగతుం డగుచు గ్రుచ్చె నతఁడే పలరన్. 303
చ. మఱియు నరుండు సూతసుతు మర్మవిభేదన మాచరించిన
న్మెఱుఁగులు గ్రమ్మునమ్ముల విశిఖచ్ఛలధైర్యము పేర్మి నాతఁడు
క్కఱక పెనంగె దానఁ గన లగ్గలమై పెన నమ్మువాఁభుజుం
డఱిమిఱిఁ జీకటుల్ గవియునట్లుగ రోదసి నించెఁ దూపులన్. 304
తే. వెగడుపడిచక్రరక్షకుల్ వెనుకదిక్కుగా చురథికులుఁ బార్శ్వసంగతులుఁదమ్ము
విడువఁ జాలక లజ్జ వోవిడిచి రపుడు, గర్ణువారలు వాఱుట గని విభుండు. 305

క. ఆదిక్కవాఁడు భీముం, డాదిగ నని సేయకుండఁ దన్నియతి యొకం
డా దైన్య మొంది తప్పం, గాదని యూహింప నీనిష్కలంకకతమునన్. 306

దుర్యోధనుఁడు తనయోధుల నర్జునుం దలఁపడఁ బురికొలుపుట.

వ. ఇరుగెలంకులమూఁకలం గలయం గనుంగొని యెలుం గెత్తి. 307

క. తోడ్పడుఁడు పోటువుం జేయుఁడు, పొడువుఁడు బీభత్సుఁ బ్రిదిలి పోనీక వెసం
బడ సైన్యం బొక్కుమ్మడిఁ, గడఁగి యనుచుఁ జేయి వీచెఁ గౌరవనాథా. 308

క. విను మతఁ డిట్లయిఁ బురికొల్పిన రథకరితురగసుభటబృందములు రయం
బున నురవడించె నయ్యర్జునుపైఁ దగువారు నిలిచి చూచుచు నుండన్. 309

వ. ఎదిరిసైన్యంబు సమరంబు దొఱంగి యుండుట యెఱింగి కడంగుట పాడి గాదని దొరలు దురంబునకుం జొర కుండిరి గాండీవి కోదండగుణరణనభరితభూనభోంతరుం డగుచు వివిధవిశిఖజ్వాలాకలాపంబుల వేఁడిమి సూపిన నేపఱి వెఱచి యమ్మూఁకలు పఱచిన నక్కురునాథుం డద్దొరల నుద్దేశించి. 310

క. బీరమును లావుఁ గల్గిన, మీ రందఱుఁ గర్ణు నొకనిమీఁదన యిమ్మైఁ
బో రెల్ల ద్రోచి ఫల్గునుఁ, జేర కునికి యాయుధోపజీవుల తెఱఁగే. 311

వ. అనిన విని యుల్లంబుల లేనియుత్సాహంబు దెచ్చికొని వా రొక్కుమ్మడి నుర వడించిన. 312

మ. భరితక్రోధమహోగ్రవృత్తి సిడముల్ భంజించుచున్ సూతుల
న్ధరణిం గూల్చుచుఁ జాపముల్ నఱకుచు న్నశ్వంబులం జంపుచున్
నరుఁ డాభీలపరాక్రముం డగుడు దైన్యం బంది వెన్నిచ్చి వి
చ్చిరి వా రందఱు దివ్యసంఘము నుతింపం జూచి యుర్వీరునిన్. 313

చ. కురుపతి వెండియుం దఱుమఁ గోల్తలు సేయర క్రమ్మఱంగ నె
వ్వరు నతిభీతి నిట్లు మనవా రెడ గాఁ జని చూచుచుండి ర
ప్పురుసున నాసమిద్ధరణిభాగము శూన్యతఁ బొందఁ గర్ణుఁ డ
న్ననుఁ దలపడ్డ నప్పటిరణంబు మహాద్భుత మయ్యె భూవరా. 314

చ. శ్రమమున సోలుచుండియుఁ బరాక్రమసంపదసొంపు మీఱ దు
ర్గమవివిధాస్త్రజాలతిమిరంబుల నొండొరుఁ గప్పికప్పి శౌ
ర్యములును బాహువీర్యములు రాజుల నచ్చెరు వందఁ జేయ ను
గ్రముగఁ బెనంగి రయ్యమరరాజతనూజుఁడు సూతసూనుఁడున్. 315

వ. అట్టియెడఁ దక్షకునపత్యంబై తత్సోదరుం డగునైరావతుండు పెనిచి యుపలాలింప నల్లసిల్లినయశ్వసేనాభిధానుం డగునాగకుమారుండు సర్పముఖశరాకారంబు గైకొని తనయొద్ద నుండఁ దానుఁ బసిండిపొఱం బెట్టి యనుదినంబును గంధపుష్పంబుల నక్షతంబుల నర్చించుచు నయ్యర్జునుమీఁదం బ్రయోగించువాఁడై యున్నయట్టియమ్మహనీయాస్త్రంబు రోషావేశవివశుం డగుచుఁ బుచ్చి

కొని తల దెగ వేయుటకై యుక్కర్ణుండు సముదీర్ణ జ్వాలాజాలంబు లంబరంబునం బర్వం జూపఱ హాహాకారంబులు సేయం గాద్రవేయగుణంబున సంధించి తెగవాపినం గని [1]యారథికుఁడు రావు కంధరంబు పక్కటికెంగా నప్పుడుపాంగప్రదేశంబుకొలంది యగుటం జేసి యది నెపంబుగా శిరోబ్జంబు దలఁచి జత్రువైకల్యం బాపాదింపం దలంచి యీసంధానంబు మెడ దునుకుట కనువుగాదు నిపుణంబుగా నిరూపించి రొమ్ముందుభంగి సంధింపు మనినఁ గర్ణుండు గనలుచుం గనుంగవం గెంపు గడలుకొన నమ్మద్రపతిం జుఱచుఱం జూచి. 316

క. ననుఁ బోటిజోదు నుంగా, దని పలుకంగ నేర్చు నీకు ననంత గలదె య
ట్లును గాక వినుము కర్ణుం, డెనుమాఱొకశరము దొడుగునే పరులు నగన్. 317

వ. అని పలికి కలుషం బగుచిత్తంబుతో నెలుంగెత్తి ఫల్గున ఫల్గున పొలిసి తంచు నేసిన. 318

క. పలుదెస మంటలు ప్రబ్బంగ, నలఘుస్ఫురణమున నిగుడునయ్యస్త్రంబుం
జలజాక్షుఁడు గని పంచాం, గుళమాత్రము రథము ధరణిఁ గ్రుంగ నదుముడున్.

క. సురగరుడఖచరవిద్యా, ధరఖేచరు లంబరం బుదాత్తధ్వనిసం
భరితముగఁ బొగడి రమ్మురహరు దివ్యప్రసవవిరచితార్చనతోడన్. 320

సర్పముఖశరంబున నర్జునకిరీటంబు భూమిపైఁ బడుట.

మ. కురువంశోత్తమ వారిదిక్ప్రజ సంక్షోభింప నప్పాంపతూ
పు రయం బుగ్రము గాఁగ బిట్టసరి దంభోళిప్రభగ్నోత్తమా
ధరశృంగాకృతి గా హరించె బహురత్నస్ఫీతరశ్మిచ్ఛటా
స్ఫురితం బైనకిరీటముం విజయునొక్కప్పుం దేజముం గుందఁగన్. 321

తే. జనులు విహ్వాలు లగునట్లు ఘనరవంబు, దిశలయందు నాకసమున దీటుకొనఁగఁ
గర్ణుఁ డట్లు ఛేదించె దిక్పతులచేత, నైనఁ జెడనికిరీట మయ్యహిశరమున. 322

క. సురపతి దపంబు సేసినఁ, బరమేష్ఠి ప్రియంబుఁ బొంది బహుమానపుర
స్సరముగ నిచ్చినయది యీ, కిరీట మరిభీషణత్వకీర్తిదము నృపా. 323

ఆ. వనధివాసు లగునివాతకవచు లను, దనుజు లాపురందరునకు జయ్యు
లైన నతఁడు వనుప నర్జునుఁ డోర్చిన, మెచ్చి యక్కిరీట మిచ్చె నధిప. 324

చ. వినుము నరేంద్ర చూడ విన విస్మయ మిట్టిది [2]పాఁపఱమ్ము వా
త నెగయుఘోరరూపభయద[3]ప్రథమానవిషాగ్నిజిహ్విక
ల్దనికినఁ బెల్చ మండుచు నిలాస్థలిఁ డొల్లె నినుండు పశ్చిమాం
బునిధి నితాంతదృశ్యరుచిఁ బోల్పెసఁగం బడుభంగి దోఁపఁగన్. 325

వ. అప్పుడు. 326

ఉ. శృంగము లేనినీలగిరిచెల్వునఁ గ్రీడి కిరీటహీనుఁ డ

1. గ. యాపాఁపపుఁబుశరంబు. 2. గ. పాముటమ్ము. జ. పాముఱమ్ము. 3. జ. దంష్ట్రిధమాన.

య్యుగ్రం గనుపట్టె జెల్లఁ దలఁకరొ యొల్లియ మౌళి దృఢంబు గా నమ
ర్చెం గురునాథ భ్రూగ్నశిఖ చెన్నునఁ బూర్వాద్రిమహీధరంబు కాం
తిం గడపన్నఁ జెందు ప్రకటీభవను గాఁగ నటించుచాప్పునన్. 327

వ. అట్లు రాధేయకరప్రముక్తంబై కిరీటంబు నిర్దహించి నేలం గలపినయమ్మహో
రగంబు గ్రమ్మఱం గవిసినం గని కమలనాభుండు గవ్వడితో మనమీఁద మగుడ
నిమ్మహాసర్పంబు చనుదెంచుచున్నయది యనిన నతం డిది యొక్కడిపామిట్లు వచ్చు
టకుఁ గతం బేమి యని యడిగిన దీని నెఱుంగవే ఖాండవం బేర్చునప్పుడు దన
తల్లిని రక్షించికొని యనలంబునకుఁ దప్పిపోవం జోవ నీకు నీ వేసిన నన్నాగాంగన
మృతిం బొందె నప్పగ వాటించికొని కర్ణుకడ నమ్మోయి నున్నయశ్వసేనాభిధాన
భుజంగంబు. 328

తే. అతఁ డేయఁ గిరీటంబు ॥ నపహరించి
దానఁ గోపంబు వోవక ॥ తాన కడఁగి
నిన్నుఁ బరిమార్పఁ గడఁగెడు ॥ నన్న నెఱిఁగి
యాఱుపటుభల్లములఁ దును ॥ మాడె నతఁడు. 329

వ. అత్తెఱంగున. 330

సీ. ఉరగంబుఁ దునిమి వేగమరలి కర్ణునిమీఁదఁ, బదియుఁ బండ్రెండునుఁ బటుశరములు
నిగిడించి యుజ్జ్వలం ॥ బగుదొడ్డనారసం, బేసిన నది రుధిరాసవంబు
పానంబు సేయుచు ॥ మే నుచ్చి చనిన దం,డాహతం బైనమహాహివోలె
నాసూతనందనుఁ ॥ డత్యుగ్రుం డయ్యు, నంతకుమును [1]పాఁపరమ్ముచేత

తే. నర్జునుఁడు సావమికి వెఱఁగంది యాతఁ, డటులు గెరలి పండ్రెండువాఁడులమ్ము లేసి
పద్మనాభుని నొప్పించి ॥ పార్థు నొకటి,కొఱంతగా నూఱుశరములనుఱక నొంచె.

క. పెండియు బలువిడి నరుఁ డా,ఖండలసుతు నురము గ్రూరకాండంబుల నొం
డొండ కడు నొవ్వ నేసి యు,శ్రం బుబ్బున నార్చె గగనతల మద్రువఁగన్. 332

ఆ. ఆర్చి పెలుచ నట్టహాసంబు సేసిన, నలిగి యతఁడు భల్లములఁ దదీయ
భూరికంకటంబు ॥ పొలువఱ నఱికి యుల్లసితమకుటకుండలములు దులిచె. 333

వ. దులిచిన నబ్బలుమగండు. 334

క. శిరమునఁ గర్ణంబుల నెత్తురు లొలుక బరిమేనితోఁడఁ ॥ దూలక బాహా
స్ఫురణంబు మెఱయ సాయక,పరంపరలు నరునిమీఁదఁ ॥ బఱపెం బెలుచన్. 335

తే. వానిఁ దును మాడి యాపాండుసూనుఁ డలఘు
శరచతుశ్శతిఁ బొదివి నెత్తురులు మేనఁ
బఱవ గైరికనిర్ఝరప్రకరశోభి ॥

1. గ. పామురమ్ము; చ. పాముటమ్ము.

తాచలము వోలి పొలిచె నరనాథ యంగరాజు. 336

ఉ. అమ్మెయి నుగ్రుఁడై మఱియు నర్జునుఁ డుజ్జ్వలవత్సదంతకాం
డమ్ములు నెక్కు సన్నతదృఢస్ఫురణం బలరంగ నేసి ర
థ్యమ్ముల సూతుఁ గేతనము నాతనితేరును గాడఁ గప్పె మే
ఘమ్ములు గ్రమ్మి భూధరము గప్పినభంగిఁ బెలంపఁ బట్టుగన్. 337

వ. ఇవ్విధంబున విక్రమకుతూహలి యై విజృంభించె నప్పుడు. 338

ఉ. నెత్తుటఁ దోఁగి మేను కమనీయరుచిం గొమ రార బాణసం
పత్తి యుదగ్రతన్ మెఱయ భాస్వరుఁడై యురదంబుమీఁద భూ
పోత్తమ కర్ణుఁ డొప్పె నరుణోజ్జ్వలమండలకాంతిపూరితో
న్మత్తపుదీప్తులం దగ నిరంతుఁ డపరాద్రి మెఱుఁగు పూషుఁడున్. 339

వ. ఇట్లు సూతనందనుం డొచ్చియుఁ బొలివోనిబంటుతనంబున జంటమెఱుంగులు చదలం బరఁగ శరంబు లడరించుచు బహుబాణంబులు రేణువులు గాఁ జేయుచుండ సవ్యసాచిదివ్యాస్త్రవిలాసంబు భాసమానం బయ్యె నయ్యవసరంబునఁ గాలుం డదృశ్యాకారంబున. 340

బ్రాహ్మణశాపంబునఁ గర్ణురథచక్రంబు భూమిం గ్రుంగుట.

క. భూసురశాపంబున నిదె, యీ సూతజురథముచక్ర మిలఁ గ్రుంగెడు వీ
తాసుఁ డగు నీతఁ డని సేనాసముదయ ముగ్మతను విస్మయం బలరె నృపా. 341

వ. పరశురామదత్తం బయినభార్గవాస్త్రంబు బహు[illegible]సాధనం బప్పుడు రాధేయునకుం బ్రతిభాసింపకుండె దాపటికల్లు [1]గ్రుంగినఁ దేరు ఘూర్ణిల్లె నట్లు జామదగ్న్యమహీసురులశాపంబు లస్త్రబలంబునకు రథంబునకు వైకల్యం బాపాదించి చిక్కువఱుచుటయును సర్పముఖశరం బాభంగి నిష్ఫలప్రయత్నం బగుటయును దనమనంబున నొవ్వవరి యక్కర్ణుండు శరంబులు విడుచుచు. 342

తే. ధర్మవాదులు ధర్మతత్త్వప్రధాన,చిత్తు లగువారిఁ బూని రక్షింతు ధర్మ
మందు రది బొంకు గావించె నతులధర్మ,శీలుఁ డగునాకు ధర్మువు సెలవు లేక.

క. అని ధర్మంబును దూఱఁగఁ, దను నర్జునుబాణవితతి [2]దద్దయువడిఁ దాఁ
కినఁ గర్ణుండు విషాదం,బున వెండియుఁ బెద్ద నొచ్చె భూవరముఖ్యా. 344

క. కన లధికమైన లా వెక్కినయయ్యంగపతి నొంచెఁ గృష్ణార్జునులన్
సునిశితశరములు మఱియుం, జొనిపెను దనధైర్యమహిమ సుర[3]లగ్గింపన్. 345

వ. అలిగి యర్జునుం డాశీవిషంబులుం బోనివిశిఖంబు లాకర్ణుమేను నచ్చు చన నేసినం గ్రోధభాసితుం డై యతండు బ్రహ్మాస్త్రంబు ప్రయోగించుటయు నప్పార్థుం డైంద్రాస్త్రంబు ప్రయోగించిన. 346

1. క. డించిన: చ. డించిన. 2. క. దాఁకిన నొవ్వారినఁ గర్ణుఁడు. 3. క. లు నుతింపన్.

క. అమితబలం బగుబ్రహ్మా,స్త్రమునకుఁ దీ సాహస్రాస్త్ర మహహ్యాప్రకాశం బగుటయుఁ జ
త్తమున విషాదము దనుకంగఁ, గనుఁగొనుచుండెఁ గౌరవులు సంతసమునఁ గాండివితోడన్. 347

వ. నీయస్త్రం బిన్నాఁడు కర్ణాస్త్రంబు నేసి విద్ధ్వస్తం బయ్యె నిట్లుగా నేల యన
వృషుఁ గవ్వడి బ్రహ్మాస్త్రప్రయోగంబున సహస్రపాణియైన యాధనంబు బాధితంబు నేసి
రాధేయాంగంబు బాణజాలంబులం బొదివి నొప్పించిన నమ్మేటిమగండు గాండీవంబు
మౌర్వి గోటఁ బాసి పో నేసిన నాసవ్యసాచి మగుడ నవక్షీణ కార్ముకంబులు నిగి
డించిన రయంబున నానారాంచద్విత్రశరాసనంబు లమ్మౌర్వి యుఱాడుట దోఁప కుండ
నవ్వీరుండు విస్ఫురద్విశిఖంబుల వారించి యతని నొంచిన వెండియుఁ బుండరీ
కాక్షుండు సహస్రాంశునందను నుద్దేశించి. 348

క. నిను నొంచువాఁడె కర్ణుం, డనితరసులభ ప్రకార - మగుభుజవీర్యం
బున [1]వనమానోజ్జ్వలభ,లన యనఁ దెగటార్చు శరవిశాలాస[2]నిరూఢా. 349

వ. అనునప్పుడు విషవిస్ఫురద్భుజంగభంగురం బైనబాణంబు రౌద్రమంత్రసహితంబు
నేసి కర్ణుండు పార్థుప్రాణంబులు గొన నవ్వళించి సంధింప నున్న కొండొక క్రుం
గినచక్రంబు [3]కుండ మునుంగిం దిగఁబడిన నొడ్డగెడ వై యరదం బేటునకుననువీక
తక్కిన నుక్కుటి యక్కర్ణుం డప్రతీకారంబు లగురోమవిషాదంబులఁ గన్నీరొలుక
రథంబు డిగ్గి కవ్వడిదెసఁ గనుంగొనుచు ని ట్లనియె. 350

సీ. అరదంబుచక్రంబు - ధరఁ జాలఁ గ్రుంగిన, నెత్తెద నంతకు - నేయ కుండు
మేను భూమిష్ఠుండ - నీవు రథస్థుండ, వియ్యెడఁ దగ వగు - నేయ కునికి
విరిదలవానిని - విరథుని నాయుధం, బిడినవానిని శూరు - లేయ రెందు
మహిని శూరుండ వనుపమాత్ర గా దుత్తమ,కులుఁడవు రణధర్మకోవిదుండ

ఆ. విట్టినీవు దగినక్రియ యట్టిభంగిన చూని, నేయ వలయు నిట్లు - సెప్ప నెల్లఁ
బాడి యేప్పడంగఁ బలుకుట గాని గో,విందునకును నీకు - వెఱచి కాదు. 351

వ. అనిన విని యచ్యుతుం డతని కి ట్లనియె. 352

క. ఏమీ తగవును ధర్మము, నీమనమున నేఁడ పుట్టెనే గర్వము ను
ద్దామదురభిమానము నే,లా మఱచితి కర్ణ యీ చర్యలం బెట వోయెన్. 353

ఆ. పరమధర్మపరులు - పాండుభూవల్లభ,సుతులు వారి నతులశుభము లొందు
ధర్మహీను లైనధార్తరాష్ట్రులకుఁ బా,టిల్లు నివ్విధమున - నెల్లచేటు. 354

వ. దీనికి నీవు కటకటంబడినం బోవునే యని పలికి వెండియు. 355

సీ. గొంతియు నందను - ల్గొనకులు సుప్తులై, యుండంగ లక్కయిల్ - మండఁ జేసి
కపటంపుజూదంబు - ఘటియించి ధర్మాత్ము, డగుధర్మసుతుసిరి - యపహరించి
యంతఁ బోవక ద్రుపదాత్మజఁ దెచ్చి స,భాస్థలి నమ్మాయి - భంగపఱిచి
యమ్మహాత్ములఁ జంప - నడవికి ఘోషయా,త్రావిధినెపమున - దాడివెట్టి

1. గ. అసమానో. 2. గ. నిరూఢిన్. 3. చ. కుండు; ఙ. గుండు.

తే. బాలు నభిమన్యు నొక్కని బహురథికులఁ
బనిచి చంపించె మీసుయోధనుఁడు తలఁపఁ
గానియిప్పాపముల కాదికర్త వీవ
యున్నయెడలను నీపాడి యెందుఁ బోయె. 356

వ. అని యిట్లు కృష్ణుండు గర్ణుతో నాడుమాటలఁ దోడ్తోడం బెరిఁగిన యుద్ధసంజయమనంబు రోషానలంబు రోమకూపంబులఁ బటుజ్వాలారూపంబుల వెడలుట యతివిస్మయప్రదంబై యుండె నయ్యుగ్రమూర్తి సముదగ్రపరాక్రమంబునం గురియు పటుబాణాసారంబు వారించి యవ్వీరునంగంబున నయ్యంగపతి నిశితాస్త్రంబులు నిగిడించుట మహాద్భుతం బయ్యె నత్తెఱంగున నీడంబోక పెనంగునతం డతిరయంబున నన్నరునిం బదిదొడ్డనారసంబుల నొప్పించిన నత్తేశోధనుం డాజ్యధారాచ్ఛటాసేకంబున నుద్రేకంబు నొందినహుతవహుండునుం బోలె మండి శత్రుసంత్రాసనంబును మిత్రోల్లాసనంబును బ్రగుణమణిజాంబూనదమయంబును జనప్రస్తుతిపాత్రంబును హాస్తికక్ష్యాత్మకంబును నగునతని కేతనంబుఁ గనకపుంఖప్రభాభాసితం బైనభల్లంబునఁ బడనేసినం గౌరవులు నిజయశోబలదర్పప్రియంబుల ముత్తంబులు వడుటగాఁ దలంచుచు హాహాకారంబులతో నారాధేయునిదెస నిరాశులై రట్లు ప్రస్ఫీతకేతుపాతనం బాచరించి [1](న దానం గనలి కర్ణుం డతినిశితక్రూరనారాచజాలంబులు గృష్ణార్జునుల మీఁదం గురిసి వెగడుపఱిచి యరదంబుపిఱిందికొమ్ముక్రిందికి మూఁపు సొనిపి లావున నెత్తిన రథచక్రంబు విడువక భూమి కులపర్వతకాననసముద్రసహితం బాఱంగళంబు తెగనె నట్లు కర్ణుండు రథంబు నిలిపి మీఁదికిం జని యొప్పటి బాణంబు సంధింప వెండియుఁ జక్రంబు క్రుంగినఁ గ్రమ్మఱ రథంబుడిగ్గి యెత్త నమరె నయ్యవసరంబునఁ గృష్ణపనుపునం) గ్రీడి దోడన. 357

మ. కులిశప్రస్ఫురణాపహాసనవిభాగుచ్ఛంబులం గల్గి యూఁ
కలిమై వచ్చుకృతాంతువక్త్రి మన నుగ్రంబై మురారాతిస
ద్రులచక్రంబును శూలముం దెగడుచుం గ్రూరంపు టొప్పారు నం
జలికం బైనమహాస్త్రముం దొడివి కర్షం బుబ్బునం జేయుచున్. 358

క. ఏను దపశ్చరణంబున, దానంబున గురుజనాభితర్పణమున ని
త్యానూనవ్రతశీలుఁడ, నేనియుఁ గర్ణుతలఁ ద్రెంచు నీశర మనియెన్. 359

క. అని తెగ నిండఁ దిగిచి యేసిన నయ్యస్త్రంబు రోదస్సేసుహారంబుం
దనమెఱుఁగుల నించుచు నిరు, మొనలజనుల గాఢమూర్ఛ ముంచుచు నిగిడెన్.

— అర్జునప్రయుక్తం బగుఘోరశరంబు కర్ణుశిరంబుఁ ద్రుంచుట. —

చ. నినదసముద్భటస్ఫురణ నింగి పగుల్పఁగ నస్త్రఘాతకం

1. (.........) ఈపాఠము పెక్కుప్రతులఁ గానిపింపదు.

వన మగు చెమ్మెయిన్ నిగిడి । పార్థివసత్తమ యేమి సెప్పుదుం
దునిమె శిరంబు రక్తమునఁ । దోఁగుచుఁ గర్ణునియట్టి వజ్రఘో
రనిహతిఁ గూలుశైలశిఖరాధరణంబున ¹వలఁపింపఁ బట్టుగన్. 361

క. చరమగిరినుండి పడియెను, తరణికరణి సూతపుత్త్రు । తల వడిఁ గాంతి
స్ఫురణోజ్జ్వలంబు పతిసుందరవదనము నగుచు నెత్తురు । ధరణిం బడియెన్. 362

తే. అధిప యంతన తను విచ్చి । యఖిలజనులు
గనుఁగొనంగ నయుజ్జ్వలతనువు విడిచి
చని సముద్దీప్తమైన తేజంబు వారి
జాప్తబింబంబు సొచ్చె న । త్యద్భుతముగ. 363

వ. అట్టియెడ. 364

క. వినుము మహీసురశాపము, మనుజేంద్రా సూతపుత్త్రు । మరణాంతంబై
యునికినొ రథచక్రము మేదినిఁ గ్రుంగుట లేక తొంటి । తెఱఁగున నుండెన్. 365

తే. దారుణాస్త్రజాలాంశుల । శత్రుసైన్య, తాప మొనరించి యాసూత । తనయతరణి
పార్థదుస్తరకాలవై । భవము గడప, ననువు లేమి నవ్విధమున । నస్తమించె. 366

క. సూతతనూజుఁడు పడినం, బ్రీతిం బాంచాలు రార్వఁ । బెల్లుగఁ దూర్య
వ్రాతంబు సెలఁగ సమ్మో, దాతిశయము వొందెఁ బాండ । వానీకంబుల్. 367

క. నిడుఁగేలుఁ బలుతొడలు, న్వెడఁదయురము నై రణావ । నిం గర్ణునొక్కల్
పడి యున్నఁ గని విషాదం, బడరి తొలఁగుమాన్చెఁ గ్రుంకి । నరుఁ డంతన్.

తే. నిర్గతప్రాణు రాధేయు । నిజకరములఁ, గరుణ పెంపున నంటుట । కారణముగఁ
బావనస్నాన మొనరింపఁ । బోవునట్టు, లపరజలనిధిలోనికి । నరిగె నినుఁడు. 369

వ. అప్పుడు. 370

తే. కామఁ బాసినకమలంబు । కరణిఁ బొలుపు
కర్ణుతల యిలఁ బడియు ను । దీర్ణకాంతి
నొప్పునట్టయుఁ జూచి శ । ల్యుండు నిశము
ద్రెస్సి మోమైనయరదంబు । ద్రిప్పె నధిప. 371

క. బలితపు విన నాభీతుం, బులి గొనినం బసులు వాఱు । పోలికిఁ గ్రోధో
జ్జ్వలుఁ డగుపార్థుఁడు కర్ణునిఁ, బొలియించిన నీదు సైన్య । ములు వెఱఁ బఱచెన్.

తే. దీనవృత్తి శల్యుండు నీ । సేనజనులు, నల్లు పాంచాలు రుబ్బున । నార్వ సిగ్గు
వడక పాండవమధ్యము । నిశము మరలి, మరలి చూచుచుఁ బాఱె స । మనుజనాథ.

ఉ. గాండివముక్తబాణమునఁ । గర్ణుఁడు గూలుటయుం దలంకి శ
ల్యుం డరదంబు దోలుటయు । నొక్కొకఁడై భవదీయసేన లొం
డొండ ²కలంగి పాఱుటయు । నుల్లసితుం డయి చూచి వాయుపు

1. గ. జ. దలఁపింపనట్లుగన్. 2. క. కలంగఁ బాఱుటయు.

త్రుంను మహావిరావమున రోదసి పిక్కటిలంగ నార్చినన్. 374

క. ఆ నినదంబునఁ బాండవ, సైనికహృదయములు సౌఖ్యరసాస్పద నొందెన్
మానవనాథ భవత్సుత, మానసములు శోకఘూర్ణమానము లయ్యెన్. 375

వ. ఇవ్విధంబున నరదంబు దోలికొని యరిగి యమ్మద్రపతి బాష్పాకులలోచనుండును దీనాననుండును సుదీర్ఘతరనిశ్శ్వాసుండును నై యున్నకౌరవేశ్వరుం జేరం జని యతనితో ని ట్లనియె. 376

చ. నరవర యెందుఁ జూడమె రణంబులఁ గర్ణుఁడు నర్జునుండు నం
గర మొనరింతురే యిటులు క్రౌర్యనిరూఢికి దివ్యలొంది ర
శ్చైరు వది యట్టు లుండె విను చెప్పెద నెంతయు భీతిఁ బొంది రా
హారియు నరుండుఁ గర్ణువసి ¹కంత విఘాత్ముఁడు దప్పె వానికిన్. 377

వ. అని వెండియు. 378

మ. ధరణీచక్రము నీవ యేలుటకు నుత్సాహంబు వాటించి పో
రిరి ప్రాణంబులు డాఁపమిం బడిరి వీరిం జూడు మంచుం దురం
గ రథేభంబులు చుట్టుఁ గూలి వికటాకారంబు లై యుండ నొ
ప్పి రణోర్విం బడి యున్న భూపతులఁ జూపెం జూపి యా రాజుతోన్. 379

వ. మఱియు నమ్మద్రపతి యింద్రయమవరుణకుబేరులఁ బోల్పం దగినయింతలింతలు మేటిమగలు మనకార్యంబున కై శౌర్యంబును బాహువీర్యంబును మెఱయించి ధైర్యంబు వోఁగ డొందం బెనంగుట విఫలం బగుట విధికృతంబు దీనికి వగవం బని లే దని చెప్పి ధనుఃఖండంబుల నాయుధశకలంబులఁ గేతనాతపత్ర చామర గజఘంటాతురంగకింకిణులతునియలం గంకణకేయూరహారమకుటంబులతుమ్ముల్ల నభిరామభీషణం బగురణాంగణంబు నూపి నీకయి పెనంగి నమసినసైన్యంబు నాలోకింపు మనునప్పు డసురాంతపార్థులు పాంచజన్యదేవదత్తంబులు పూరించిన నింగి వగుల్చునమ్మహారవంబున గుండియ లవిసి కురుబలంబు లత్యంతవికలంబు లయి వినిపాతితరావణనందనుఁ డగుసుమిత్రానందనుసింహనాదంబున భయం బంది పఱచుదానవసేనలచందంబున నీకోడు కున్నసెలవు విడిచి పలియం బాఱిన వెలవెలం బాఱునక్కురుపతితో నాశల్యుండు సంధ్యాసమయం బయ్యె నేఁటికిఁ గయ్యంబు చాలింపుము వేగుటయుఁ జేయవలయుకర్జంబు సూచికొంద మనియె నట్టియెడఁ గృపాశ్వత్థామకృతవర్మశకునిసుశర్మప్రభృతు లగుదొరలు పాండవజయంబునకు దైన్యంబు నొందినయాననంబులతో నిశ్శ్వాసంబులు నిగుడ నక్కురుపతిఁ జేరం జనుదెంచిన నతండు మూఁకల మరల్ప రామియు దొరల యుత్సాహవైకల్యంబును శల్యుమాటలతెఱంగు నూహించి మరలి కర్ణుం బేర్కొని విలాపంబు సేయుచు హా కర్ణ హా కర్ణ యను నెలుంగులతో ²(బలంబులఁ

1. క. గ. త. నంత. 2. (...) ఇది కొన్నిటఁ గానరాదు.

దివియ నియమించినం (దివిసి) కౌరవులు దోడం జనుదేర నిజశిబిరంబునకుం బోరెఱు నపస్నృట జూదంబున నోడి పాండునృపకుమారులు పురంబు వెడలి యడవికిం బోవునప్పటిభంగి యై యుండె నయ్యవసరంబున. 380

చ. తనయులఁ గర్ణబాణము లుకడాత్తగతిం జెలు వొందఁ గౌరవుల్
కనుకనిఁ బాఱ శౌరియును । గవ్వడియుం జెలుఁ గొంది రొక్కెడ
న్వినుతమరీచు లై పొడిచి । నిర్భరసంతమసంబు నల్గడం
జన నభిరామమూర్తు లగు। చంద్రుని సూర్యునిఁ బోల్పఁ బట్టుగన్. 381

వ. ఇట్లొప్పి యమ్మహాబలపరాక్రములు వెలికి వైచి యొండొరులయాననంబు లాలోకించి రాత్రిముఖంబున విరోధుల వెనుకొనుటకు సమయంబు గాదని సంభాషణంబులు సేసి తమసేనలం దివియ నియమించి. 382

తే. బలుఁగిఁ దెగటార్చి మరలుగోపతియు హరియుఁ
బోరః గర్ణుని నపుయించి । లీల మెఱయ
మరలి రత్యంతమోదసంభరితు లగుచుఁ
గవ్వడియుఁ గృష్ణుఁడును బంధుగణము లలర. 383

వ. అప్పుడు దివ్యు లన్నరనారాయణుల ననేకప్రకారంబులం బ్రశంసించుచు నిజనివాసంబులకుం జనిరి పాండవసేనాజనంబులు సంతసంబునఁ దేలుచు ధనంజయుం జెలంగి పొగడుచుం బోయి రివ్విధంబున జయంబునం బొంపిరివోవుచుఁ బాండవులు విడిదల కరిగి ధర్మనందనునగరివాకిగసాలఁ జొచ్చి రట్టియెడ. 384

క. చెన్నుగఁ బాంచాలురు మును, మున్నానృపుకడకు నేఁగి । ముదితాత్ములై
యున్నయతనిఁ గని దీవన,ల న్నుతులను నమ్మదానుశలావములఁ దగన్. 385

వ. గారవించిరి విప్రవృద్ధుండు వేగంబ యరదంబు డిగ్గి చని యజ్జనపతిచరణంబులకుఁ బ్రణామం బైన నతం డెత్తి యాలింగనంబును మూర్ధఘ్రాణంబును జేసె భీమనకులసహదేవు లన్నరదేవోత్తమునకుఁ బ్రణమిల్లి పార్థుం గౌఁగిలించిరి కృష్ణసాత్యకు లప్పాండవాగ్రజునకు సవినయప్రణామంబు లాచరించిన నమ్మహీవరుం డభినందించె నప్పుడు కృష్ణుం డతని కిట్లనియె. 386

—•• శ్రీకృష్ణుఁడు ధర్మరాజుతో సరససల్లాపంబు చేయుట. ••—

క. భువనము లన్నియు నొక్కటఁ, గవిసియుఁ గర్ణుఁ బరిమార్పఁ । గానోపునె భూ
ధవ భవదీయక్రోధాగ్ని విహతుఁ డై క్రాఁగెఁ గాక । నిక్కం బరయన్. 387

ఆ. రథికవర్యుఁ డైన । రాధేయుపొలిసిన,యపుడ [1]యెల్లఁ బొలిసె । నని తలంపు
కౌరవుల కడంగె । వైరంబు నీ కింక, నెదురు లేదు ప్రీతిఁ । బొదలు మధిప. 388

చ. అన విని యమ్మురాంతకున । కానృపుఁ డిట్లను నీవు చక్కఁ జూ
చిన సులభంబు శోభనము । శ్రీధర నీదగుకూర్మి కేను భా

1. క. ఛ. యాప.గఁ బొలిసె – గ. పెలుఁచఁ బొలిసె.

జన మటె నాకు దుష్కరమె | శత్రుజయంబు భవత్ప్రసాదజీ
వనులము మాకు సంపదలు | వచ్చు నవశ్యము నింత నమ్ముమున్. 389

ఆ. అఖిలరక్షకుండ | వగునీకు భక్తుల, మైనమమ్ముఁ గాచు | టరుదె తలఁప
భయము నెవ్వగయును | బాసి నాకంటికి, నిద్దుర వచ్చు నేఁడు | నీరజాక్ష. 390

వ. అనవుడు నచ్యుతుండు. 391

చ. మనమునఁ గూర్తి గాన తగుమాటల నాకుఁ బ్రియం బొనర్పు టొ
ప్పును విను మీజయంబునకు | భూవర యేను నిమిత్తమాత్ర మీ
యనుజులు నీమఱందులు మహాద్భుతవిక్రమశీలు రిట్టిని
న్నొకఁడు పోర మార్కొనఁగ | నూల్కొని రూపఱ కుండ నేర్చునే. 392

వ. అని యిట్లు మధురసల్లాపసౌఖ్యంబు నొంది ధర్మనందనుండు పొలికలను సూచు వేడుక దనకుం బుట్టినఁ గృష్ణునితోడం జెప్పి యతం డనుమతి సేయం గాలవాలం బులు దంతవర్ణంబులు నగురథ్యంబులఁ దనరథంబునఁ బూన్పించి యారో హణంబు సేసి కరదీపికాసహస్రంబులు వెలుంగ సమస్తబంధుమిత్రసోదరపరి వృతుం డై యరుగునప్పుడు కృష్ణు నాలోకించి. 393

ఆ. సకలధరణివలయసామ్రాజ్యమునకు నేఁ, డేను భర్త నైతి | నెల్లపెంపు
గలిగి నీదుకరుణఁ | గడిఁదిమగం డగు, పగతుఁ డశ్రమమునఁ | దెగుటఁ జేసి. 394

క. అని కీర్తించుచు నరుఁ గనుఁగొని యగ్గించుచు ముదంబు | గూరినమదితోఁ
జని కర్ణునిశిరమును దత్తనయులగాత్రములుఁ జూచె | ధరణీనాథా. 395

వ. చూచి తన్నప్పుడు గ్రమ్మఱ జన్మించినవానిఁ గాఁ దలంచి యాపదలకుం బాసి సంపదలకు భాజనంబ నైతి నని యూఱడిల్లి యుల్లాసంబున మరలె నిట్లు కర్ణ సాగరంబు గడవ నీఁది పాండునందనులు పరమానందంబు నొంది రని సంజయుండు ధృతరాష్ట్రునకుం జెప్పె నని జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె. 396

చ. అనలుఁడు భాస్కరుండును సుధాంశుఁడు నధ్వరసంప్రవర్తకుల్
వినుము నరేంద్ర యాక్రతువు | విష్ణుమయం బిది నిర్వహించి ర
ర్జునుఁడును గర్ణుఁడున్ సమరరూపమునం దగ నీప్రబంధ మిం
పొనరఁ బఠించినన్ వినిన | నొందు నరుం జిరసౌఖ్యసంపదల్. 397

వ. అనుటయు. 398

చ. ప్రకటమహార్థసారభవపరాశరనందనవాక్యమంజరీ
ప్రకరసమర్చితా పరమపావననామ జగత్త్రయీవిధా
యకపరిరక్షకప్రతిసమాప్తికారకచిత్తవృత్తిభా
వక భవబంధమోచన దివాకరచంద్రకృశానులోచనా. 399

క. వినతదురితనిరసనసమ్మద, జనసకలాకల్య[1]చరణసంభావన పా
వనతటినీమాల్యా నమ, స్తనిగమసంవేద్య పరమసంయమిహృద్యా. 400

మాలిని. కరణఫలపరిత్యాగ[2]వ్రతోదాత్తచేతః
పరిణత[3]సుఖశీతభ్రాజమానా నతాంహో
నిరసనచర[4]ణాబ్జోన్నిద్రతా రాజమానా
నిరవధిపరిణాహా నిర్భరానందదేహా. 401

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతంబునం గర్ణపర్వంబునందు సర్వంబును దృతీయాశ్వాసము. 402

శ్రీమదాంధ్రమహాభారతమునందలి
కర్ణపర్వము సమాప్తము.



1. ఖ. దివ్యచరణసుసంభా, వనతటినీ. 2. గ. వ్రతోపాత్తచేతః. 3. క. ముఖశీత_గ. సుఖదేష్ట_జ. ముఖపీఠ_భ్రాజమానా:_ఙ. సుఖపీఠభ్రాజమానమహా, 4. క. ణాంభోజనిష్పృతభావాంజమానా.



హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## శల్యపర్వము, ప్రథమాశ్వాసము.



గిరిజానుషవాయమ
హాగురుతరశుభగసంపదాలంబనసదా
యోగిజనక్షేమసమీ
హాగర్భితదివ్యచిత్త హరిహరనాథా. 1

క. దేవా జనమేజయధాత్రీవల్లభుఁ డుత్సుకత్వరేఖాసౌమ్య
శ్రీవిలసితుఁ డై యిట్లనుఁ, డా వైశంపాయనున కుదాత్తవినీతిన్. 2

క. దురమున నమ్మెయిఁ గర్ణుఁడు, పరిమార్పంబడిన నల్పపరిజనుఁ డై యి
క్కురుపతి యుద్యమ్ము లగున, య్యరులయెడం బిదప నెట్టు లయ్యె మునీంద్రా. 3

తే. ఏను మును విన్న యక్కౌరవేంద్ర పాండు
విభుతనూజులచరితంబు వేడ్కఁ బెంచెఁ
జెవులతియ్యంబు దళుకొత్తఁ జెప్పు మనఘ
వారి దైన యనంతరప్రవర్తనంబు. 4

వ. అని యడిగిన వైశంపాయనుం డమ్మహీనాయకున కిట్లనియె నట్లు కర్ణుండు దెగిన దుర్యోధనుండు హతావశిష్టవసుధావరులు పరివేష్టింపఁ గొంచెపుమూఁకలతోడ విడిదలకుం జని సుహృజ్జనంబులు దీర్ఘవిషాదం బుడిగి సముత్సాహదోహలి యై శల్యునిం దనకు సేనాపతిఁ గావించి వేగుటయు బలువును బొలువును వెలయఁ బోరికలనికి నడచెఁ బాండవేయులును [1](బలంబులతోడం) బన్ని యేతెంచిన[2](న య్యిరువాఁగునకు) సురాసురసమరంబునుం బోనిసంగ్రామం బయ్యె నంత మధ్యాహ్నంబున నమ్మద్రపతి యుధిష్ఠిరుపరాక్రమంబునం దెగియెఁ బదంపడి భటులుం జెలులుఁ జుట్టంబులును సమసిన నుక్కు దక్కి యక్కురువిభుం డనిపని సాలించి వెఱఁ బొందెడుడెందంబుతో నొక్కరుండును దొలంగం బాఱి యొక్కమడువు సొచ్చి దాఁగి యుండె నట గెలుపునుబ్బునం బొంపిరివోవుపాండవేయు లతం డం

(1) (2) ఇవి వ్రాఁతప్రతుల లేవు.

దునికి యెఱింగి యయ్యెడకు నరిగి నలిరేఁగి చుట్టుముట్టి పిలిచిన వెడలి వడముడి తోడి పెనంకువం బెద్దయుం బ్రొద్దు పెనంగి యా భూనాథుండు బ్రొద్దు సాలవ్రాలి నప్పుడు [1]భీమునిగదాఘాతంబునఁ దొడలు విఱిగి పడియె నంత నిశాసమయంబున నశ్వత్థామ కృపకృతవర్మలు దనకుం దోడుగా ధర్మనందనస్కంధావారంబుఁ బొదివి పాంచాలప్రభద్రకమాత్స్యప్రభృతిశేషసైన్యంబుల సమయించె మఱు నాఁడు సంజయుండు కురుక్షేత్రంబునందుండి పూర్వాహ్ణంబునఁ గరినగరంబున కరుగుదెంచి. 5

చ. పొరిఁబొరి మోము బాష్పజలపూరము గ్రమ్మఁగ నూర్ధ్వబాహుఁడై
చరణయుగంబు దొట్రువడ సంభృతశోకత రాజవీథి నె
వ్వరిఁ గని దైన్యమైన మహిమాతిశయవైభవ హాధృతరాష్ట్రపుత్త్ర హా
కరిపురనాథ యంచుఁ జెలుఁగు గద్గదికం దగులంగ నేడ్చుచున్. 6

క. జననయనచకోరానందనుఁ డగు నృపచంద్రుఁ డను చిరతం బయినవిధం
బున నస్తమించె నంచుం, [2]దనుడోలనభరితభూరిదైన్యుం డగుచున్ 7

వ. చని ధృతరాష్ట్రుమందిరంబు ప్రవేశించి లోపలికొలువున గాంధారియుం గోడం డ్రును విదురుండును మఱియును దగుచుట్టంబులునుం బరివేష్టింపఁ గర్ణలేమికిఁ బ్రేముడించుపలుకులు సెల్లనుల్లంబు చురపిల్ల నున్నయన్నరనాథుఁ గని డగ్గుత్తిక వెట్టుచుఁ దనపేరు సెప్పికొని చేరి పాదప్రణామం బాచరించి యేడ్పు బెరయు నెలుంగుతో నిట్లనియె. 8

సీ. జననాథ శల్యుండు సమసె సౌబలుఁడు గీ,టడఁగె నులూకుండు మడిసె సకల
సంశప్తకులు గడచనిరి కాంభోజశ,తానీకములు తెగటాఱె యవన
పార్వతీయమ్లేచ్ఛబలములు ద్రుంగె నల్,దిక్కులయున్నిలుఁ దక్కఁగలుగు
నరనాయకులును జచ్చిరి కుమారులు గల,యుంచకుఁ దెగిరి కర్ణాత్మజులును

తే. బొలిసి రయ్య వృకోదరుపలుకు దప్ప, కుండఁ దద్గదాదండప్రచండనిహతి
రెండుదొడలును విఱిగి ధరిత్రిఁ బెలుచఁ, గూలి రూపఱి రారాజు ధూళిఁ బ్రుంగె.

వ. మఱియు ధృష్టద్యుమ్నుఁడును శిఖండియు నుత్తమౌజుండును యుధామన్యుండును లోనుగాఁ గలపాంచాలురును జేరి మాత్స్యప్రభద్రకప్రభృతిబలంబులు లోనుగా నవశిష్టజనంబులును నీమనుమలైన ప్రతివింధ్యాదిద్రౌపదేయులును సకలరథసామజ ఘోటకసుభటసమేతంబుగా మృతిఁ బొంది రిట్లు కౌరవశిబిరంబును బాండవ స్కంధావారంబును విధివశంబున [3]వనితావశేషంబులయ్యె నిందుఁ గృపకృతవర్మలు నశ్వత్థామయుఁ గా ముగ్గురును నందుఁ బాండవు లేవురును గృష్ణసాత్యకులుగా నేడ్వురును భవత్సుతుం డయునయుయుత్సుండును శేషించి రివ్విధంబునఁ బమనో

1. క. తొనుబడియె-జ. తొను వ్రాలె_నంత. 2. గ. తనలోనన_జ తనుదోహల_భరిత. 3. గ. నిరవ శేషంబు లయ్యె.

కంటె నేడక్షౌహిణులు నఖిలక్షోణికి దుర్యోధను నధిపుఁ గావించుచు బాండవులుం బూని కాలం బగుటయు నాలంబున నిశ్శేషత్వంబు నొందెనని చెప్పుటయు నమ్మహీపతి మూర్ఛిల్లె విదురుండును వివశుండై యొఱఁగెఁ గాంధారియుఁ గోడండ్రును జెయ్యోది పుడమిం బడిరి తక్కటిచుట్టంబులు మొగంబులు మొగుడం జిత్రరూపంబులచందంబైరి సంజయప్రయత్నంబున నంతఃపురప్రకారంబునం దేఱి రప్పుడు మేను వడంక నమ్మానవనాథుండు నలుదిక్కులకు మొగంబు ద్రిప్పి విదురు నుద్దేశించి పుత్త్రహీనుండ ననాథుండ నగుట యెఱింగితే యమ్మిండ యిటమీఁద నీవ నాకు గతి యగు మనుచు మఱియుఁ గుఱుకుమూర్ఛాతిశయంబునం బరవశుం డయిన నతండును నారీజనంబును శీతాంబుసేచనంబులను లలితవ్యజనవీజనంబులను గొండొకసేపునకు సేదదేర్చినం గూర్చుండి యుక్కారు విభుండు గుంభినిక్షిప్త భుజంగంబుచందంబున నిశ్శ్వాసంబు సగుచ్చుచు నూరకున్నం గనుంగొని యక్కాంతాసముదయంబును సంజయుండును రోదనంబు సేసిరి పదంపడి యవ్విచిత్రవీర్యనందనుండు. 10

ఆ. అనఘ వశముగాదు ♦ మనసు గోడంత్రమి, పదిలపఱుపఁ జుట్టములకు ♦ సదనములకు
బుచ్చుమనియె [1]బలుకుఁ గలమ్మపాటడఁచుగ, దదికదైన్య మెసఁగ ♦ విదురుతోడ.

క. అనుటయు నాతం డంధనృపుని మెల్లపుఁ జెప్ప వగలఁ ♦ గుందుచు నల్ల
ల్లన తమనిలయంబులకును, జనిరి మఱియు నేడ్చుచుండె ♦ సంజయుఁ డలఁతన్.

వ. అమ్మేదినీశ్వరుం డేది గతి యని దుఃఖాతిశయంబునఁ జేతులువిదిర్చి యానూత
నందను దిక్కు మొగం బయి. 13

క. చావరు నొవ్వరు పాండవు, లేవురు నని నీవు చెప్ప ♦ విప్పులుపులు దుః
ఖావేశకరము లై చే, తోవృత్తి దహింపఁ జొచ్చె ♦ దుస్సహభంగిన్. 14

క. తనయులని నందఱుం బడి, రనఁగా విని పెక్కువ్రయ్య ♦ లై పోవక యి
ట్లునికి యరయ వజ్రమయం, బని తలఁపఁగఁదగు మదీయ ♦ హృదయంబున్.

ఉ. కన్నులు చీకులై సుతని ♦ కాయముబాలవిహారలీలలుం
జెన్నగు ప్రాయమందు విల ♦ సిల్లుతెఱంగును జూడఁ గాన కి
ట్లున్నను బంధుకోటి సమ ♦ యోచితలాలనఁ బల్కు పల్కులన్
విన్నవి వీను లిప్డు గొఱ ♦ వింద ముఃజూడిన యట్లు పొక్కెడిన్. 16

వ. అని దుర్యోధను నుద్దేశించి. 17

సీ. ఇట రమ్ము నన్నుఁ గౌఁగిటఁ జేర్పు కొడుక మా, యమ్మ యూరార్పరావ ♦ యన్నవృద్ధ
లగు మమ్ము విడుచుట ♦ దగునె యేగతిఁ బోవు, వార మెవ్వరికిఁ ♦ గౌరవేంద్ర
యంధత్వవికలుల ♦ నరయక యిట్లుపేక్షించితి నాయాఁదఁగృపమాఁ ♦ బ్రియము
నెక్కడఁ బోయె భూపాలుఱ గొలువంగ, నుండు [2]పీఁ వట్లాంబి యుండునాడ

1. [illegible]

తే. వధికబలదుర్నివారుండ | వైననీకుఁ, బాండుపుత్త్రులచేత నక్కటాఁ జావు
వచ్చెనిచ్చలు భక్తిమై | వచ్చి కొలిచి, గారవింప నిం కెవ్వరు | గలరునాకు. 18

వ. కయ్యంపుమాట పుట్టిన యప్పుడు నీవు నాతోడ. 19

శా. చాపాచార్యుఁడు భీష్ముఁడుం గృపుఁడు న | శ్వత్థామయుం గల్గ నా
కీపాండుక్షితిపాలపుత్త్రు లెదు రం | దెవ్వాఁడు దుర్వ్యాప్తభా
వ్యాపారుం డనిఁ గర్ణుఁ డొక్కరుఁడు మార్కయుం జేయు మద్బాణవి
ద్యాపారీణత గెల్తు నొక్కఁడన యే | నయ్యుగ్రులన్ వ్రేల్మిడిన్. 20

తే. మున్ను చెప్పినవారు గా | కెన్నఁ గలరు, సుమ్ము బాహ్లికభగదత్త | సోమదత్త
శకునిభూరిశ్రవశ్శల|శల్యసింధు, రాజవిందానువిందాది|రథికవరులు. 21

క. ఏనును గర్ణుఁడుఁ దమ్ములు, నానలువురు వీరలైన | నటు సూనుఁ పృథా
సూనుల నెట్లు జయించెద,నో నమ్మము నాబలంబు|ను గలితనంబున్. 22

క. అని యాజిసిల్లఁ బలికిన, విని భవదీయానవార్య|వి క్రమమునఁ బాం
డునరేంద్రసుతులు దెగుదుర, యని తలఁచితి నీవె తెగితె | యవ్వీరులచేన్. 33

క. అమరనదీతనయుఁడు సిం,హము గాక నరుండె పార్థుఁ | డట్టిమహాత్ముఁ
సమయించె నట్టు జంబుక,సముని శిఖండిఁ గొని విధి | కసాధ్యము గలదే. 24

చ. శరగురుఁ డట్టియోధుఁ డటె | చచ్చె ననిన్ దొర గానివానిచే
వెరవున లావునన్ జనులు | వెక్కస మందఁగఁ జేయు సింధుభూ
వరుఁ డటె రిత్తవోయె నసి|వార్యుల బాహ్లికసోమదత్తులం
బరు లవలీలఁ జంపి రటె | పల్కెదు నే మని యేను దైవమున్. 25

క. నీసమ్మినభూరిశ్రవుఁ, డేసికలా వతఁడు నెందు | నెన లేనిమగం
డైనభగదత్తుఁడును [1]వ,మ్మైన తెఱం గట్టె యేమి | యాడుదుఁ గుమారా. 26

ఉ. వచ్చిన కర్ణువిక్రమము|నం బరవీరులయందు దొకండునుం
జచ్చుటలేదు దుర్దమము | శల్యభుజావిభవంబు లోకముల్
మెచ్చినయట్టి దండు నొక|మేలు వినంబడ దమ్మహాత్ములన్
ముచ్చులఁజంపినట్టులు వ|రుల్ దెగటార్చిరి దైవమిచ్చినన్. 27

తే. కొడుక తమ్ములు దోడ్పడఁ|గడఁగి శత్రువరుల గెలిచెదనంటివో|యక్కరుఁడుదక్కఁ
కుండ నీతమ్ముఁగుఱ్ఱలు|నూచముట్టు, గానియైనే విధి యేగతిఁ | జనుదుఁ జెపుము.

క. కదిసి పవనజుఁడు బెట్టుగ, గద వేసినఁ దొడలు విఱిగి | కయ్యపునేలన్
మద మఱి పడినప్పుడు నీ,మది నేమని తలఁచితో | కుమార యెఱుంగన్. 29

వ. అని పెక్కుభంగుల విలపించి. 30

చ. తలపఁగ భాగ్యవంతుల కు|దాత్తసుఖం బగుః గాక పుణ్యహీ
నుల కది గల్గ నెచ్చునె త|నూభవు లాఱడి వోయి రింకగా

1. క. వమ్మైన తెఱఁగు అట్టి నేమి. గ. వమ్మైన తెఱఁగు వింటి నేమి.

సాయకంబులు సరకుఁగొనక గదం జిత్రంబుగా జడియుచు వడముడివిక్రమంబున దవులంబడక నిగిడె సశ్వసూతరహితం బగురథంబుపై నున్న యన్నరేంద్రుండు తన దెసకు సింహచంక్రమణత్వసుందరుం డై వచ్చువవ్వీరు నాలోకించి సక్రోధం బైనయవష్టంభంబున నుద్దీపితుం డై. 272

క. ఇతని సమయింప నచ్యు,తుఁడు ననుం బనిచె నాకు నొనరించినపా
లితఁ డని తలంచి మొగ ము,గ్రత నొందఁగ శక్తిమీఁదఁ గనుఁదోయిలయన్.

వ. హృషీకేశు నుద్దేశించి. 274

ఉ. నీదెస నాదుచిత్తమున నెక్కొని యుండెడుభక్తి భద్రసం
పాదిని గావు టచ్చెరువె భక్తజనాభిమతప్రదాసవి
ద్యాదయితత్వ మెప్పుడు జయంబు బొడఁచూపుము దేవ సంశ్రితాం
హోదళనంబు నీకు వ్రత ముల్లము నాపయి నిల్పు మిత్తఱిన్. 275

వ. అని హృదయంబునఁ బ్రార్థించి యప్పార్థివోత్తముండు. 276

ఉ. అచ్చపుభక్తికిన్ మతిఁ బ్రియంబున నొందినఫాలలోచనుం
డిచ్చినఁ బ్రీతియోగమును నెక్కొనుభక్తియు నావహిల్లఁగా
నిచ్చలు గంధపుష్పముల నిష్ఠమెయిం బరిశోభితార్చనం
బిచ్చుచుఁ దాను గొల్చు నతి నెక్కొనయమ్మహనీయశక్తికిన్, 277

మ. ప్రణతుం డై రథసోదయాభినవపర్వస్ఫూర్తి శోభిల్లు న
[1]న్మణిదండద్యుతిమంజరీస్ఫురణము న్సంశోభితుం డాపటు
క్వణనంబుం రిపుసైనికప్రకరదృక్కర్ణవ్యథం జేయ భీ
షణ రేఖం [2]బగుదానిఁ బుచ్చికొని చంచన్ముష్టిపృష్ఠస్థితిన్. 278

వ. అభిరామభీమాకారుం డై. 279

తే. నెరయుకినుకఁ బెన్నొడఁదయై నిప్పు లురలు
కన్నుఁగవ శల్యుఁజూచిన నున్నయునికి
నలఁడు నీటు గా కుంఠుట యరిది యయ్యె
మాకుఁ జూడంగ నప్పుడు మనుజనాథ. 280

వ. ఇట్లు రౌద్రోద్రేకంబునఁ బురత్రయదాహదోహలి యగుశూలాయుధులీల దోఁప దుర్నిరీక్ష్యుం డై. 281

ఉ. ఘోరతరప్రకార మగుచక్కుంచితబాహువిలాస మొప్ప వి
స్తారము వింత యాతురము సారతరంబుగఁ జూచి వజ్రధా
రారుచిసన్నిభప్రచురరశ్ములు పర్వఁగ బిట్టు వైచె న
ద్దారుణశక్తి నవ్విభుఁ డుదాత్తసమిత్కృతికల్యశల్యునిన్. 282

తే. అట్లు పాండుభూపాలకునగ్రసుతుఁడు, మద్రనాథునివైచిన రౌద్రమొనఁగ

1. క. ఫణిరత్నద్యుతిమంజరీస్ఫురణమున్. 2. క. గ; బగుదాణిం.

గంకటముహూర్తి వత్తుంబుఁగడచి వెన్ను, వెడలిచనియమ్మహాశక్తిఁ బుడమిఁ జొచ్చె.

### ధర్మరాజు శక్తి ప్రయోగించి శల్యుని జంపుట.

వ. ఇట్లు శక్తి వెడిదంపుటురవడి నుచ్చిపోయిన. 284

చ. ఉతిమున ముక్కునం జెవులఁ గన్నుల నొల్కెడు రక్త మంగ మా
ప్లుతము గఁ జేయఁగా నతఁడు బోరగిలం బడియెన్ ధరం గర
ద్వితయము సాఁచి ధర్మజునిదిక్కు శిరంబుగ వజ్రదారుణా
హతిఁ బడుభూరిభూధరముఁ హోత్తశృంగముభంగి భూవరా. 285

ఆ. భూమిమీఁద నిట్లు బోరగిలం బడి, మద్రనాథుఁ డొప్పె మానవేంద్ర
లేమయురమునందు లీలమై వ్రాలిన, ప్రాణనాథుఁ [1]బోల్పఁ బట్టు గాఁగ. 286

ఆ. ధర్మసంగరమున ధర్మజుచేఁ జచ్చి, పొలిచెఁ జూడ మద్రభూవిభుండు
విధియుతంబు గాఁగ వేలిచి విడిచిన, నాఁటి యున్నయగ్ని ననుకరించి. 287

మ. కని శల్యానుజుఁ డేచి ధర్మసుతు నుగ్రస్ఫూర్తి శోభిల్లఁ దాఁ
కిన నాభూపతి చిత్రచాపధరుఁ డై కేళీసమప్రక్రియన్
ధనువుం గేతువుఁ ద్రుంచి తోడన సముద్యద్దీప్తభల్లాహతిం
దునిమెం గుండలకాంత మైనశిరముం దుర్దాంతదర్పంబునన్. 288

వ. ఇట్లు శల్యుండు సోదరసహితంబు గా బడినఁ బాండవసైన్యంబుజనంబులు వృత్ర
వధం బొనరించుపాకశాసనుఁ బ్రశంసించుబృందారకులట్ల ధర్మనందను నగ్గించి
రమ్మొగ్గరంబునం దూర్యనినదంబులు సింహనాదంబులుఁ జెలంగఁ గలంగి కురు
సేన విఱిగి పఱచినం బోనీక పొదువుం డనుచు సాత్యకి వెనుకొనుటయుఁ గనుం
గొని కృతవర్ముండు మార్కొనియె నయ్యాదవసింహులరణంబు దారుణం బయ్యె
నందు. 289

సీ. కృతవర్మ సాత్యకి నతిశితశరదళ, కమున నొంచి తురంగముల[2]యుబ్బ
నుడిపి విల్లునువుటయును నొండువింట, నబ్బలియుఁ డాతని మేనఁ బదిమెఱుంగు
టమ్ములు వఱపి రథ్యమ్ముల నరదంబు, సూతుని నఱికినఁ జూచి కృపుఁడు
దన తేరిపైఁ బెట్టుకొని తొలఁగించె, నవ్వీరుపోరికి మూఁక వెఱచి పఱచెఁ

తే. గడఁగి వెనుకొన్నపాండవోత్కరము నొకఁడ, నిలువరించె[3]నుద్దండుఁడై సనీతనూజుఁ
డంత వేఱొక్క తేరెక్కి యరుగుదెంచి, తాఁక హార్దిక్యుఁ డరిసేన తల్లడిల్ల.

వ. ఇట్లెదిర్చినఁ బేర్చినయలుకఁ బాండవాగ్రజుండు కృతవర్మనిఘోటకంబులను గీ
టడంగించినఁ గురునందనుం డాహార్దికనందనుని నిజస్యందనంబున నిడుకొని య
వ్వలికిం గొనిపోయె నప్పుడు కృపాచార్యుండు గదిసిన నయ్యుధిష్ఠిరుం డాఱమ్ము
లెమ్ములం గీలింప నతండు పదాఱుతూఁపుల నాభూపాలునిఁ దదీయతురంగంబుల
నేసె నాసమయంబున. 291

1. క. దలఁప. 2. గ. యుఁ బ్బడంచి విల్ వెసఁ ద్రుంచుటయు. 3. ఆ. సముద్ధతి.

తే. భద్రకరి నెక్కి చామరప్రకరవీజ
నములు ధవళాతపత్రవిభ్రమసమృద్ధి
యతిశయిల్ల సైన్యోత్సాహ మావహిల్లఁ
బొలిచె నంతయు భవదీయపుత్త్రుఁ డధిప. 292

—౦• శల్యుచట్టంబు లొక్కఁబెట్ట ధర్మరాజుం జుట్టు ముట్టుట. •౦—

ఉ. అమ్మనుజేంద్రుముందటికి నార్పులతోఁ జనుదెంచి శల్యుజు
ట్టమ్ములు సత్వరమ్ముగఁ గడంగి యనేకులు వీరయోధు లు
గ్రమ్ముగ వీఁకఁ జేరులు పొగడ్తకు నెక్కఁగ దీప్తమైనకో
పమ్మున నేచి పాండవులపై నడరం గని పేరెలుంగునన్. 293

వ. అన్నరనాథుండు. 294

తే. మీర[1]లెవ్వరు వడిఁదలమిగిలిచనఁగ, వలదునామ్రోలబలుపారి నిలువుఁడనియె
వారు నిలువక పాండవబలము చేవ, దఱుఁగఁ జొచ్చె యుధిష్ఠిరుఁ డాఁకి రథిప.

వ. ఇట్లు చలంబున నవ్విభుండు దలఁపడి వివిధాస్త్రంబుల నొప్పించినఁ గవ్వడియును వడముడియుఁ గవలును ద్రౌపదీకొడుకు లేవురును గోవిందుతమ్ముండును ధృష్టద్యుమ్నుండును శిఖండియును జండరయంబున నుద్దండచతురంగసమేతులై యారథికులఁ బొదువుటయును వారు వీరోద్రేకంబున సైన్యసాగరంబున నున్నదమకరప్రకరంబులవిధంబున విహరించి రట్లు పాండవసేనాక్షోభసంపాదు లగునాజోదులయాటోపంబు విలోకించి గాంధారపతి గాంధారేయు నాలోకించి. 296

తే. మద్రవిభువారినమ్మియిమ్మహార్తురాఁగి, కొనఁగమనకును పేటింపఁ జను నెయనుడు
నతఁడు నామాట వినక వారరిగి రేమి, సేయువారము చెప్పు మౌచిత్య మనియె.

వ. అని నన్ను నాపరివారంబును రక్షింపను దగ వెఱింగింపను నర్హుండ వీవ కావె యనుమాట లాడిన నతండు ప్రీతుండై బలపరిపాలనంబును గర్జంబు సెప్పుటయును దనపనిగా మనంబునం బూని యవి దోఁచునట్టియుచితవచనంబుల నవ్వసుమతీపతికిఁ బ్రియం బాపాదించి. 298

చ. వినుము నరేంద్ర సైనికులు విక్రమలీల నరాతిసేన సొ
చ్చినఁ బతి గావ కున్న నుపజీవులు మెత్తురె యన్నఁ గాతుఁ గా
కని బహుతూర్యనాదములు నార్పులునుం జెలఁగంగఁ ద్రోచి య
జ్జనపతి వీఁకమై నడరె సైన్యయుతంబుగ సత్వరంబుగన్. 299

క. అంత ధనంజయకిర్మీరాంతకముఖయోధవరమహాస్త్రప్రకరం
బంతకుకడ కనిచెఁ బరిక్రాంతం బగుమద్రనాథురథికచయంబుల్. 300

వ. ఇవ్విధంబున. 301

1. క. లేర్పడ వడిఁ దల_ గ. లేర్పడ విడిదలఁ

మ. అరులం గీటడగించి పాండుసుతసైన్యం బుబ్బి హైఁ గ్రమ్మినం
గురుభూనాయకసేన నొచ్చి కలయం గూలెన్ ధరన్ గుంపులై
తిరుగం బాఱఁగఁ జొచ్చె విచ్చె మరలెన్ దిగ్భ్రాంతి వాటిల్ల న
త్తెఱఁగెల్ల నల్లడఁ బాఱె నవ్విభుఁడు గర్వం బేది వెల్వెల్లఁగన్. 302

క. మనవారి కపుడు భీష్ముని, చనుటయుఁ గోదండగురుని సమయుటయును గ
ర్ణుని పాలియుటయును గ్రొత్తై, మనమున ¹నెనఁబాటు గదిరె మనుజాధీశా. 304

వ. అప్పు డద్దిక్కుజనంబులు.

చ. ధరణికి నింక నాయకుఁడు ధర్మతనూజుఁడు నేఁ డవశ్యముం
గురుపతి గూలు నెవ్వగలఁ గుందు రయ్యెడు నాంబికేయుఁడు
దురు లగుపాండునందనులదుర్దమభంగి యెఱింగి ధర్మత
త్పరులకు గెల్పు బ్రాఁతె హరిసద్భక్తులఁ బొందవె భూరిసంపదల్. 305

వ. అని రట్టియెడ నీకొడుకు నిజసారథిం జూచి మనబలం బాహవంబున గ్రోహ
టించి పాఱెడు నిత్తఱి నేను బరవసంబు సేసినఁ గాని నిలువ దవ్విధంబునకు
రథం బనువై యుండఁ జేసి చేరఁ దెమ్మనిన వాఁ డట్ల చేయ నతం డేనుంగు
డిగ్గి రథం బెక్కి యెక్కుడుమగటిమిం బొంగునంగంబులతో సైనికుల కడ్డంబు
నని యెలుం గెత్తి. 306

ఉ. ఎక్కడఁ ²బోవ వచ్చు గిరు లేనియుఁ గాననభూము లైనఁ దో
సెక్కియుఁ జొచ్చియుం బగతు రేడ్తెఱఁ గిట్టి చలంబునం దలల్
ద్రొక్కక తక్క రట్లయిన దుర్గతి వాటిలుఁ బోక నిల్చి పే
రుక్కునఁ బోరినన్ సుగతి ³యొండెను సంపద యొండెఁ జొప్పడున్. 307

వ. అట్లుం గాక. 308

క. పాండవబల మల్పం బై, యుండం గృష్ణుఁడు ధనంజయుండును దప్పిం
బెండువడఁగఁ గని మనకును, గం డడఁగఁగ నేల గెలుపుఁ గైకొనవచ్చున్.

వ. అని పలికి కరతలం బెత్తి నిలు నిలు మనిన నబ్బలం బతని నగ్గించుచు మరలె
నమ్మేటిమగండు ముంగలి యయి నిలిచి హొంగారం గవియు కౌంతేయసేనా
సముద్రంబునకుఁ జెలియలికట్ట యయ్యె నయ్యవసరంబునందు మునుకొని
వడిం దఱుమువడముడిం బొదివి మనపదాతిప్రకరంబు దర్పంబున నార్పులు
బొబ్బలుం జెలంగ బహువిధశస్త్రాస్త్రంబులు వఱఁగించినం బెరిఁగినమదాతిరేకం
బున గదాదండంబు ధరియించి ఘోరాకారుం డగుచుఁ దేరు డిగ్గి పేరడవిఁ
గూల్చు వెనుగాలికై వడి నతం డేకవింశతిసహస్రసంఖ్యసుభటుల నేలపాలు సేసె
నప్పుడు. 310

క. కరిహయరథబృందం బుద్ధురత నడరెఁ బాండునృపసుతులమూఁకలపై

---

1. క. గ. బెనఁబాటు. 2. క, వోవ. 3. అ. యొండె జయంబును నొండె.

నరుఁ డబ్బలంబునకు నిష్ఠురగాండీవముక్తశరప్రకటత్వము సూపెన్. 311

క. నకులసహదేవులును సాత్యకియును రభసమున వాలుశరములు నిగుడన్
శకునిపయిఁ గవిసి రతఁడును, బ్రకటస్ఫురణంబునం దిరం బై పోరెన్. 312

చ. సమదగజాధిరూఢుఁ డయి సాల్వుఁడు పాండవసేనఁ జొచ్చి ఘో
టములఁ గలంచుచుం గజఘటల్ విరియించుచుఁ గాల్బలంబుఁ జి
త్రముగ వధించుచున్ రథకదంబములం జదియించుచుం బ్రహో
గ్రముగఁ జరించువిస్ఫురణఁ గన్గొని కోపసముద్భటాకృతిన్. 313

ధృష్టద్యుమ్నసాత్యకులచేత సాల్వుఁ డేనుంగుతోడఁ బీనుంగై పడుట.

వ. ధృష్టద్యుమ్ను డెదుర్కొనిన నతనిఁ ద్రొక్కించువాఁ డై యవ్వీరుండు వారణ
పతిం గొల్పిన నతండు. 314

మ. పటునారాచచయంబు కుంభయుగళీభాగంబునం బెట్టి నా
టుటయుం గ్రొవ్వఱి పాఱె నగ్గజము సాటోపంబుగాఁ గ్రమ్మఱిం
చుటకుం సాల్వుని మెచ్చఁ గన్గొనుజనస్తోమంబు కోపోద్ధమో
ద్భటవేగంబున వచ్చి పట్టె నది యాపాంచాలుతే రుగ్రమై. 315

క. అతఁడు గద చేతం గొని, భీతి గదురుమనముతోడఁ బృథ్వికి దాటన్
సూతాశ్వసమేతంబుగ, నా తేరయ్యేనుఁ గిత్తె నాకసమునకున్. 316

ఆ. ఎత్తి త్రిప్పి యూడి యిలతోడ వేసిపాదములఁ జమపఁ జూచి దారుణాస్త్ర
తతులు నిగుడఁ బవనతనయశిఖండిసాత్యకులుసాల్వుఁ దాఁకి రతిరయమున.

క. అతఁ డందఱబాణంబులు, వితథంబులు సేసి యస్త్రవిద్యాపారీ
ణత సూపె నవ్విధం బద్భుతము [1]వినిచె గగనచరతతులచిత్తములన్. 318

వ. అప్పుడు. 319

తే. [2]అజ్జపాటించి మదివెఱ ముజ్జగించి,రయము మెఱయునప్పాంచాలరాజసుతుఁడు
గదిసి యెగసి కుంభస్థలి గదఁ బగుల్పఁ, గొండ గూలిన ట్లక్కరి గూలె నధిప.

క. ఆలోనన శినివరుఁడు వి, శాలాస్త్రప్రదరనిహతి సాల్వునిశిర మా
భీలముగఁ దుంప నాతఁడు, గూలిన మనమూఁక విచ్చెఁ గురువంశనిధీ. 321

ఉ. వాలి యెలుంగు సూపి కృతవర్ముఁడు సైన్యము నిల్పి రించి యు
న్మీలితవిక్రముం డగుచు మేమెయి నాతనిఁ దాఁకె నస్త్రవి
ద్యాలసితుండు సాత్యకి యుదగ్రత వారలు పోర వారిదో
ర్లీలలు సూచి రోటువడి రెండుబలంబుల యోధవీరులున్. 322

వ. ఇట్లు పెనంగు చుండి. 323

క. కృతవర్మ నొంచె నెనిమిది, శితశరముల శినివరుండు శినివరు నావం
బతఁడు దునిమె బలువిలుఁ గొని, యతనిహయంబులను సూతు నాతఁడు గూల్చెన్.

1. గఁ బరిచె. 2. క. గ. అజ్జ...తెఱ బుజ్జగించి

మ. విరథుం డై యభిరామహేలమున నవ్వీరుండు శైనేయు నై
చె రయం బార నతండు భల్లమునఁ ద్రుంచెం బెక్కు తుండంబు లై
తొరుఁగం జూచి విషాది యై నిజరథస్థుం జేసి తద్బాణగో
చరతాదుర్దశఁ గాఁ బృథోద్యము గృపాచార్యుండు తప్పించినన్. 325

క. మనసేన విఱిగె నృప నీతనయుం డొక్కరుఁ డుదగ్రతరముగఁ గుంతీ
తనయుల నద్దెసఁ గలయోధనికాయముఁ బొదివెఁ బాణధారలఁ బెలుచన్.

మ. పతి యిమ్మై సముదీర్ణవిక్రమకళాపారీణుఁ డై విద్విష
చ్చతురంగంబులయందు నొక్కటియు విస్పష్టోల్లసన్మార్గణా
హతికిం దప్పక యుండునట్లుగ సమగ్రాశ్చర్యసంపాదకో
ద్ధతిబాహావిభవంబు సూపె సురబృందస్తోత్రపాత్రోద్ధతిన్. 327

వ. అప్పుడు రెండువిండ్ల నతనిపాటి మేటిమగలు లే రనుబుద్ధి నాకుం బొడమెఁ బదంపడి పాండవులును జేయుఁగలవారలును నవ్విభుం బొదివిన నతం డందఱ కన్నిరూపు లై ధర్మసుతుని శతశరంబులను భీమసేను డెబ్బదిసాయకంబులను సహదేవుని నైదింటను నకులు నఱువదినాల్గింటను ధృష్టద్యుమ్నుని సప్తమార్గణంబులను ద్రౌపదేయుల నైదైదుతూపులను సాత్యకి మూఁడుకాండంబుల నొప్పించి సహదేవుధనువు దునిమిన నక్కుమారుండు వేఱొక్కవిలుఁ గొని చలంబున నక్కురువిభుం గదిసినఁ దక్కటిరథికులుం గూడికొని యొక్కొక్కరుండు పెక్కమ్ములు పైఁగురియఁ గేలిచందంబున వాని నన్నింటి వారించుచుఁ దత్తనువుల శోణితంబుఁ బూరించుచు నాజెట్టిజోదు బెట్టిదుండై పెనంగ మనయోధులుం బురికొని యుద్ధారల మార్కొనిరి మనసైన్యంబు దైన్యంబు విడిచి మరలి వారి బలంబులఁ దలపడియె నట్టియెడ. 328

క. భీముఁడు గురుతనయుఁడు నుద్దాముభుజావీర్యశౌర్యధైర్యములు జన
స్తోమము లగ్గింపఁగ సంగ్రామ మొనర్చిరి నితాంతగాఢస్ఫూర్తిన్. 329

చ. పరుషపరాక్రమస్ఫురణఁ బాండవముఖ్యుని వాజులం జతు
ష్కరవాతిఁ గూల్చె సౌబలుఁడు సత్వరుఁ డై సహదేవుఁ డమ్మహీ
శ్వరుఁ దన తేరిమీఁద నిడి సంగరమధ్యము వాపె నాతఁ డొం
డరదము మీఁదికిం జని రయంబున నయ్యరిఁ దాఁకె నుద్ధతిన్. 330

క. శరములఁ బొదివిన నాతఁడు దిర మై యేమంగ రణము దివిజగరుడఖే
చరసిద్ధప్రకరాద్భుతకరప్రకారమున నొప్పెఁ గౌరవనాథా. 381

సీ. శకునినందనుఁడును నకులుండు నొండొరులకుఁ జాడ బాహుబలంబు సూపి
రథులశౌర్యమున సాత్యకికృతవర్మలు పోరిరి విలుఁ ద్రుంచి కౌరవేంద్రు
[2] డేసె ధృష్టద్యుమ్ను నేచి యొండొకవింట నతని నాతఁడు నొంప నక్కజంపు

1. గ. ద్రుసితిన్. 2. అ. డేసెఁగ దృష్టద్యుమ్నుఁ ♦ డేసె నొండొక

గయ్యాళుయ్యెదుపుర | కయ్యెద్రౌపదిపుత్రు, లేవురు వతిఁ గిట్టి | యింద్రియములు
తే. బాలిశునిఁ జిక్కువఱిచినక్రియగిదిఁ జటిన, జేయ నతఁ డీడఁబోవక | సాయకములు
పెక్కురయమున నిగిడించి క్రయుక్కుమీఱ, విరథుఁగలఁపఁ దత్సంగరక్రమతిశయిల్లె.

వ. మఱియు ననేకు లనేకులం జొదివి పోరాడ నంతకంతకుఁ బేర్చినయుగ్గలిక యుగ్గ
రంబులు రెండును గలయఁగ బెరసినం బేర్చినపెంధూళి భానుబింబంబుఁ గప్పి యప్పుడు
దారుణగునరతురంగమాతంగరుధిరధారల నడంగిన నధికం బైన సంగరంబు
నకుం గడంగినకౌంతేయులయారవంబుకి నోహటించి మనమోహారంబుదొరలు
మరలిన మరలనీక నీకొడుకు పురికొలుపుకొని తఱిమినం గనలి ధర్మసుతుండు.

తే. మూఁడునారాచములఁ గృపుఁ వాఁడి చెఱిచి
వాలి కృతవర్మహాయముల | నాలుగింటఁ
గూల్పఁ దన తేరిపై నిడి | గురుసుతుండు
దోలఁగఁ గొంపోయె నవ్విరథుని నృపాల. 334

చ. కురుపతి చూచి చిత్తమునఁ | గోపము పెంపెసలార నేడునూ
ఱరదము లాతనిం బొదువునట్లుగఁ బంచిన నొక్కపెట్ట బం
ధురతరవారివాహములు | తోయజబాంధవుఁ గప్పుచాడ్పు దోఁ
ప రయముమైఁ గడంగి యవి | పైకొని యవ్విభుతోఁ బెనంగఁగన్. 335

క. కనుఁ గొని శిఖండిముఖరో, ధనికాయం బడరి యా రథప్రకరంబున్
సునిశితశరప్రకరములఁ, దునుమాడెన్ రౌద్రరసము | దొలకాడంగన్. 336

వ. ఆ సమయంబున మన సేన సుల్కాపాతశర్కరావర్షాదు లగునుత్పాతంబులు గలిగె
వానికి శంకింపక శకుని గడంగి యోధవరులతో మీరు కోల్తల సేయుం డేను
[1]వెడముట్టునఁ దాఁకి ధర్మనందనాదులను సమయించెద నంచు సముద్ధతిం గదిసె
నప్పుడు మద్రేశబలపురస్సరం బైనయమ్మోహరంబు రభసంబునం దఱిమి
పాండవసేనాసంరంభంబున కోర్వక తిరిగిన నాసుబలసూనుండు ప్రబలతురంగ
దశసహస్రంబులతో వేగంబు మెఱయ వైరిసేనవెనుకఁ గిట్టి యేను గలుగ
మీకు భయం బేల యని యక్కౌరవసైనికులం బేరుకొని యదల్చి యార్చిన
నా కౌంతేయవాహిని కలంగిన ధర్మనందనుండు సహదేవు నాలోకించి. 337

శకునిసహదేవు లాశ్విక సహాయులై ఘోరంబుగాఁ బోరుట.

ఆ. వేగ తాఁకు మైదుకవేలగుఱ్ఱంబులు, ద్రౌపదీతనూజతతియు నీవు
శకుని ననుడు నతఁడు సంరంభజృంభితుఁడై, యట్లచేయ ఘోర | మయ్యెఁ బోరు

వ. అట్టియెడ. 339

సీ. లీలఁ గట్టియతోడఁ | గూలంగ వైచియు, దొంకెనపోటులఁ | బొంక మడఁచి
వడఁద్రోచి[2]యును వాలగడికండములుగ వ్రేసియుఁ గఠారంబులఁ | జెఱిచి చెఱచి.

1. గ. జ. బెడముట్టున. 2. అ. జ. వాలునఁ గడికండలుగను వ్రేసియుఁ.

గీటడంగించియుఁ । గిట్టి రొండొరుఁ బట్టికొని మల్లుచందంబు । ననికిఁ జొచ్చి
నేలకు వంచియుఁ । గేలిమై [1]గళముపై, నెక్కియుఁ బెక్కండ్రు । రొక్క మొగిన

ఆ. కుక్కటయు సహించి । యుక్కునఁ బెనఁగియు, నుఱక వివిధగతుల । నుబ్బి చెలఁగి
బొమ్మ లాడినట్లు । [2]పోరి యారావృతు, లధిప నెఱయ మెఱసి । రందు నిందు. 340

వ. మఱియు ననేకప్రకారంబుల భండనంబు సేసిరి వదంపడి యుష్మాద్రి కుమారుని
వీరోద్రేకంబునకు నోహటించి గాంధారసోదరుం డాఱువేలతురంగంబులతోడం
దిరిగె నతండును ద్విసహస్రహయ శేష సేనాసమేతుం డై యున్నకడ కరిగె నా
సౌబలుండును జుట్టి వచ్చి ధృష్టద్యుమ్నుని మొనపైఁ బడిన నతండు సైన్యసము
ద్దండసంరంభం బెసంగ విక్రమాటోపంబు సూపినయపుడు పంచసహస్రత్రిశత
హయంబులు వడిన రౌద్రంబు రూపు దాల్చిన ట్లాయుధఖండనాస్థిభంజనశబ్ద
శ్రవణంబునను రక్తమాంసమేదోస్థిమస్తిష్క మజ్జాసమ్మిళితదారుణరణతలదర్శ
నంబునను దదీయవిస్రగంధాఘ్రాణంబునను యోధులు వీతచేతస్కులైరి తెగిన
తల యొకచేతను నెత్తుట జొత్తిల్లినకరవాలం బొకకరంబునను బట్టుకొని యట్ట
లాడినట్లు పెనంగి యాశకుని హతావశిష్టంబు లై వశతాశ్వంబులతోడఁ దొలంగి
యచ్చటిజనంబులతోఁ గురుపతి యెచ్చట నున్నవాఁ డనిన వార లి ట్లనిరి. 341

ఉ. అల్లదె కంటె పూర్ణశశి । యట్లు కడుం జెలు వొందెఁ జూడఁ బే
రెల్లి రథప్రతాన మదె । యేవున సంగరకేళిఁ జాల శో
భిల్లెడు నయ్యెడన్ రిపు । విభీషణవిక్రమణప్రకారగా
ఢోల్లసనుండు భూపతి మ హోన్నతి నొప్పెడుఁ బొమ్ము చెచ్చెరన్. 342

వ. అనిన విని తల యెత్తి చూచి తత్ప్రదేశంబున కరిగి యుద్ధరణీశుం గని యతని
కిట్లనియె. 343

క. పాలియించితి నే గుఱ్ఱంబులఁ దేరుల కుఱికి యింక । భూరిరయమునన్
బొలియింప వలయుఁ బ్రాణంబులు డాఁచిన వశమె పాండుపుత్త్రుల గెలువన్.

వ. రథంబులు గజంబులు జగినం గాని కాలుబలంబుల నమయించుట పని గాదనిన
నమ్మాటకు సైనికులు సంతసం బంది బరవసంబు సేయ నమ్మహీనాయకుండు
సముత్సాహదోహలి యై తఱిమిన మూఁకలు కడంక యెలర్ప దర్పస్ఫురితంబు
లగుచు నురవణించినం గని గాండీవి గోవిందున కిట్లనియె. 345

క. మొనసి చనుదెంచు దుర్యోధన సేనాసముదయంబుఁ । దఱియ నుఱవడిం
జననిమ్ము మనరథము నా, సునిశితబాణముల నమయఁ । జూచెద దీనిన్. 346

—:o:— దుర్యోధనుపరాక్రమం బుద్దేశించి కృష్ణార్జునులు సంభాషించుట. —:o:—

వ. అనుచు నమ్మెన యాలోకించి నిరూపించి. 347

క. పెనఁకువ యొడ త్రెవ్వక పదు, నెనిమిదిదివసములు సెల్లె । నేఁ బెనఁగంగా

1. క. గ. దళముపై; 2. గ. పాలియునారావృతు.

వనధిం బోలెడు కురుబల, మనఘా కనుఁగొనఁగ గోష్పదాకృతి యయ్యెన్.

ఆ. దైవ మిట్లు గలఁచునే వీరి మదిమది, నుండి ఘోర మైనయుద్ధమునకుఁ
దొడఁగ వలయునట్టితొడరువు కావించి, కొనిరి చీకురాజుకొడుకు లేచి. 349

చ. అమరనదీసుతుండు పడినప్పుడు వీరలబుద్ధి సంధికా
ర్యమునకుఁ జొచ్చు నింక నని యాత్మఁ దలంచితి నమ్మహాత్ముఁడు
న్ననుచితవాక్యవృత్తిఁ గురునాయకుఁ డేర్పఁగఁ జూచెఁ జిత్తదో
షమహిమ నద్దురాత్ముఁడు ప్రశాంతత నొందఁడు యెన్నిభంగులన్. 450

క. గంగాతనయుఁడు దెగినను, సంగరమున కుత్సహింపఁ జనునే తమకున్
వెంగలు లని యప్పుడు దెలి, యుంగా నెఱిఁగితి సుయోధనాదులఁ గృష్ణా. 351

ఉ. దంతియుఁ దాను నాజి భగదత్తుఁడు గూలఁగఁ జూచి సింధుభూ
కాంతునిచావు దెల్లముగఁ గన్గొని యాతనిఁ గావఁ బూని య
ట్లంతలు రాజు లెల్ల సమయం గని ద్రోణునిపాటుఁ గాంచి యా
వంతయు నాత్మలోనఁ దెలియండు సుయోధనుఁ డెంతమూర్ఖుఁడో. 352

క. తనయనుజు లకట దుశ్శాసనుఁడును లోనైనవారు సమసినచందం
బును బంధుసహితముగఁ గర్ణుని గీటడఁచిన విధంబునుం జూడఁ డొకో. 353

క. అది యెల్ల నేల చెప్పఁగ, నదిశల్యునిపాటుఁ గనియుఁ దోఁవ దితఁడు బ
ల్లిదుఁ డని ధర్మజు డెనఁ దలఁ, పిది కురుపతి బుద్ధికొలఁది యేటికి భగవన్. 354

క. క్షోణీరాజ్యార్థము దన, ప్రాణము గలుగంగ నీఁడు రారాజు జగ
త్త్రాణపరాయణకరణధు, రీణుం డగుపాండుసుతగరిష్ఠున కెట్లున్. 355

వ. కావునఁ గొఱంతయును దీర్పవలసి యున్న దనిన విష్ణుండు జిష్ణున కి ట్లనియె. 356

ఉ. అక్కడ సంధికిం జనినయప్పుడు నవ్విదురుండు కృష్ణ నీ
విక్కడ కేల వచ్చితి విహీనవివేకుఁడు [1]దుర్మదాంధ్యముం
దక్కఁడె సంగరంబ యుచితం బగుకృత్యము గాక యిమ్మెయి
న్మ్రొక్కున నూర్పు గల్గఁ గుజనుండు సుయోధనుఁ డుర్వి యిచ్చునే. 357

వ. అని బోధించె నదియునుం గాక దుర్యోధనుండు జనియించినప్పుడు మును లిప్పాపాత్ముండు నిఖిలక్షత్త్రియక్షయహేతు వగు నని యాదేశించిరి గాదె యనిన నర్జునుం డతని కిట్లనియె. 358

తే. అమ్మహాత్ములు సెప్పినయట్ల యయ్యె, నున్నవారలఁ బొలియించి తన్నువిడిచి
కాని విడువండు ధృతరాష్ట్రసూనుఁ డుర్వి, ధర్మసూనున కిది నిశ్చితంబు గృష్ణ.

క. దుర్బల మగునమ్మేఁకను, దోర్బల మెసఁగంగ నివుడ త్రుంచెద [2]నాదు
ర్నిర్బంధపరుఁడు దన దగు, దౌర్బల్యము గనుచు మదము దక్కఁ గనుఁగొనన్.

వ. రయంబున రథంబు గడపు మనుడు నుత్తుంగమాతంగమహీరుహశోభితంబును

1. అ. దుర్మదాంధతన్. 2. అ. నే నానిర్బంధ.

సాంద్రస్యందనగుల్మగహనంబును బహుళహయకటాకీర్ణంబును సముద్భటసుభట
లతాలంకితంబును నైనసుయోధనసేనాకాననంబునందు పాండవమహావాయువు
ధనంజయదారుణశరానలంబు దరికొల్పిన. 361

క. ఆ కృష్ణవర్త్ముఁ డుజ్జ్వలభీకరశరగజిహ్వాలడరఁ జేర్చిన నధిక
వ్యాకులత నొందె రోదసి, నాకౌకస్సమితి మెచ్చనం బొగడంగన్. 362

వ. ఇట్లు దారుణరణవిహారణంబు సలిపి సవ్యసాచి యా సైన్యంబు నిపతితవిఘటిత
భ్రాంతపలాయితంబు సేసినఁ దెరలక నిలిచి కురుపతి కరతలం బెత్తి నిలు నిలు
మని తొలుంగఁ జూపిన నది మగుడఁ బురికొని నిగిడినేమినినదఘంటాక్వాణకింకిణీ
నిక్వాణంబులు సెలంగఁ బాండవబలంబుఁ దాఁకిన ధృష్టద్యుమ్నశిఖండిశతానీకు
లయ్యనీకంబు ననేకవిధసాయకనికాయంబులం గప్పి రప్పుడు ధృష్టద్యుమ్ను నర
దంబు చక్కటికి సంరంభంబున. 363

ఉ. భూపతి మించి యాద్రుపదభూపతనూజునురంబు నిర్భరా
టోపత యుల్లసిల్లఁగఁ బటు ప్రదరంబుల నొంప నాతఁడు
దీపితకోపుఁడై హరులు ద్రెళ్ళఁగ సారథి డొల్ల నేయఁగా
నే పతి తేరు డిగ్గి యతఁ డెక్కె హయోత్తముఁ గౌరవేశ్వరా. 364

వ. ఎక్కి కొండొక తొలంగి మాతంగఘటలం బురికొల్పిన నవి పురందరనందను
నరదంబుఁ బొదివిన నవ్వీరుండు ఘోరనారాచధారల నవ్వారణంబులపైఁ గురి
యం గని గదాహస్తుండై యరదంబు డిగ్గి యనిలపుత్త్రుండు గవిసినఁ దుండంబు
లవిసియు దంతంబులు దునిసియుఁ గుంభంబులు వగిలియుఁ బ్రక్కలు చదిసియు
వెన్నులు విఱిగియు నగ్గజంబు లొఱలుచు నెత్తురులు గ్రక్కుచుఁ దెరలుచు
సుడివడు చుండ వెండియుం బైపై నురవణించు కరులం గనుంగొని ధర్మజ నకుల
సహదేవులును ధృష్టద్యుమ్నాదియోధులు నద్దిక్కుతఱిమి రట్టియెడ నశ్వత్థామ
కృతవర్మకృపాచార్యులు దుర్యోధనుఁ దేరిగములలోనం గానక కలనం బడియెనో
యని యనుమానించుచు నచ్చటిమానవపతులం గురుపతి యెచ్చట నున్నవాఁడని
యడిగినఁ గొందఱు శకుని దెసఁ [1]దొలంగె ననఁ దక్కటివా రతని వెదక నేల
బ్రదికియుండెనేనియుఁ గనికొందము పాండవులమీఁద నుఱికి [2]పొడుతము గాక
యనిన విని యట్ల చేయ సారథిత్రయంబును [3]దదనీకంబును వెడలి సౌబలుఁ
డున్న చక్కటికిం జనియె నిట్లు దిక్కుమాలినయమ్మొనచుట్టును ముట్టి. 365

దుర్విషహప్రభృతికురుకుమారులు భీముని చేఁ జచ్చుట.

క. పాంచాలకుమారాదు లు,దంచితభుజబలము మెఱయ నమ్ములవెల్లిన్
ముంచిరి నిజకరిహరిరథ,సంచయసంరంభ మెసఁగ జగతీనాథా. 366

---

1. అ. గలంగె. 2. చ. పోట్లాడుదము. 3. జ. రథానీకంబును.

మార్చెద నిమ్మెఁక పడియును బాఱియుం తనచుట్టు బయలైన సుయోధనుం డెట్లయ్యెడినో యటునూనుము మూర్ఖుని యెనేని మదీయమార్గణాగ్నికి నాహుతి సేసి కపటద్యూతంబున నపహృతంబులైన సకలధనంబులు నలుఁగు మొనమరల్చిన వాఁడనై పాండవాగ్రజుని చింతవంత యంతయుఁ బుచ్చివైచెద నేఁడెల్లపనులు సక్కనయ్యెడుఁ గరిపురపురంధ్రీజనులు తమ పతులఁ బుత్త్రులం బొలియుట విని పాండవు లుద్దండబాహువీర్యశౌర్యసమగ్రు లని యెఱింగెదరు గాక యనుటయు నన్నరుమాటకు మెచ్చుచు నతండు. 373

చ. అరదము కౌరవేంద్రుదెసకై నడపంగఁ గెలంకులం గడం
గిరి నకులానుజన్ముఁడును గీచకవైరియుఁ గౌరవేశ్వరుం
బొరిఁగొన నుత్సహించి వడి భూవర వారి కెదిర్చె సౌబలుం
డరిబలముం దదీయరథికావలియున్ వినుతింప నుగ్రుఁడై. 374

వ. తక్కటివారు నుక్కెక్కి పురికొని రాశకునియు సుశర్మయును సవ్యసాచిని సుదర్శనుండు సమీరనందనుని నీయుగ్రనందనుండు సహదేవునిం దలఁపడి రట్టియెడ.

క. వడముడిఁ దలమిగిలి రయం, బడరఁగ సహదేవుఁడత్యుదగ్రత మెఱయుం
దొడరి భవత్సుతు మార్కొని, నిడుదవెడఁదతూఁపు లేసి నెఱిఁ దూలించెన్. 376

ఉ. కట్టియవైచె నెన్నదురు గాఁడ భవత్తనయుండు మాద్రిఁ లేఁ
బట్టి నతండు సోలియును బాహిరపోవక తేఱి యా విభుం
గిట్టి నిశాతబాణచయకలితదేహునిఁ జేసె రావుతుల్
కట్టుపకాసులై నరునిఁ గప్పిరి శక్తులఁ దోమరంబులన్. 377

వ. గాంధారదేశీయు లగునాశ్వికు లట్లు మాఱెవిన నొదవినకినుకఁ గూరిరభల్లంబుల శిరంబులు ధరం దొరఁగించినఁ ద్రిగర్తసైన్యంబనసందోహంబకరి గోవిందపురందరపుత్త్రులపైఁ బటుప్రదరపరంపరలు పరఁగించి విజృంభించిన నవ్విజయుండు. 378

సీ. సత్యకర్మునితల చారుకుండలవరి, స్ఫురితత్వమొందుచు ధరణి డొల్ల
నేసి మృగంబుపై కెరఁగుసింగముపోలెఁ, గిట్టి సత్యేషుని గీటడంచి
బహువిధసంచితప్రకటకోపానల, జ్వాలలు సాకారలీలఁ బర్వ
తెఱఁగున నరుణదృగ్దీప్తిజాలంబు సు, శర్మపై నిగిడించి సాయకత్ర

తే. యంబొడలనాటుటయుఁ దద్రథంబులోకఁ, బెట్టఁగ విసిననన్నిఁటిఁ బి ఱుకుమార్చి
రథ్యములఁ గూల్చియతని యురంబు ఘోర, భల్లమున వ్రచ్చి నిర్గతప్రాణుఁ జేసె.

వ. ఇవ్విధంబునఁ ద్రిగర్తపతిం బ్రేతపతిపాలి కనిచి మనదెసజనంబులు ఖేదంబుఁ దమవారు మోదంబు నొంద నతనినందనుల నేన్వుర నెనమండ్ర ముప్పదుండ్ర మూఁడుమూఁడుగోలలం దలలు నఱికెఁ దత్సైన్యశేషంబు బారినుఱిరె భీమసేనుఁ బారిం బడినసుదర్శనుండు దదీయశరజాలంబుల నదర్శనగతుండై వదంపడిలచ్ఛరవి

ఖండితకంఠుం డైనఁ గోపంబు దీపింప వగ మిగుల నక్కాంతాకుమారుం డమ్మా
రుతసుతుఁ జుట్టు ముట్టిన నతండు బెట్టిదంబు లగుకోలలు నతని మేను నిండగుచు
న్నేపున నివారింపఁ గనుంగొని సహింపక మహీపతియు నచటికి బలంబు లనేకంబులం
గదిసిన నక్కౌంతేయుసైన్యంబును సరభసంబున నడిచి పేర్చినసమయంబున
సౌబలుండును సహదేవుని దాఁకినం దత్సుతుం డులూకుండు గానక నైన యుతని
వడముడియుఁ బిన్నతమ్మునికి బాసట యయ్యె నాశకునియు మహాప్రీతుండయి ప్రదీప్త
భల్లత్రయంబున నొప్పించి పదినారాచంబు లతనిమేన నుప్పొంగించినం గోపించుచు
నయ్యిరువురు సాయకనికాయంబు నిగిడించిన నాగాంధారరాజు సైన్యంబునఁ
గత్తళంబులు గరవాలంబులు పల్యాణంబులు మోరలు గంఠంబులు చరణంబులు
గరంబులు శిరంబులు దునియలై తొరఁగిన ధాత్రి చిత్రాకారం బై యుండె నిట్లు
దనతురగసముదయంబు సమయుటయుఁ జలం బెడపక సేనయందు నున్నకులా
నుజుం గిట్టి. 380

క. పెనుగడఁత దొడ్డయ త్తళ, మున వైచిన నతఁడు మూర్ఛనమునఁగి కథముమీఁ
దన పడినఁ గనలి యప్పా, వని పొదివెను గౌరవేంద్రవాహినిఁ గడఁకన్. 381

వ. పొదివినయప్పిరునారాచంబుల తాఁకున. 382

క. అది గొంత వుడమిఁ బడ ను, న్నది పాఱినఁ గని యుదల్చి యనవీనుఁడు బె
ట్టిదముగ నెలుంగు సూపెను, మద మూరఁగ నబ్బలంబు మిగుల విధమునన్.

వ. ఇవ్విధంబున దొర [4]యుఱిమి తఱిమి యుమ్మైన కుతూహలంబునఁ బటులవాహం
బగురథం బెక్కి శకునిఁ గూడుకొని కవిసిన. 384

తే. పాండవులసైన్యమును సముద్దండలీల, మాఱుకొనె నంతలోమూర్ఛదేఱినకులు
తమ్ముఁ డమ్మామపైఁ బడియమ్ములొక్క, పెట్టగ్రుచ్చి మాతనివిల్లు ద్రెంచె.

—•• ఉలూకుఁడు సహదేవుచేత మృతుం డగుట. ••—

సీ. ఆ సౌబలుండు శరాసనాంతరదీప్తుఁ, డగుటయు నకులుఁడు ననిలసుతుఁడుఁ
దాఁకిన వారి నతండు పెక్కమ్ముల, నొప్పింప నతనితనూజుఁ డనిల
సుతసహదేవుల సునిశితశరవర్ష, మునఁ గప్ప నయ్యులూకుని ననేక
సాయకంబుల నొంచి శకునిమై నఱువది, యమ్ములు నాటించి యనుచరులను

తే. బెగడుపఱిచె నాభీముండు బెట్టులూకుఁ
డడరి యన్నకులానుజు నంపవెల్లి
ముంప నతఁ డేచి పటుభల్లమున శిరంబు
ద్రుంచె నన్నలమొదలు సంతోష మొంద. 386

క. తనయుఁడు పడ శకుని కనుం, గొని శోకం బాత్మ నారఁ గూడఁగ నస్రల్
కనుఁగొనలఁ జిందు నినిచె, న్మనుజేశ్వర విదురుభాషణంబులుఁ దలఁచెన్. 387

1. క. యొయిది మగిడి తఱుమ నమ్మైన.

వ. అట్లు దలంచుచు నిట్టూర్పు నిగుడ సహదేవుపై నడరి మూఁడునారాచంబులు నిగిడించిన. 388

చ. అవి వెసఁ ద్రుంచి యాశకునిశరాసనముం దునుమాడె నక్కుమా
రవరుఁ డతం డనిందితపరాక్రముఁడై పటుఖడ్గయష్టిచే
త్తవిపులముద్గరంబున విభాసితశక్తిని వైచెఁ దోడుతో
నవియు ననేకబాణముల నానృపసూనుఁడు నుగ్గు సేసినన్. 389

క. కనుఁగొని పార్శ్వచరులు విచ్చిన శకునియుఁ బాఱె నుల్లసిల్లిరి కుంతీ
తనయులు దదీయసేనాజను లార్చిరి కురువిభుఁడు విషాదము నొందెన్. 390

వ. ఇట్లు పాఱిన. 391

చ. అరదము సత్వరంబుగ శరావళి పెల్లుగఁ బర్వఁ బాండవా
వరజుఁడు పోవ నీక పొదువన్ వడిఁ బెంగలివారు పోరికిం
బురికొని త్రోచినన్ సుబలపుత్త్రుఁడు దత్తురగవ్రజంబుతో
బరవస మొప్పఁగా నతనిపైఁ గవిసెం గృతనిశ్చయాత్ముఁడై. 392

వ. కవిసినం గని గుణంబు సారించి శరాసారం బడరించి యాసహదేవుం డిట్లనియె.

చ. తలఁకుట యొప్పునే నృపతిధర్మము నూఁది యెదిర్చి మేమియున్
నిలుచుట యొప్పుఁగాక మహనీయుల ధర్మతనూభవాదులం
బలికితి వీవు జూదపునెపంబునఁ దత్సభ మందె దిప్డు మా
చలము బలంబు నేర్పడియెఁ జచ్చిరి మీయవివేకు లందఱున్. 394

వ. మమ్ము నపహసించినవారిలోఁ గురుకులదాహకుం డొక్కరుండ తక్క నద్దురాత్ముండు సూచుచుండ భవదీయశిరంబుఁ దాలఫలంబు లగుడంబునం బడవైచుపగిదిఁ బటుభల్లంబున డొల్ల నేసెద మామా పాఱక నిలువుమీ యని యట్లు బహుభంగులం బలికి యతం డేయుసాయకంబులు వారించి దశమార్గణంబులు మేనఁ జొనిపి. 395

క. తురగములు సిడము గొడుగును, శరాసనముఁ దునిమి యార్చి సాహసమున ని
ష్ఠురశక్తిఁ బూన్చె నాతని, యురఃస్థలము వైవ శకుని యుర్వీనాథా. 396

మ. సహదేవుం డది శాతభల్లమున నుత్సాహోగ్రుఁడై త్రుంచి దు
స్సహభల్లద్వితయంబునం గరయుగస్వైరచ్ఛిదాకేళి స
ల్పి హసద్వక్త్రవిలాస మొప్పఁగ నఖిలస్తుతిస్ఫారభ
ల్లహతిం గంఠము ద్రుంప మస్తకము డొల్లన్ డొల్లె మేనున్ మహిన్. 397

వ. ఇట్లు కౌరవులదుర్నయంబునకు మూలంబగుశకునిఁ దెగటార్చి పేర్చి యార్చిన యనుజన్ము నాలోకించి ధర్మతనయప్రముఖులు పరమప్రమోదభరితాంతఃకరణులై నిజశంఖంబులు పూరింప శౌరియుఁ బాంచజన్యరావంబున రోదసి నింప సుయోధనుసేన చెదర బెదరక నిలిచి మూఁడువేలసైన్యంబు సహదేవునిపై ననే

శాస్త్రశస్త్రంబులుగురియుచుఁ గవిసినం గప్పడియును వడముడియును నవియున్నియు
మోఘంబు లగునట్లు చేసి యమ్మార్కి బడలుపడ నేసి యుల్లాసభాసితులైనం గని
జనపతి శోకాక్రాంతమతి యై హతశేషులైననిజసైనికులం బురికొల్పిన వారలు
రథికరహితు లయ్యును ధైర్యంపు పెంపున శంకింపక యూనవ్యాపారం బొదివి తదస్త్ర
శిఖాసందోహంబున బ్రుంగిపోయి రక్కురురాజు దనచుట్టును బయ లగుటఁ గల
యం జూచి కట్టెదురఁ జెలంగునా కౌంతేయులం గనుంగొని తొలంగిపోవం దలంచె
ననుటయు నాంబికేయుండు సంజయుదిక్కు మొగం బై. 398

తే. అట్లు మనసైన్యములు దెగటారినపుడు, కుంతికొడుకులలో బలగ మెంత గలిగె
నకట నాకొడు కెట్టివాఁ డయ్యెఁ జెపుమ, యనుడు నతఁ డిట్టు లనియె నమ్మనుజపతికి.

వ. అట్టియెడ రెండువేలు రథంబు లేడునూఱుగజంబు లైదువేలు గుఱ్ఱంబులు పది
వేలు కాలుమానిసియుఁ దానును ధృష్టద్యుమ్నుండు సంగరాంగణంబున మెఱసి
యుండె. 400

క. పలపలనిమూఁకలోఁ గాల్, నిలువక గుఱ్ఱంబు డిగ్గి నీకొడుకు గదా
కలితభుజుం డై యొక్కరుఁడుఁ, దొలఁగి చనియె నేమి చెప్పఁ గురునాథా.

వ. అని ధృతరాష్ట్రునకు సంజయుండు దుర్యోధనుపలాయనం బెఱింగించె నని చెప్పిన
విని యటమీఁదివృత్తాంతం బె ట్లయ్యె నని యడుగుటయును. 402

ఉ. [1]సంగవిహారితాకలితశాంతరసస్ఫుట[2]రోమహర్షబో
ధాంగనమాశ్రితాపదుదయజ్వలనప్రశమప్రవర్తకా
పాంగమరీచిరూపవితతామృతవీచివిహార వాసవో
[3]త్సంగతలోపలాల్యపద [4]సంసృతివారణ దైత్యదారణా. 403

క. ఆశ్చర్యకరణకరుణా, నిశ్చలశుచిహృదయభావనీయవిహారణా
పశ్చిమ[5]నాడీసరణ పు,రశ్చరణధ్యేయ భక్తరమణవిధేయా. 404

మాలిని. ప్రణవమయగరిష్ఠోపాయసంవేద్యభూమా
భణనమననదూరస్ఫారవిస్తారసీమా
[6]గుణవిభవనిరాసాకుంఠితోల్లాసధామా
గణనరహితలీలాకల్పనిత్యాభిరామా. 405

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజితిక్కన
సోమయాజిప్రణీతం బైన శ్రీమదాంధ్రమహాభారతంబున శల్యపర్వంబునందుఁ
బ్రథమాశ్వాసము. 406

---

1. గ. సంగవిదూరతా...రసస్ఫుట. 2. క. రోమరుద్ధ_ గ. రోమనిర్గ-బోధాంగ. 3. గ. త్సంగతలోపలాల్య; జ. త్సంగ తలోపవాస్య. 4. క. సంశ్రితతారణ. 5. జ. నాళీసరణ. 6. గ. గుణభవనిరా.



హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## శల్యపర్వము, ద్వితీయాశ్వాసము.



శరణనిపుణపదప
ద్మా కేవలసత్త్వసద్మ ! మాయావ్యవధూ
త్యేకాయనగమ్యా మధు
రాకృతి[1] సర్వత్రరమ్య ! హరిహరనాథా. 1

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు నిజపుత్త్రుండు పరాజయంబు నొందుట యాకర్ణించి యాంబికేయుండు. 2

క. మద మడఁగి యొక్కరుండును, గద చేకొని రాజరాజు ! కాల్నడ నెట వో
మదిఁ దలఁచి తొలఁగెనొకొ యాపద లిట్టివి కలవె మనుజపతులకు నెందున్. 3

వ. అనంతరవృత్తాంతంబు తెఱంగెఱింగింపు మనుటయు నజ్జననాథునకు సంజయుఁ డిట్లనియె. 4

సీ. ఏకాదశాక్షౌహిణీశుఁడై పెంపునఁ, బొంపిరివోవు నప్పాడిమి తేఁడు
వెనుక నొక్కరుఁడును ! జన లేక యేకాకి, యై పోయె నచటికి ! ననతిదూర
మై యుత్తరము మట్టి నట్టితూర్పున నొక్క, మడువున్న దానిలోఁ గనడఁగియుండు
వాఁడుగా నట్టు లశ్వ్యాలనికిఁ జని చని, విదురునిమాటలు ! మదిఁ దలంచి

ఆ. యధికమతి నృపాలు ననుజుఁడు [2]చెప్పిన, ట్లకట దానిఁ గొనన ! యనుచు శోక
తప్తచిత్తుఁ డయ్యె ! దైవ మెవ్వరి కెట్లు, చేయఁ జాల దేమి ! చెప్పఁ గలదు. 5

వ. అట్టియెడ నుడిసి చిక్కినమూఁకలు వీఁకమై నెదిర్చినం బొదివి నిరవశేషంబుగా నఱియించి కృష్ణసారథికంబును ధవళహయంబును గపికేతనంబును నగు నుజ్జ్వల స్యందనంబును నప్పురందరనందనుండు బంధుమిత్త్రాభినందితుండై యెక్కినప్పుడు పొలికలన నీబలం బఖిలంబును వెనుగాలిం బడినపేరడవిపగిదిం గానంబడుచుండె నందుఁ గృపాశ్వత్థామకృతవర్మలు మువ్వురు బ్రతికిపోయి రాసమయంబున ధృష్టద్యుమ్నుండు నన్నుఁ గనుంగొని నగుచు సాత్యకి నుద్దేశించి. 6

1. అ. సర్వత్రరమ్య. 2. క. చెప్పిన ట్లగుట.

తే. వీని నేటికిఁ బట్టితి × వీఁడు బ్రదికి, [1]యిచట వర్తించి మనకు నే × గ్గమి సేయు
నప్రయోజన మిది విడు × మనిన నేల, విడుతు నీద్రోహిఁ దలదెగ × నడుతు ననుచు.

వ. అట్లై సేయుఁడు వాలు వెఱికి [2]వ్రేయుం జూచునంతఁ గృష్ణద్వైపాయనుండు సన్నిధి
చేసి యతని వారించి సంజయుం జంపుట యనుచితంబు నుందల విడువు మని
యానతిచ్చిన నతండు వినతుం డై యట్లు కాక యని పలికి నన్ను విడిచెఁ గృష్ణ
ద్వైపాయనుండు మదీయాననం బాలోకించి బ్రదికిపోయి తెక్కడ కైనం బొ
మ్మనుటయు నమ్మునీంద్రు వీడ్కొంటి నంత నతఁ డంతర్ధానంబు సేసె నేను దత్ప్ర
దేశంబు వాసి నీసుతుండు సనిన చక్కటికిఁ గ్రోశమాత్రంబు వోయి ద్వైపాయనం
బనం బ్రసిద్ధం బైనయమ్మడుఁవుసమీపంబున. 8

తే. అతనిఁ గాంచితి నతఁ డశ్రు × లడర నడలు
చూడ్కి నామోము చక్కఁగాఁ × జూడ కోర
వోవఁ జూచుచు దీనతఁ × బొంది యునికి
గని మనంబున శోకంబు × గదుర నేను. 9

వ. ఒక్కింతసేపు పలుకు వెలువరింపఁ జాలక యూరకుండి యెట్టకేల కెలుంగు దెచ్చు
కొని పారాశర్య ప్రసాదంబున బ్రదికిన తెఱంగు సెప్పిన నమ్మహీకాంతుండును
గొంతప్రొద్దు నిశ్చేష్టితుం డై యుండి పదంపడి నాదెసఁ జూచి మనదెస బ్రదికిన
వారు గలరే యనినఁ గృపాచార్యాదిరథికత్రయంబును బేరుకొని వారలు బ్రదికి
పోయిరి తక్కొరుండును బ్రదుకుట లే దని యెఱింగించిన నిట్టూర్పు నిగిడిం
చుచు నామూఁపుపైఁ జే యిడి యున్నరనాథుండు నన్ను నీకడ కనుపం దలంచి
నాతో ని ట్లనియె. 10

తే. మాఱుమానిసి లేకుండ × మడిసి రెల్ల, వారు నీదెసఁ బాండుభూ × వరతనూజు
లాప్తులుందాము నున్నవా × రాహవమునఁ, బడక తొలఁగితిఁ బోటులఁ × బడియు నేను.

వ. అని. 12

క. కౌంతేయులబారిం బడ, నింతియు సేరి చాలు రాజ్య × మెల్లను దారై
పొంత ననుఁ బెట్టుకొని యొక్క, కొంత యొసఁగిరేని సట్ట్యకూ డేమిటికిన్. 13

క. అనుజులఁ దనుజుల మత్సరి, జనులను సమయించి వారు × సమరోల్లాసం
బున మొఱయఁ జూడ నేర్తు నె, జననాథున కింతవట్టు × సంజయ చెపుమా. 14

దుర్యోధనుఁడు ద్వైపాయనంబను మడుఁగున డాఁగి యుండుట.

క. ఇమ్మడువులోన డాఁగెద, నిమ్ముల నెచ్చటికి నైన × నేఁగెదఁ దగువృ
త్తమ్మునఁ దొలఁగి నిలిచి మఱి, యెమ్మెయి నేనియును దీర్తు × నేఁ బగ యనుమీ

1. అ. యెంచట వర్తించు. 2. ఆ. తెగ వ్రేయం బూనినఁ గృష్ణ.

వ. అని చెప్పి యమ్మనుజవరుఁ డచ్చో మాయావిశేషంబున జలంబులు శరీరంబు సోఁక
కుండ సంస్తంభనంబు సేసికొని యుండె నంత రథ్యంబులు పరిశ్రాంతి నొంది
తూఁగాడ శస్త్రాస్త్రాదిక్షతంబు లగునవయవంబులతోడ రాజదర్శనవిషణ్ణు
లగుచుఁ గృపకృతవర్మాశ్వత్థామ లచ్చట మెలంగి డబ్బాటుగా వన్నంగని
సంజయా బ్రదికితే యని పలికి కురుపతి ప్రాణంబులం గలఁడే యని యడిగిన
నజ్జనాథుఁ డొక్కండును బాఱుతెంచి నీరిలో డాఁగియున్నతెఱం గెఱింగించి
యాహ్రదంబు సూపి మీ మీఁదవ్రరము నొండొరులతో నాడినమాటలు చేటపడం
జెప్పిన వార లత్యంతవిషాదంబు నొంది. 16

చ. నరవరుఁ డేమి సంగరముఖంబున బడ కున్కి యెఱుంగఁ డక్కటా
జరవస వేది వచ్చెఁ బిదపక్ష వినియుఁ మముఁ గూర్చికోలు దు
స్తర మనుబుద్ధి నిప్పటికి శత్రులక న్మొఱుఁగం దలంచి యీ
వెరవున డాఁగె సర్వపృథివీపతి దుర్దశ నిట్లు పొందునే. 17

వ. అవ్విభుండు పెనుఁబ్రాపై నిలిచిన సేనయు పగతురతోడం బెనంగం జాలుదుమను
సమయంబున విజయవిజృంభితు లగుపాండవులు సబలంబుగా నచ్చేరువ నడతెం
చిన సారథికులు దా రచ్చోట నిలుచుట కార్యంబు గా దని తలంచి నసుఁ గృపా
చార్యురథంబుమీఁద నిడికొని మనశిబిరంబున కరిగి రందు. 18

చ. కలఁగొనఁ బాఱుచుఁ సతులు గన్నుల నశ్రుజలంబు లొల్కఁ బీఁ
పులపయి పెన్నెఱుల్ విరియఁ బొడ్మఁగ లాలలు రోదనధ్వనుల్
సెలఁగఁగ మోములుం దలలుఁ జేతులుఁ గెంపుగ మోఁదికొంచు భ
ర్తల సహజన్ములన్ సుతులఁ దండ్రులఁ బేర్కొని యార్తి నొందుచున్. 19

వ. హతశేషులైనపతాకాతపత్రచామరభృదాదిజనంబులవలన సకలజనసంక్షయంబు
వినుచు నేలం బడి పొరలుచు లేచు చునికి యత్యంతకరుణం బై యుండెనప్పుడు
మాన్యవనితాజనంబులకావలివారును గడంగి వారలం దగినవాహనంబులపై
నిడికొని యిక్కడకు వచ్చిరి తక్కినభీతజనంబులు పలుదెసలం బాఱి రట్టియెడ
నీకొడుకు యుయుత్సుండు శోకసంతప్తచిత్తుం డై. 20

శా. గంగానందనుఁ డాది గాఁగఁ గురుసంఘముం బెల్ల సంగ్రామధా
త్రిం గూలెం బలి యొక్కరుండుఁ బటుకౌంత్యతేయప్రతాపంబుపే
ర్మిం గీడ్పాటున కోర్చి పాఱె విధి న్యాయమేఁ బ్రాణముల్ నిల్పె నా
కుం గాంతాజనులం దగంగఁ బురికిం గొం చేఁగు టర్హం బగున్. 21

వ. ఏకాదశాక్షౌహిణీభర్త మన్నించుమానవతులు గాసి యగుదురే యని మనంబు
నం దలపోసి రథంబు డిగి యత్తెఱంగు శౌరికి నజాతశత్రునకు నెఱింగించిన న
ప్పాండవాగ్రజుండు పరమకృపాపరుండు గావునఁ బ్రీతుండై శౌరియాననం బాలో
కించి యది మేల కాదె యని పలికి యతం డనుమతి సేయ నవ్వైశ్యాపుత్త్రు

బరిరంభణంబు సేసి తెన్నతలంపు తలంచి తని సంభావించి వీడుకొలిపిన నతండు రథారూఢుండై రథ్యంబులఁ ద్వరితగతి నడపి ఘోరశస్త్రక్షతదేహంబులు కర్ష్మకు లగువృద్ధకంచుకులం గలసి వాయువు వాయువు పాఱు నాపరప్రకారంబులఁ దేర్చి పురంబు ప్రవేశించునప్పు డెదుర విదురుం గాంచి. 22

చ. అతఁ డనుగంగ శల్యసుబలాత్మజులుం బలముం ద్రిగర్తులుం గడన్
క్షితిఁ బడ ఁకర్ణుడం బలికి చెప్పెఁ దురంగము నెక్కి పోయెనే
పతి యొకరుండుఁ బాఱుటయుఁ బాండవముఖ్యులు క్రీడ బొందఁగా
నతివల నిల్లు సేర్చుటకునై యిట రాకయు మానవేశ్వరా. 23

వ. అనిన విని యతండు శోకవ్యాకులుం డగుచు నవ్వైశ్యాపుత్త్రుం బొగడి కాలో చితకృత్యం బాచరించి తెన్ను చేసి తని పలికి మఱియు నిట్లనియె. 24

తే. ఎప్పుడును సంజయుండు వచ్చి యెఱుఁగఁ జెప్పఁ
బతికి సమరవిశేషంబు లతఁడు నేఁటి
తెఱఁగు చెప్పెడిఁ గాక యేర్తెంచి మున్న
మనము వినిపింపఁగాఁ దగ దనఘ దీని. 25

వ. ఒండుముఖంబున నివ్వార్త నగరు సొరకుండునట్లుగా సంవిధానంబు సేయ వలయు నీవు దుర్యోధను ప్రియాజనంబులను దద్దుతుకులను ద్రోణాచార్యు భవనీయ మందిరంబునకుం జనుము తక్కటివారి నంతంత నడఁకువతో నిలువ నియమింప వలయు నని పలికి తానును యుయుత్సుండును సావధానప్రయత్నంబున నవ్విధా నంబు సంఘటించి నితమ్మిండు పెద్దమొగసాలం జాలుమానుసులం గావలిపెట్టి యభ్యంతరంబు ప్రవేశించియుండె నక్కడఁ గౌరవసేనాసన్నివేశంబభ్యంతరవిరళ జనం బయ్యె మున్ను మాతంగతురంగసుభటబృంహితహేషితభాషణంబుల వలన శబ్దాంతరంబు గర్ణగోచరంబు గానియట్టియాశిబిరంబు నిశ్శబ్దం బయి యుండె ననిన విని యాంబికేయుం డిట్లనియె. 26

క. సూతసుత యిట్లు పగతుర,చేత మనబలంబురాజ్యసింహాసుం బంధు
వ్రాతమ్మును సమసినఁ దుది, నేతెఱఁగున నడచితిరి నక్కిరీటిఁ మీరున్. 27

వ. అనుటయు నమ్మహీకాంతునకు సంజయుం డిట్లనియె నంత నయ్యేడకుఁ గౌంతే యులు సైన్యంబును దాను సుయోధనాన్వేషణపరు లయి రయంబున నరుగు దెంచుకలకలంబు వీతెంచిన. 28

క. కృతవర్మయుఁగృపుఁడును గురు,సుతుఁడును గనుఁగొని మనొంటుక్కువో టికిఁజని ర
ట్లతిరథసంబునఁ గుంతి,సుతు లచటికి వచ్చి నీసుక్కుతుఁ బయి గడలన్. 29

వ. అన్వేషించి కానమికి విషాదంబు నొందుచు మరలి చని చనునప్పు డజాతశ త్రుండు నీపుత్త్రునగరిలోనిజనంబులఁ గృపతోడం గనుంగొని వెఱవకుండుం డని

పలికి చనియె నట్లు వారు నిజశిబిరంబునకుం జనుటయు మనయోధవరులు నేను
మనంబున నడలు గదుర నమ్మహీపుకడకుం బోయితిమి కృపాదు లగుమువ్వురు
దమరాక యెఱింగించి యమ్మనుజపతి కి ట్లనిరి. 30

## కృపకృతవర్మాశ్వత్థామలు దుర్యోధనుం గని సంభాషించుట.

క. లెమ్ము కురునాథ కడఁగుము, మమ్ముం గొని పాండుపుత్త్రమథనమునకు సై
న్యమ్మదియును నీచేతఁ గృశ, మ్మయ్యెడుఁ జుమ్ము వలదు శంకింపంగన్. 31

వ. అట్లు గాక గెలిచి భూమి యేలుట యొండెఁ జచ్చి నాకలోకసుఖం బనుభ
వించుట యొండెం గాని నీయట్టివాని కిట్టితెఱంగు కర్తవ్యంబు గాదని పలికిన
విని యవ్విభుండు వారల కి ట్లనియె. 32

చ. తనువు ఘనాస్త్రశస్త్రములఁ దాఁకున నొప్పిని దప్పి పుట్టె నా
మనము వశంబు గా దెడలె మాటలచందము సూడ మీరు డ
స్సినయటు లున్నవార లనుజీవులు లేరు తొలంగి నేఁటిమా
త్ర నిలువుఁ డెల్లి పైకొని యరాతుల గెల్తము లావు వచ్చినన్. 33

వ. అనవుడు నగ్గురునందనుండు. 34

ఉ. ఏ లనుమాన మేను సమయించెద వైరము నేఁటితోడఁ బాం
చాలుర నెల్లఁ దీవ్రశరజాలములం బొలియించి కాని భూ
పాలక పుచ్చఁ గత్తళము పాటిగఁ బట్టుము నామమాట లి
య్యాలితనంబు వాపెదఁ బ్రియం బొనరించెద నీకుఁ దండ్రికిన్. 35

వ. అనియె నప్పు డనిలసుతునివేఁటకాఱులు మాంసభారంబులతోడఁ బరిశ్రాంతు
లై జలపానార్థం బమ్మడువునకు వచ్చి రంతకు మున్ను ధర్మనందనుం డొక్కబోయం
బాడఁగని దుర్యోధనుండు దొలఁగెం జెట్టుచేమల నడంగి యుండునో మీరు
మెలంగునెడల నరయ వలయు ననిన వాఁడును వృకోదరునిమృగయులలోనివాఁ
డగుటఁ దమవారికి నెఱుక వోయి యమ్మాట తెఱం గెఱిఁగించుటం జేసి యప్పని
మనంబులం దున్నట్టియాబోయ లట్లు కొలన నేమఱి సల్లాపంబులు సేయుచున్న
యన్నరనాథుని యారథికవరులవచనంబులు విని పూర్వాఖ్యానంబువలన న
య్యుక్తిప్రత్యుక్తులపరిపాటి దేటపడిన నన్నీటిలో నీకొడుకు డాఁగి యుంట నిశ్చ
యించి తమలో నొల్లన ని ట్లనిరి. 36

క. ఈరథికులు తను నిమ్మయిఁ, బోరికిఁ దఱుమంగఁ దాను బురికొన కిచటం
గౌరవపతి డాఁగినగతి, బోరనఁ జని చెప్పవలయు భూనాథునకున్. 37

తే. అతఁడు వనదన మొసఁగు మారుతతనయుని
మున్న గని మెచ్చు వడయుద మన్నరేంద్రు
నతఁడ కాన్పించు మనల రయమునఁ బోవ
వలయు మాంసభారంబులు వలదు లెండు. 38

వ. అని మోపులు డిగవిడిచి వెసం బాఱి రయ్యవసరంబునఁ బాండునందనులు నీ
నందను వెదక ననేకచారులం బలికలనిశలంకులకుం బుచ్చి యూతెఱఁగు తమ
కగపడమికిఁ జింతాక్రాంతులై యుండ నాబోయలు భీమునిపనివారలఁ ద్రోచి
కొనుచుం దన్మందిరంబు దఱియం జొచ్చి యతనిం గాంచి యక్కొమరుపున
నమ్మహీపతి డాఁగి యునికి యెఱింగించి. 39

క. తమవిన్నమాట లన్నియుఁ, గ్రమమునఁ జెప్పిన నతండు ప్రగమఃబ్రియమఃబున న
ర్థము లొసఁగె వారికి ననేకములు వహింపంగఁ గొలఁది ప్రగా కుండంగన్. 40

వ. ఒనంగి యూలుబ్ధకుల నగ్రజుఁ గానిపించి దేవా దుర్యోధనుండు ద్వైపాయన
హ్రదంబున నొక్కటఁ గుద్రవిద్యం జేసి జలంబులు నిజశరీరంబు సోఁక కుండునట్లు
గాఁ జేసికొని డాఁగియున్నవాఁడు వీ రెఱింగి వచ్చి రని యతనికి విన్నవించి
యాసుయోధనగురునందనాదులసల్లాపంబు లెఱిఁగించిన నతండు పరమహర్షం
బున నాబోయలకు బహువిధంబు లగుపసదనంబు లిచ్చి తక్కినతమ్ములకును
గృష్ణునకుఁ జెప్పికొని వారును సకలబంధుమిత్రపరిజనంబులునుదోడన వనుదేర
నుద్దామగమనంబున. 41

తే. తురగఖురపుటరథనేమికరిపదాలి,ఘట్టనంబుల నేల గ్రక్కదల శంఖ
పణవనిస్సాణకాహళస్వరణన మెల్ల,దెసలఁ బరఁగంగ వచ్చె నహ్రదనకు నధిప.42

వ. అట్లు ధర్మనందనుం డేతెంచుకలకలం బాలకించి యంతకమున్న రణోత్సా
హంబున కై రాజు నిర్బంధించు చున్నయగ్గురుపుత్త్రి కృప కృతవర్మలతనితోని
ట్లనిరి. 43

మ. ధరణీనాయక పాండుపుత్త్రులు సముద్దామార్థులై వీర వ
చ్చిరి వీరిం బడిఁ గిట్టి తాఁకుదము నీచిత్తంబు పోరాటకుం
జొరదే నిప్పటికిం దొలంగి చని మెచ్చైన నే ముండి చె
చ్చెర రూపించినవేళఁ జెప్పినెడకుం ప్రజేరంగ నేతెంతుమో. 44

ఆ. అనుచు నానృపాలుఁ ప్రడ దుర్యోధనరులతో, నిప్పు డనికి నుత్సహింప కచటి
కేనిఁ దొలఁగిపోయి ప్రయిచటికి మఱుడంగ,రంపు పగలు ననిన్రాత్రి యఱుకు.

వ. వారు వారణపురంబున కనివారణఃబోవునదు వోదుదు గాక యిచ్చేరువఁ బోయి
రేనియు నిమ్మడుపున నాయునికి యెఱుంగలే రట్లు గాక యెఱింగిరేనియు నన్నుఁ
జేరరాదు మదీయవిద్యావిశేషసంస్తంభితాంభోవర్గంబున నిర్భయుండ నై యుం
డెదఁ బొం డనినం బొగుయుమనంబులతోడ నారథికజనంబులు వోవం బతి జలం
బులు శిలాసదృశంబులు గాఁ బరిస్తంభించి నేయుడు బాండుకుమారులవాస లెల్ల
కడల మెలంగుటం జేసి రాజు నప్పుడు వెలువరించుట కర్జంబు గా దనియు నతని
తోయస్తంభనవైదగ్ధ్యం బెఱుంగుట నొలసినయూతటను మందటితట్ల వారల
తోడం జని చని చిత్తంబు గలంగినం జనం జాలక యరవంబు డిగ్గి యచ్చట

నొక్కయెడ నొదిఁగి నిలిచెద నని వారలకుం జెప్పి యమ్మనుజపతులు నొక్క
వఱపుగలపాదపయూథంబుం దూఱి పొంచియుండిరి వారలు దూరంబు సని యొక్క
విపులవటంబుపొంత విశ్రాంతి నొంది నీనందనువలనికిం జనినహృదయంబులతోఁ
దదీయకార్యచింతాభరంబు పట్టుకొనం దదనుబంధసంభాషణంబులు సేయు
చుండి రక్కడ. 46

క. కలకల నవ్వుచుఁ బెలుచం, బలుకుచుఁ దమకెలఁకులందుఁ బాంచాలకుమా
రులు సనుదేరంగ బాండుసుతులు వచ్చిరి సంతసంబుతోఁ మడువునకున్. 47

వ. ఇట్లు వచ్చి ధర్మతనయుండు [1]భవత్తనయమాయాస్తంభితం బైనయాజలాశ
యంబు నిరూపించి తత్ప్రకారం బెఱింగించి యచ్యుతునితో నల్లన యి ట్లనియె.

క. చొరరాదు మనుజులకు నె, వ్వరికిని నిజ్జలము కౌరవక్షితిపతి ని
ర్భరమాయాసంరక్షా, [2]భరితం బై కాన వీతభయుఁ డాతండున్. 49

—❀ ధర్మరాజు మడుఁగున డాఁగియున్నదుర్యోధనుని దూఱినాడుట. ❀—

క. అని వెండియు నాపతి గురు, జననాథు గుఱించి పలుకు శక్రుఁడు దో డై
చనుదెంచెనేనిఁ జో వ, చ్చునె నాచేఁ దప్పి యిందుఁ జొచ్చినఁ దనకున్. 50

వ. అనిన విని యచ్యుతుం డతనికి నల్పస్వరంబున ని ట్లనియె. 51

ఉ. మాయలు గల్గుదుష్టులకు మాయపుభంగులె మందు గాక ని
ర్మాయత నుల్లసిల్లెడువరాక్రమలీలలు గొల్వ నెట్లు దై
తేయులు దొల్లి మాయల నతిప్రబలాత్మకు లైనఁ దద్విధో
పాయములన్ జయింపరె నృపాలక విష్ణుఁడు నింద్రుఁడుం దగన్. 52

వ. హిరణ్యకశిపువృత్రవధప్రకారంబులు వినవె రావణుండు హోమాదిమాయా
క్రియావిఘాతంబునఁ గాదె రాముచేత నిర్జింపంబడె నరకాసురు నేను బరిమా
ర్చిన తెఱం గెఱుంగవె వీఁడు నుపమునట్టివిధంబు సూచికొమ్మనిన విని యప్పాండ
వాగ్రజుండు జలాంతర్గతుం డై యున్నభవన్నందను నుద్దేశించి యి ట్లనియె. 53

చ. ఇటు తగునే సుయోధన మహీవలయంబున నిట్టిదైన్య మె
చ్చట వినఁ జూడఁ గల్గెనె యసంఖ్యులు రాజులు నీకుఁ గాఁగఁ జ
చ్చుటయును బంధుమిత్రులు విశుద్ధచరిత్రులు పోర నట్లు త్రుం
గుటయును జూచి తేమిటికిఁ గ్రుంకితి నీళ్లను జావు దప్పునే. 54

ఉ. శూరుఁడ వంద్రు నిన్ మనువు సొచ్చుట శౌర్యము చొప్పి మాన మే
యూరికిఁ బోయె నాజి నృపు లోడుదురే నృపుఁ డన్నమాత్ర యే
కౌరవవంశజాతుఁడవు గష్టపుఁ[3]జచ్చుట దెచ్చుకొంటి నీ
పేరును బెంపు మాలి యరిబృందము నవ్వఁగ నిట్లు సేయుదే. 55

1. త. భవత్తనయమాయాస్తంభి. 2. క. పరిణత మై - గ. పరీత మై - అ. భరితాత్ముఁడు.
3. అ. జావుడు.

తే. ఈ క్షత్త్రధర్మంబు విడిచినఁ § గలదె యిహముఁ
బరముఁ బేరోలగంబునఁ § బలుకుపలుకు
లెల్ల మఱచితె విను మవి § పొల్లు లైనఁ
గష్టపాటు గా కుసుఱేల § గావ వచ్చు. 56

చ. కొడుకులుఁ దమ్ములుం గలన § ఘోరవుఁజావులు సావఁ జూచి యె
ట్లోడఁబడె నీదుబుద్ధి యెడ § లోముట కైనను రాజరాజ యి
మ్మడువున కీర్తి తెచ్చు విధి § మానము ప్రాణముకంటెఁ జాల నె
క్కుడగుట సెప్పఁగా వినవొకో § కునీచతఁ బొంది తక్కటా. 57

శా. అంభోగర్భము సొచ్చి పాండుసుతబాహాగర్వదుర్వారసం
రంభం బోర్వక డాఁగి యుండె నట రాజరా జిప్పుడో చచ్చుచో
గాంభీర్యంబును ధైర్యముం విడిచి దోర్గర్వంబు బెం డయ్యెనే
శుంభన్మానము దూలెఁ గా కని జనస్తోమంబు నిందింపదే. 58

తే. కర్ణశకునిదుశ్శాసనుల్ § ఘనులుగాఁగఁ, దలఁచి వారలఁ గొని యమ్మ § గెలుచువాఁడ
వై మనంబున శంకింప § కట్లు కీడు, చేసి తాపూఁవు దప్పిన § గాసి యైతి. 59

వ. నీకొలంది గంటి మగపడితి వింక నెందుఁ బోవచ్చు నని మఱియు ని ట్లనియె. 60

మ. భయముం బాయఁగ ద్రోచి వీరగుణముం § బాటించి సంగ్రామని
శ్చయబుద్ధిం దలకొల్పి పౌరుషముమైఁ § జా వొండెఁ గెల్పొండెఁ గా
క యధీరత్వము నాకు [1]నీడ యని వీఁ§కం బేర్చి పే తాఁకు మిం
తయుఁ బేరయ్యెడు రమ్ము లె మ్మిదిఁగినన్ § దైన్యమ్ము వచ్చుం జుమీ. 61

చ. అని మను నోర్చినం బృథివి § యంతయు నేలఁగ వచ్చు లేక చ
చ్చిన సురసద్మసౌఖ్యములు § చేకుఱు రెండు దెఱంగులందు నొ
ప్పనియది లేదు డాఁగ నగుఁ§బాటును బ్రాణముచేటుఁ దెచ్చుకోల్
విను మను నీ వెదుర్పఁ దగు § వేయువిధంబులఁ జాటి చెప్పెదన్. 62

వ. తెంపు చేసి మామీఁద నుఱుకుట నీకు ధాత నిర్మించినపరమధర్మంబు పురుషుండ
వై తేని దీని ననుష్ఠింపు మనిన విని యవ్వసుమతీశునకు సుయోధనుండి ట్లనియె.

దుర్యోధనుఁడు నీరిలోన యుండి ధర్మజున కుత్తరం బిచ్చుట.

సీ. నరుఁడు ప్రాణభయంబుఁ § బొరయుట యరు దయ్యె
వినుము తెల్లంబుగా § మనుజనాథ
రథవాహసారథి§రహితుండ నగుటను
బాణాదిహేతుసం§పదలు లేమిఁ
బరివారశూన్యత § నాటిల్లుటను బంధు

1. క. నింద. గ. పేధి.

మిత్రసహాయు[1]లును మిడి యడంగఁ
జచ్చుటఁ బోటుల । నొచ్చి మేనును దప్పి
గూరి చిత్తంబును । బోరి కలయ
తే. కుసికిఁ జేసియుఁ దొలఁగితి । నొదిఁగి సేద, దేర్చుకొని రణమునకు నుద్దీర్ణవృత్తి
వచ్చువాఁడను నీవు మీవారు విశ్రమింపుఁ డంతకు మఱి రండు సొంపునూప.
వ. అని పలికినఁ బాండవాగ్రజుండు. 65
క. ఇంకఁ విశ్రమించితి, మిందు నినుం దడవి కంటి । మిప్పు డిచట నీ
కుం దేఱ డప్పి కురుపతినందన రమ్మింక రణమునకు నాయితమై. 66
వ. అనుటయు. 67
తే. ఎవ్వరికిఁ గాఁగ రాజ్యంబు । నెల్ల భోగ,ములును గోరుదు చక్కమారులును నాదు
తమ్ములును లేరు తురగరథద్విపప్రహీన యయ్యె నీ క్షోణియు । నేల పెనఁగ. 68
చ. ద్రుపదతనూజులన్ గెలిచి । దోర్బలసంపద నుల్లసిల్లి మి
మ్మపజితదర్పహీను లగునట్లుగఁ జేసి సమస్తభూపతి
త్వపదము గంటినేనియు [2]వృథారభసం బది యింపు గాదు క
ర్ణుపడుట భీష్ములేమిని గురుండు మృతుం డగుటన్ ధరాధిపా. 69
క. తనవారుఁ దానుఁ గూడఁగ, ననుభవసుఖ మందఁడేని । నది రాజ్యమె రా
జునకు భవత్పరిజనములు, ననుజన్ములు బ్రదికి రేలు । మఖిలధరిత్రిన్. 70
క. ఏ నింక సమర ముల్లము,హీనాయక నీక యుర్వి । నిచ్చితి శాంతిం
గానకుఁ జని వల్కలపరి,ధానుఁడ నై తప మొనర్చెదను మునులకడన్. 71
ఆ. ఓడి వచ్చినాఁడ । నుద్ధతి నాకేల, యుడుగ మాని నీవ । యుర్వి యేలు
గుఱ్ఱములును నేనుఁగులు లేనిబయలు నీ,తలనె కట్టికొనుము । ధర్మతనయ. 72
చ. అన విని యన్నరేశ్వరుఁడు । హాసముతో నతనిన్ గుఱించి యి
ట్లనుఁ దనుజానుజన్మసుహృదాప్తసహాయులు సన్నఁ గాదె శ
ల్యునిఁ గొని మమ్ము గెల్చి సకలోర్వియు నేలుట కుత్సహించి తీ
పనవుట లేల మాను మిది । పాటిగఁబట్టుము తెమ్ము పోరికిన్. 73
సీ. నీయిచ్చి నేను భూనాయకుఁ డగుటొల్ల, రాజకోటికిఁ బ్రతిగ్రహము నను న
నిను ననిం దెగటార్చి । నేలఁ బాలించెద, ననునోర్చితేనిఁ బెంపున సుఖంపు
మేమింటివాఁడ వై । యిచ్చితి పుడమి నీ, కనియెడుమాట యి । ట్లాడె దిపుడు
నీవు ధరిత్రి యీనేర్చినఁ గురుకులం,బునకు ని ట్లాఁడుదిఁ । బొంద నేల
తే. శాంతి నొందుట కై ధర్మ[3]సంవిభాగ,కరణ మొనరింప వచ్చిన కమలనాభు
వాక్యవృత్తిఁ బాటింపక । వాఁడి నూది,మాపినంతైన నుర్వి యీ నోప నంటి. 74
క. ఏమివిధంబునఁ బోరలియు, భూమి కురునృపాల నీకుఁ । బుచ్చుకొనఁగ రా

1. గ. లుమిడిమడంగి అ. అమ్మోయి నడంగి. 2. అ. వృథారభసంబున పుబ్బు లేదు. 3. అ. సంవిధాన

కీమెయి దైన్యపడితి నా, కేమార్గము పట్టి యిచ్చె దేర్పడఁ జెపుమా. 75

క. అరులకు సిరి యిచ్చెద నను, వెరవిఁడియుం గలఁడె దీని విడువుము నాకున్
ధర యిచ్చి తేనియును నినుఁ, బొరిగొన కే విడువ నజిమి పోరుట యొప్పన్.

క. నాచే నీప్రాణంబులు, నీచే నాజీవితంబు నిజ మున్నవి యి
న్నీచత యవకార్యము రా,జోచితకర్మకృతనిశ్చయుఁడ వగుము నృపా. 77

వ. అని వెండియు నిట్లను జతుగృహంబు దహించితి పాములం గఱపించితి నీటం ద్రోయించితి విషాన్నంబు వెట్టించితి వెన్నికపటోపాయంబులు సేసినను నీచేతఁ జెడక యునికి యెఱుంగవే యింక నట్లు యిమ్మాయలం బ్రయోజనంబు లేదు.

క. లే లెమ్ము బిరుదవై ర,మ్మాలమునకు నీవు సెఱుఁగు దవ్విధము కడున్
[1]మే లొండు తెరువు లే దిం, కేల యొదిఁగి కష్టపడ నరేశ్వర చెపుమా. 79

వ. అని యివ్విధంబున నమ్మనుజేంద్రుండు మఱియుం బలుకఁ బెఱవారు నట్ల పలికి రనిన విని ధృతరాష్ట్రుండు. 80

తే. ఇట్లు జంకింపఁబడి మఱి యేమి సేసె, నాతనూజుండు [2]మున్న నెన్నఁడును జంక
బడినవాఁడుగాఁడ కట్టపుడమినాల్గు, చెఱఁగులును వెఱఁ దనపంపు సేయ బ్రదికె.

క. పరిజనహీనత దీనతఁ, బొరసినయెడ ముట్టుకొని రిపుప్రకరము ని
ష్ఠురవాక్యమ్ముల నమ్మెయిఁ, బరితాపము సేయ నేమిభంగి నిలిచెనో. 82

వ. అనుటయు సంజయుం డమ్మనుజపతి కిట్లనియె నట్లు ధర్మతనయుండునుదమ్ములుఁ గొడుకులును ద్రుపదపుత్త్రులును బొదువుకొని పలుకుపలుకులకుఁ జిత్తం బుత్తల పడ నాననంబు పల్లటిల్లఁ గరంబులు విదిర్చి దురం బొనర్చువాఁ డైయప్పాండ వాగ్రజున కిట్లనియె. 83

సీ. మీ రేవురును బరివారబాంధవమిత్ర,సహితుల రఖిలాస్త్రశస్త్రవంతు
లరు కరిస్యందనతురగసమేతుల, రే నొకరుండ విహీనసహాచ
రత్వంబు విగతాయుధత్వంబు వాహ[3]న,హీనత నొందితి నేవిధమున
నని యొనర్పఁగ వచ్చు నది గాక పోటుల, డస్సితిఁ గడు మీకు దప్పి లేదు

తే. వరుసఁ దగ నొక్కఁడొక్కఁడ వచ్చిపోరుఁ, డిపుడ వెడలిమిమ్మందఱ నెల్ల చెలులఁ
జట్టముల రూపుమాపెదఁ జట్టుముట్టి, పలుపు [4]రొక్కనితోఁ బోరఁ బాడియగునె.

వ. అట్లు మీరు సాలరేని. 85

ఉ. తమ్ముల నన్నుఁ గేశవుని తమ్ముని ద్రౌపదియన్నదమ్ములం
గ్రమ్మన గీటడంచెద నొకండన యే నిదె వచ్చి బాహుద
ర్పమ్ముల నిర్గ్లవారమును భానుఁడు దోఁచి సముజ్జ్వలాత్మతే
జమ్మున రూపుమాపుక్రియ సజ్జత నిల్వుము సుస్థిరుండ వై. 86

తే. వినుము నీకుఁ గృష్ణునకును వెఱచి కాదు, ముంద రే నట్టులాడుట యొందుఁ జెల్లు

---

1. గ. మేలాదవు తెరువు. 2. క. ముంద రెన్నఁడును. 3. క. నాభావంబు కొం. 4. క. రొకనితోఁ బెనఁగంగఁ బాడి.

సమరధర్మంబు తెఱఁగు దెల్లముగ నెల్ల, వారలకుఁ దెల్పుటకుఁగాని వసుమతీశ.

వ. నేఁడు మీ మున్నందఱ నమయించి భీష్మద్రోణకర్ణభగదత్తబాహ్లికజయద్రథశకుని శల్యాదు లగు బంధుమిత్త్రసహాయులఋణంబు దీర్చెద నని పలికినం బాండవాగ్రజుం డిట్లనియె. 88

చ. సమరమునాఁడి నీ వెఱఁగి శత్రుల గెల్వఁగ నుత్సహించు టొ
ప్పు మనుజనాథ యొక్కఁడును బూని మహాద్భుతబాహుసంపదన్
మము వడిఁ దాఁకెదం బిలుకుమార్చెద నంట యుదాత్తమైనధై
ర్యమహిమ గాదె యిట్లనినయంతన యే నటు లేల చేసెదన్. 89

చ. వలసినయస్త్రశస్త్రములు వాహనముం గొను మొక్కరుండ నిన్
గలన జయించువాఁ డతనిగర్వము నీ వడఁగించితేని నీ
యిల సకలంబు గైకొని వహింపుము రాజ్యవిభూతి వాఁడు నిన్
దలపడి పోరుఁ జెట్టలును దక్కటివారలు నిల్చి చూడఁగన్. 90

వ. అనిన విని భవన్నందనుండు ధర్మనందనున కిట్లనియె. 91

చ. అరదము లెక్కి ఘోరవివిధాస్త్రచయంబుల మున్ను పోరమే
నరవర క్రొత్తచందమురణంబు కరంబు ప్రియంబు సేయు ని
ష్ఠురగదలం బదాతు లయి శూరతయున్ మహనీయధీరతా
స్ఫురణమునుం బొగడ్తవడఁ బోరుట మే లని నిశ్చయించితిన్. 92

తే. వింతకూరలు గుడుపున వేడ్క సేయు
భంగి సంగ్రామమున నూత్నభంగు లెడఁదఁ
గౌతుకము సేయుఁ గావున గద ధరించి
నిను సహోదరులను యోధులను జయింతు. 93

చ. అనుటయుఁ బొంగి ధర్మసుతుఁ డాతనితో గద నొక్కరుండ నేఁ
గొనియెద నీదుప్రాణము లకుంఠితబాహువిలాసభాసి నై
యనవుడుఁ బుట్టలోపలి మహాభుజగేంద్రుఁడు రోఁజునట్లు రోఁ
జె నధిప యవ్విభుండు దనచిత్తము నవ్వులకుల్ గలంచినన్. 94

దుర్యోధనుఁడు గదామండితుం డై హ్రదంబు వెడలి వచ్చుట.

వ. ఇట్లు నిశ్శ్వాసంబు నిగుడ నొడలు పొంగఁ బటుకశాఘాతంబునం గెరలుశూకలాశ్వంబుచందంబునఁ గెరలి జలస్తంభం బుడిపికొని మడువు నంక్షోభింప నవహాసితశిలాసారోదారంబును కనకపట్టికామండితంబును నైనగదాదండంబు విపులాంసపీఠంబున నమర్చుకొని వెడలె నట్లు సంరంభవిజృంభితుం డై. 95

తే. గదయుఁ దానును రుచిరశృంగమునఁ బొల్చు
పర్వతము శ్రేణి సేయునీవట్టిఁ జూచి
కాలదండంబు చేకొని లీలఁ బొల్చు
జముని గా మదిఁ దలఁచిరి జనము లెల్ల. 96

